# లోకక్షేమ గాథలు

(ధమ్మపదం కథలు)




ఆకాశస్య స్థితిర్యావద్యావచ్చ జగతః స్థితిః
తావన్మమ స్థితిర్భూయాజ్జగద్దుఃఖాని నిఘ్నతః - శాంతిదేవ

*As long as space abides and as long as the*
*world abides, so long may I abide, destroying*
*the sufferings of the world.* - *Shantideva*




బోధచైతన్య






ఆనంద బుద్ధ విహార ట్రస్ట్

సాయినగర్ : తుకారంగేట్, సికింద్రాబాద్ - 500 017,
ఫోన్ : 0091-40-7732421, ఫ్యాక్స్ : 0091-40-842477

లోకక్షేమగాథలు *

# విషయానుక్రమణిక



* *పాళీ భాషలో గాథ అంటే శ్లోకం (verse) అని అర్థం. తెలుగులో గాథ అంటే సాధారణంగా కథ అనే అర్థం వస్తుంది. ఈ పుస్తకంలో ధమ్మపదంలోని కొన్ని శ్లోకాలకు సందర్భం తెలిపే కథలున్నాయి కనుక పుస్తకానికి గాథలు అనే పేరు చక్కగా కుదిరింది.*

# తొలి పలుకు

ధర్మపదం శ్లోకాలకు ముడిపెట్టూ ఇందులో ముప్పై నాలుగు అధ్యాత్మ కథలున్నాయి. ఒక కథను పోలి మరొకటి ఉండదు. దేనికది విలక్షణం. ఈ విలక్షణత ధర్మపదం శ్లోకాల్లోనూ ఉన్నది. శ్లోకాలను వరుసగా చదువవలసిన అవసరం లేదు. ఇష్టం వచ్చిన శ్లోకాన్ని తీసుకోవచ్చును. అలాగే ఈ కథలున్నూ. మొదట్నుంచి ఒక క్రమంలోనే చదువాల్సిన అవసరం లేదు. చదువుతూ పోతుంటే ఏదైనా ఒక కథ నచ్చనిది పాఠకుడికి ఎదురైతే దాన్ని వదిలేసి మరో కథకు పోవచ్చును. నష్టం ఏమీ లేదు. ఈ ముప్పై నాలుగు కథల గురించి ముందుగానే పాఠకులకు ఏకవాక్య పరిచయం చేస్తే బాగుంటుందని భావించి క్రింది విషయం వ్రాస్తున్నాను.

ప్రార్థన ప్రభావాన్ని (efficacy of prayer) మత్తకుండలి కథ తెలుపుతుంది. ద్వేషాన్ని మైత్రి ద్వారానే జయించాలని దీర్ఘాయువు కథ. నియమనిష్ఠాపరుడైన భిక్షువు (monk) సహితం పతనం కావడానికి కేవలం స్థూల కారణాలే కాదు, సూక్ష్మ కారణాలు ఎన్నైనా ఉంటాయని భిక్షువులకు హితబోధగా దేవదత్తుని కథ. అప్రమాదం (vigilance) ఆధ్యాత్మికతకు ఎంత అవసరమో శ్యామావతి కథ. ఆధ్యాత్మ జిజ్ఞాసువు ఏ చోటికంటే ఆ చోటికి పోతూ వస్తూ కాలయాపన చేయడం కంటే సరైన మార్గం తెలిపే చోటికి పోతే ప్రయోజనం అని శుభకరసింహుని కథ. రోగపీడితులకు తోటి మానవుని సహాయం అవసరమనే విషయాన్ని అస్వస్థభిక్షువు కథ తెలుపుతుంది. మూర్ఖత్వం వలన మనిషి ఎంత నష్టపోతాడో నందగోపుని కథ. అనిత్యత అనే అధ్యాత్మ సత్యాన్ని ఉపమానాల ద్వారా గ్రహించిన భిక్షువు కథ మరీచిక. లోకాభిరామాయణం అనే సర్వవ్యాపి రోగం ఏ తీరులో ఉంటుందో

ఒక సూచనగా చెప్పిన కథ సప్తవర్గీయుల కథ. ఈ విషయాన్ని వివరంగా తెలుపాలంటే ఒక పుస్తకమే అవసరం అవుతుంది. అధ్యాత్మ బోధకుడు భారరహిత (without much luggage) జీవితాన్ని జీవిస్తేనే శోభిస్తుంది, అతని మాటలకు విలువ ఉంటుంది అని లోకక్షేముని కథ. ఇతరులను తూకం వేస్తూ వాదోపవాదాలు చేసుకొంటూ జీవితం నెట్టడం మంచిది కాదని గయాశీర్షుని కథ. అధ్యాత్మ బోధనలు హృదయంలో చొరబడకపోవడానికి గల అడ్డంకులను చత్రపాణి కథ తెలుపుతుంది. ప్రపంచం మహా పాపిష్ఠిది అని వేలెత్తి చూపే ధోరణికి (cynicism) పరమార్థ చింతనే ఔషధం అని తెలుపుతుంది కుండలకేశి కథ. అధ్యాత్మ లక్ష్యాల్లో ఉపేక్ష (equanimity) అనే లక్ష్యం చాలా గొప్పది. ఈ గొప్ప లక్ష్యానికి కరుణ కూడా జత అయితే ఇక ఆ భిక్షువుకు మించిన భిక్షువు మూడులోకాలు గాలించినా దొరకడు అనే విషయాన్ని కుమారజీవుని కథ తెలుపుతుంది. బుద్ధుని కాలంలో ప్రసిద్ధుడైన వైద్యుడు జీవకుణ్ణి, కిటుకులు (gymmics) చేసే అతని ప్రత్యర్థిని (rival) తెలుపుతూ చివర అర్హతుని లక్షణంతో జీవకుని కథ ముగుస్తుంది. సామర్థ్యం, చురుకుదనం, తెలివితేటలతో బాటు అవినయం, దుడుకుదనం, అలక్ష్యభావం ఉన్న వ్యక్తి బుద్ధుని ప్రభావం వల్ల ఎంత సౌమ్యుడయిపోయాడో తెలిపే కథ పూర్ణుడు. కేవల తర్కజ్ఞానం వల్ల జీవిత సమస్యలకు పరిష్కారం లేదు, ఆధ్యాత్మికత వల్లనే పరిష్కారమని రేవతుని కథ. కష్టపడి సంపాయించిన ధనాన్ని ఎలా వినియోగించాలనే విషయాన్ని శారిపుత్రుని మేనమామ కథ. దుఃఖతప్తులైనవారు మళ్ళీ కొత్త జీవితానికి రావడం అనే విషయం పటాచార కథ. వయస్సును గౌరవించాలనే విషయాన్ని చెప్పే అద్భుతమైన కథ తిత్తిరీయబ్రహ్మచర్యం. దాంభికాలు పలికే భిక్షువు కథ ఉదయి కథ. చివర బుద్ధుని మహోపదేశం ఉంటుంది. రాగచరితులకు కనువిప్పుగా ఉండే కథ సిరిమ. కర్మ - కర్మఫలం అనే నియతిని బోధిస్తుంది పరిత్రాణముల కథ. బుద్ధుని ఆశ్చర్యమానుష లక్షణాలు ప్రస్తావించే కథ మాగంధియుడు. తొందరపడి పెండ్లిచేసుకొని తరువాత

భక్తిమార్గంలోకి మళ్ళిన కథ ఉగ్రసేనుడు. ఆదర్శ గృహిణి (family woman) కథ నకులమాత. హృదయాలను వికసింపజేసే సద్ధర్మం తెలియని ప్రజలకు కూడా అది తెలిస్తే బాగుంటుందనే ఆరాటాన్ని తెలిపే కథ సుభద్ర. నిందావాక్యాలకు, దూషణలకు భయపడి పారిపోరాదనే సందేశాన్నిచ్చేది బాలనక్షత్రం. వృద్ధాప్యం చేరిన తలిదండ్రుల పట్ల నడుచుకోవలసిన చక్కని ఆదర్శాన్ని తెలిపే కథ ధనపాలుడు. మహాపురుషులకు నగరమైనా ఒకటే కీకారణ్యమైనా ఒకటే అనే విషయాన్ని వివరించే కథ పాలిలేయకం. పదాలకు అర్థం తెలియకుండా గడించే పదపాండిత్యం అహంకారాన్ని దర్పాన్ని పెంచుతుందని కపిలుని కథ. లోకంలో ఎన్నో ఆకర్షణలుంటాయి, కానీ భిక్షువులు వారి జాగ్రత్తలో వారుండాలి అనే సందేశాన్నిచ్చేది శూరంగముడు. ఆర్థికంగా ఇక ఎన్నటికీ కోలుకోని దెబ్బతిన్న వ్యక్తి ఆ దెబ్బ నుండి బైటపడిన విధానాన్ని కర్మపాలుడు కథ తెలుపుతుంది. వేద ఋషుల మీద బుద్ధునికి చాలా గౌరవం అనే విషయాన్ని వశిష్ఠుడు కథ తెలుపుతుంది.

**2542 బుద్ధ జయంతి** **బోధచైతన్య**

హైదరాబాదు.

# మత్తకుండలి

మనిషిని మృత్యువు ఒడిలోకి చేర్చే 404 వ్యాధుల్లో ఒక వ్యాధి వల్ల మత్తకుండలి అనే బ్రాహ్మణ యువకుడు లేవలేని, మాట్లాడలేని స్థితికి చేరుకొన్నాడు. మరణం ఆసన్నమైందని అతనికి తెలిసిపోయింది. కన్నులు మూసుకొన్నాడు. బుద్ధుని ప్రసన్న గంభీర కరుణా రూపం స్మృతిపథంలోకి వచ్చింది. మనస్సులో ఇలా ప్రార్థించాడు. "ఆదిత్యబంధూ, శాక్యమునీ, లోకనాథా, దయానిధీ ఇప్పుడు నీ దర్శనం కోసం నడిచివచ్చే స్థితిలో లేను. చేతులెత్తి నమస్కరించే స్థితిలోనూ లేను. మాట పడిపోయినందువల్ల నీ స్తుతిని కూడా చేయలేకున్నాను. బాగా ఉన్న దినాల్లో మీ ఉపదేశాల విలువను అవసరాన్ని గుర్తించని మూఢునిగానే జీవితం గడిపివేశాను. ఇక్కడ నేనొక ఆగంతుకుణ్ణి (stranger, traveller) అనే విషయం గమనించకపోవడం వల్ల చాలా అనర్థం జరిగిపోయింది. అతిథిగా కొన్నాళ్ళుండి వెళ్ళిపోవలిసినవాడిననే అవగాహన లేకపోవడం వల్ల రాగద్వేషాలు పెంచుకొని అకుశల కర్మలు (unskilled or improper actions) చాలా చేశాను. నాకోసం ఎంతో త్యాగం చేసిన తలిదండ్రుల పట్ల చాలా నిర్లక్ష్యంగా నడుచుకొన్నాను. పెద్దలను గురువులను హేళనగా మాట్లాడాను. పరుషవాక్కులతో చాలా మందిని గాయపరచాను. మీ దివ్య వచనాలను పూర్వం యథేచ్ఛగా ఉల్లంఘించి ఇప్పుడు పశ్చాత్తాపంతో తపించిపోతున్నాను. ఓ దయాసముద్రా, నా తప్పులన్నిటినీ క్షమించి నన్ను అనుగ్రహించు. నా పుణ్యవృద్ధి కోసం నా మానసిక పూజను స్వీకరించవలసినదిగా మనవి చేస్తున్నాను. ఈ భూమాత ఒడిలో ఎన్నో సుగంధపుష్పాలు, రసభరితఫలాలు, పరమ పవిత్రమైన తులసి బిల్వ దళాలు, పుణ్యనదీ జలాలున్నాయి. వాటినన్నిటినీ భక్తితో నీకు మానసికంగా సమర్పిస్తున్నాను.

పుణ్యభాగీరథీనది ఇసుకరేణువులు ఎన్ని ఉన్నాయో అన్ని సాష్టాంగ నమస్కారములు చేస్తున్నాను. శరణు శరణు దేవా!"

ఆ భక్తిభావం వల్ల, ఆ శ్రద్ధ వల్ల, ఆ ప్రార్థన వల్ల, ఆ మానసిక పూజ వల్ల అతని చిత్తంలో బలమైన పుణ్యసంస్కారములు ఉద్భవించాయి. తనువు విడిచినప్పుడు ఆ పుణ్యబలం, సహాయంగా నిలిచి త్రయత్రింశత్ దేవలోకానికి అతణ్ణి చేర్చింది.

ఒకనాటి భిక్షు సమావేశంలో దివ్యజ్ఞాన సంపన్నుడైన తథాగతుడు మత్తకుండలి ప్రస్తావన చేస్తూ క్రింది శ్లోకాన్ని చెప్పాడు.

**మనఃపూర్వంగమా ధర్మా మనఃశ్రేష్ఠా మనోమయాః**
**మనసా చేత్ ప్రసన్నేన భాషతే వా కరోతి వా**
**తత ఏనం సుఖమన్వేతి ఛాయేవాஉనపాయినీ** 1-2

మనో వాక్కాయ కర్మలు ఏది జరుగాలన్నా ముందుగా మనస్సులో ఆయా పనులకు సంబంధించిన సంకల్ప చేతన ("ఇలా ఇలా ఆలోచిస్తాను, ఇలా ఇలా మాట్లాడుతాను, ఇలా ఇలా నడుచుకొంటాను" అనేటువంటి మనఃస్పందనకు పేరు చేతన - ఇంగ్లీషులో intention, volition, will) తలెత్తాలి. కనుక కర్మల విషయంలో మనస్సే ప్రధానం. మనస్సు ఏ తీరుగా ఉంటుందో పనులూ ఆ తీరుగానే ఉంటాయి. రాగద్వేషాలు లేని ప్రసన్నమైన మనస్సుతో ఎవడైతే మాట్లాడుతాడో పనులు చేస్తాడో అట్టివానిని సుఖం నీడలాగా అనుసరిస్తుంది.



# దీర్ఘాయుః

కాశి, కోసల రాజులకు 32 తరాలుగా వైరం. ఒక తరంలో కాశీరాజైన బ్రహ్మదత్తుడు పెద్ద సైన్యాన్ని సమకూర్చుకొని కోసల మీదికి దండెత్తాడు. అప్పుడు కోసలరాజ్య రక్షణ వ్యవస్థ బలహీనంగా ఉండినది. కోసలరాజు దీధితి యుద్ధంలో పరాజయం తప్పదని తలచి మారువేషం ధరించి గర్భవతిగా ఉన్న భార్యను వెంటబెట్టుకొని రహస్యమార్గం ద్వారా కోటనుండి బైటపడినాడు. బ్రహ్మదత్తుడు తనను వెదకి పట్టుకొనే ప్రయత్నాలు చేస్తాడని తెలుసు కనుక అతనికి అనుమానం కలుగని ప్రదేశమే తనకు క్షేమమని భావించి కాశీనగరానికి చేరి ఒక కుమ్మరి ఇంట తలదాచుకొన్నాడు. బ్రహ్మదత్తుడు కోసలను స్వాధీనం చేసుకొని కాశీనగరానికి తిరిగివచ్చి దీధితిని వెదకిపట్టుకొనే ప్రయత్నాలను ముమ్మరం చేశాడు. అగ్నిశేషం, శత్రుశేషం ఉండరాదని అతని భావన.

కుమ్మరి ఇంట తలదాచుకొన్న కొన్నాళ్ళకు దీధితికి కుమారుడు కలిగాడు. ఆ బిడ్డకు దీర్ఘాయువు అనే పేరు పెట్టాడు. పదహారు సంవత్సరముల వరకు అతణ్ణి తన దగ్గరే ఉంచుకొని తనకు తెలిసిన విద్యలన్నీ నేర్పి "నాయనా దీర్ఘాయూ, మనం కుమ్మరులం కాము. కోసల సింహాసనం పోగొట్టుకున్నవాణ్ణి నేను. నీవు ఆ సింహాసనానికి వారసుడవు. ఇదీ మన కథ. పరిస్థితులు ఒక్కలాగా ఉండవు. ఇంతవరకు ఇక్కడ క్షేమంగా గడిపాము. ఎప్పుడేమవుతుందో చెప్పలేము. మా ఆశాజ్యోతివి నీవు. నీవు భద్రంగా ఉండాలి. కనుక నీవు మాకు దూరంగా ఊరి వెలుపలగా ఎక్కడైనా భద్రమైన చోటు నివాసంగా చూసుకొని జాగ్రత్తగా ఉండుము" అని దీవించి పంపాడు.

* * *

కోసలరాజుకు మంగలిగా పని చేసిన సుకేశునికి స్వంత దేశంలో జీవనం సుఖంగా ఉండడం లేదు. రాజులకు క్షవరం చేసిన చేయి మామూలు ప్రజలకు చేయాలంటే బద్ధకిస్తుంది కనుక అతను మేలైన జీవనం కోసం రాజులనే ఆశ్రయించాలనే ప్రయత్నంగా కాశీనగరానికి వచ్చాడు. ఆ నగరంలోని కుమ్మరవీధిలో వెళ్తుండగా ఒక ఇంటి ముందు సారెను త్రిప్పుతూ ఏకాగ్రచిత్తంతో ఘటనిర్మాణంలో లగ్నమైన ఒక వ్యక్తిని చూసి చాలా ఆశ్చర్యం చెంది నిజమో కాదో అని సంశయించి మళ్ళీ పరిశీలనగా చూసి నిజమే అని తేల్చుకొని తల పంకిస్తూ ఏదో దీర్ఘంగా ఆలోచిస్తూ వెళ్ళిపోయాడు.

రాజాశ్రయ సంపాదన మీదనే మనస్సుంచిన సుకేశుడు బ్రహ్మదత్తుని దర్శనం పొంది దీధితి దాక్కొనియున్న చోటును తెలిపాడు. బ్రహ్మదత్తుడు ఒక క్షణం ఆలస్యం చేయలేదు. భటులను కుమ్మరవీధికి పరుగెత్తించాడు. దీధితిని, అతని భార్యను బంధించి ఇద్దర్నీ చేర్చి కట్టి ఒక బండి మీద ఎక్కించి నాలుగు వీధులు త్రిప్పి ఆ తరువాత వధ్యశాలలో వధించమని వారిని ఆజ్ఞాపించాడు.

తలిదండ్రులను ఒకసారి చూసి రావాలనిపించి దీర్ఘాయువు నగరం లోకి ప్రవేశించాడు. వధ్యశాలకు తీసుకొనిపోబడుతున్న తలిదండ్రులు కనిపించారు. దీర్ఘాయువు మిక్కుటమైన కోపంతో ఊగిపోయాడు. కుమారుని రౌద్రవదనాన్ని చూసిన దీధితి "నాయనా, ద్వేషం ద్వేషంతో చల్లారదు. మైత్రి వల్లనే చల్లారుతుంది. ఇది నా చివరి సందేశం. మరచిపోవద్దు" అన్నాడు పరమ శాంతంగా.

* * *

బ్రహ్మదత్తుడు సుఖంగా నిదురిస్తున్నాడు కానీ ఇంకా శత్రుశేషం ఉందని మాత్రం భావిస్తున్నాడు. కుమ్మరవీధి నుండి అందిన సమాచారాన్ని బట్టి దీధితికి పదహారేండ్ల కుమారుడున్నాడు. కానీ ఎక్కడున్నాడో ఎవరికీ తెలియదు. పేరు దీర్ఘాయువు.

* * *

ఒకనాటి ప్రాతఃకాలం. నిదురనుండి మేల్కొన్న బ్రహ్మదత్తునికి దివ్యమైన వేణుగానం గజశాల నుండి వినిపించింది. ఆ గాన మాధుర్యానికి తన్మయుడై పోయాడు. ప్రధాన మావటివానిని పిలిపించి "ఆ వేణుగానం చేసిందెవరు?" అని ప్రశ్నించాడు. "దేవా, అతడు నా శిష్యుడు. గజదమన విద్యను నా దగ్గరనుండి నేర్చుకోడానికోసం మొన్ననే వచ్చి చేరాడు. చాలా మంచి కుర్రవాడు" అన్నాడు మావటివాడు. "ఆ పిల్లవాణ్ణి నావద్దకు వెంటనే పంపించు" అని బ్రహ్మదత్తుడు ఆజ్ఞాపించాడు.

* * *

శుభగుప్తుడు దివ్యమైన వేణుగానంతో కాశీరాజును అలరిస్తూ అచిరకాలంలోనే అతనికి అంతరంగికుడయ్యాడు. ఒకనాడు బ్రహ్మదత్తునికి మృగయా వినోదం (pleasure of hunting) మీదికి మనస్సు మళ్ళింది. శుభగుప్తుణ్ణి సారథిగా తీసుకొని అడవికి బయలుదేరాడు. బ్రహ్మదత్తుడు అడవిలో వాహనాన్ని ఇష్టం వచ్చినట్లుగా పోనివ్వడం వల్ల రక్షణదళానికి అతని జాడ తెలియనంత దూరం వెళ్ళిపోయాడు.

"శుభా, నాకు చాలా అలసటగా ఉంది. వాహనం ఆపు. కాసేపు ఆ చెట్టు క్రింద నీ ఒడిలో తల పెట్టుకొని విశ్రమిస్తాను" అని బ్రహ్మదత్తుడు వాహనం దిగి చెట్టు క్రింద మేను వాల్చి వెంటనే నిదురలోకి వెళ్ళిపోయాడు. శుభగుప్తుడెవరో కాదు, దీర్ఘాయువే. ఆ అదను కోసమే దీర్ఘాయువు చాలా ఓపికగా ఎదురు చూస్తున్నాడు. ఒర నుండి కత్తిని పైకి తీశాడు. "ఒక్క వేటుతో ఇతని తల తెగి మూడడుగుల అవతల ఎగిరి పడాలి" అని దీర్ఘాయువు సంకల్పిస్తూ ఉండగానే తండ్రి పలికిన సందేశవాక్యాలు స్మృతిపథంలో తళుక్కున

మెరిశాయి. "నాయనా, ద్వేషం ద్వేషంతో చల్లారదు. మైత్రి వల్లనే చల్లారుతుంది." కత్తిని ఒరలోకి దించేశాడు. కొన్ని క్షణాల తరువాత ఆవేశంగా మళ్ళీ కత్తిని ఒర నుండి పైకి తీశాడు. తండ్రి సందేశం మళ్ళీ స్మృతిపథంలో మెరిసింది. కత్తిని మళ్ళీ ఒరలోకి దించేశాడు. ఇంతలో బ్రహ్మదత్తుడు 'మ్మ్మ్మ్మ్మ్' అని మూలుగుతూ చేతులు కాళ్ళు విదిలించుకొంటూ గాబరాగా మేల్కొని లేచి కూర్చొన్నాడు. "శుభా, చాలా భయంకరమైన పీడకల వచ్చింది. దీధితి కొడుకు దీర్ఘాయువు నన్ను చంపడానికి కత్తితో మీదికి లంఘించిన దృశ్యం కలలో కనబడింది. ఆ భయం నన్నింకా వదలడంలేదు. ఏదీ నీ చేయి ఇలా ఇవ్వు" అన్నాడు కాతరంగా.

దీర్ఘాయువు ఒక చేతితో అతని తల నిమురుతూ మరో చేతితో కత్తిని ఎత్తిపట్టుకొని "రాజా, నేనే దీర్ఘాయువు. నీవల్ల మా రాజ్యానికి మా వంశానికి తీరని అపకారం జరిగింది. నా తలిదండ్రులను కిరాతకంగా చంపించావు. నిన్ను చంపితేగాని నా పగ చల్లారదు. ఆ పని ఈ వరకే అయ్యుండేది. నా తండ్రి ఇచ్చిన చివరి సందేశం వల్ల బ్రతికిపోయావు" అన్నాడు ప్రశాంతంగా దీర్ఘాయువు. బ్రహ్మదత్తుడు అతని కాళ్ళమీద పడి ప్రాణభిక్షను అర్థించాడు. "నేనీవరకే ఆ భిక్షను నీకు ఇచ్చియున్నాను. మరి నా విషయం ఏమిటి? నాకు ఆ భిక్ష నీ నుండి అవసరం లేదా?" అన్నాడు దీర్ఘాయువు. "నావల్ల నీ ప్రాణానికి ఎలాంటి ముప్పు జరుగదని ఈ అడవితల్లి సాక్షిగా శపథం చేస్తున్నాను. కాశీరాజుల శపథం ఏమిటో నీకు తెలుసుగదా!" అన్నాడు బ్రహ్మదత్తుడు.

* * *

కోసలరాజ్యాన్ని దీర్ఘాయువుకు అప్పగించి బ్రహ్మదత్తుడు అతణ్ణి సగౌరవంగా సాగనంపుతూ "మిత్రమా, నీ వేణుగాన మాధుర్యం కన్నా నా వీనులకు ఎక్కువ

ప్రీతినిచ్చేది లోకంలో ఒకటే. మీ నాన్నగారి చరమ సందేశం. ఆ అమృతవాక్కులు మళ్ళీ ఒకసారి బోధించు" అని ప్రాధేయపడినాడు.

"మన రెండు వంశాలు ముప్పై రెండు తరాలుగా ఒకరిమీద ఒకరు పగ సాధించుకొంటూ వచ్చారు. నీవు నా తలిదండ్రులను చంపావు. నేను నిన్ను చంపి పగ సాధించియుంటే ఏమయ్యేది? నీకు కావలసినవాళ్ళు అదను చూసి నన్ను చంపేవాళ్ళు. నా వాళ్ళు మళ్ళీ అదను చూసి మీ వాళ్ళను చంపేవాళ్ళు. ఇలా యుగాంతం వరకూ జరిగినా ద్వేషం ద్వేషంగానే ఉండిపోతుంది. అది చల్లారదు. మైత్రి వల్లనే చల్లారుతుంది. మా నాన్నగారి చరమ సందేశ ప్రభావంతో మన ఇరువంశాల మధ్య ద్వేషం అంతరించింది. మైత్రి (loving kindness) నెలకొనింది" అన్నాడు దీర్ఘాయువు.

ఈ పురాతన వృత్తాంతాన్ని ఒకనాటి భిక్షు సమావేశంలో బుద్ధుడు చెప్పి దానికి సరిపోయే క్రింది శ్లోకాలను కూడా చెప్పాడు.

***ఆక్రోశీత్ మాం అవధీత్ అజైషీత్ మాం అహార్షీత్ మే***
***యే చ తత్ ఉపనహ్యంతి తేషాం వైరం న శామ్యతి*** **1-3**

"నన్ను తిట్టాడు; నన్ను అవమానించాడు; నన్ను ఓడించాడు; నన్ను దోచుకున్నాడు" అని జరిగిపోయిన దురదృష్ట సంఘటనలను ఎవరైతే అదే పనిగా నెమరవేసుకొంటూ ఉంటారో అట్టి వారికి వైరబుద్ధి శమించదు.

***ఆక్రోశీత్ మాం అవధీత్ మాం అజైషీత్ మాం అహార్షీత్ మే***
***యే చ తత్ నోపనహ్యంతి వైరం తేషూపశామ్యతి*** **1-4**

గతించిన దుర్ఘటనలను నెమరువేయని వారిలో వైరబుద్ధి శమిస్తుంది.

(ప్రకృతి వైపరీత్యాల వల్ల నాకింత నష్టం జరిగియుంటే ప్రకృతి మీద ద్వేషాన్ని పెంచుకొంటూ కూర్చుంటానా? అంతా నేను చేసుకున్న కర్మ అని సరిపెట్టుకొని మామూలు మనిషినవుతాను. వ్యక్తుల వల్ల జరిగితే మాత్రం ఎందుకిలా వైరబుద్ధి వదలకుండా పట్టుకుంటుంది? 'వాళ్ళు కావాలనే పనికట్టుకొని అపకారబుద్ధితో నాకింత నష్టం తెచ్చిపెట్టారు' అనుకోవడం పెద్ద పొరబాటు. వాళ్ళు, అంతటి స్వతంత్రులేమీ కారు. క్లేశ పాశాలచే బరబరా లాగబడుతూ పోతున్నట్టి దుఃఖితులే వాళ్ళున్నూ. క్లేశప్రేరితులై నాకు అపకారం చేశారు. వాళ్ళకు తగిన శాస్తి చేయాలనే సంకల్పం నాకెందుకు? వాళ్ళ కర్మలే వాళ్ళను ఎప్పుడు ఎక్కడ ఎలా కొట్టాలో అలా కొట్టాయి - ఇలా విచారించి పరాపకారమర్షణక్షాంతిని పెంపొందించుకొన్నవానికి వైరబుద్ధి నశిస్తుంది)

***నహి వైరేణ వైరాణి శామ్యంతీహ కదాచన***
***అవైరేణ చ శామ్యంతి ఏషధర్మః సనాతనః*** **1-5**

ఈ లోకంలో ఎప్పుడుగానీ వైరం చేత వైరం శమించలేదు. మైత్రీభావం (loving kindness) వల్లనే వైరములు శమిస్తాయి. ఇదియే సనాతనధర్మం (eternal law).



# దేవదత్తుడు

బాహ్యదృష్టికి దేవదత్తుడు పరమ ఆదర్శనీయ భిక్షువు. వస్త్రధారణ, అన్నపానీయాలు, శయన ఆసనాలు మొ॥ బాహ్యదృష్టి గోచర విషయాల్లో భిక్షునియమాలను తు.చ. తప్పక పాటించేవాడు. ప్రజల్లోనూ భిక్షువుల్లోనూ అతనికి మంచి గుర్తింపు ఉన్నది. తపస్సులో (austerity) నిర్గంథనాథపుత్రునికి సమానుడెవరనే ప్రశ్న వేస్తే చాలా మంది దేవదత్తుని పేరే చెబుతారు.

కానీ అతని మొత్తం జీవితం గాడి తప్పిన జీవితం. ప్రాధాన్యతల (priorities) విషయంలో గందరగోళం పాలయ్యాడు. ఆహారం, ఔషధాలు, వస్త్రాలు, వసతి - ఇవి ఎవరికైనా అవసరమైనట్టివే. ఈ జీవన అవసరాల పట్ల దోషదృష్టి కూడదు. ఈ అవసరాలను (needs) దేవదత్తుడు కోరికలు (desires) అని భ్రమించి వీటి విషయంలో లేనిపోని నియమాలు నెత్తిన రుద్దుకొన్నాడు. వీలుపడితే తక్కినవాళ్ళ మీద కూడా రుద్దడం చేస్తూ వచ్చాడు. జీవితానికి బొత్తిగా అవసరం లేనట్టివి, గడ్డిపోచ విలువ చేయనట్టివి కొన్ని ఉన్నాయి. పాదపూజలు, సన్మానాలు, సత్కారాలు, పూలమాలలు, పూర్ణకుంభాలు, పేరు ప్రతిష్ఠల కండూతి, బిరుదుల పిపాస, అధికార దాహం ఇత్యాదులు. వాస్తవానికి ఇవి వాంఛలు (desires). వీటికోసం ప్రాకులాడేవాని జీవితం నిజంగా గాడి తప్పిన జీవితం. దేవదత్తునిదీ అదే అయ్యింది.

భిక్షుసంఘానికి నాయకుణ్ణి కావాలనే వాంఛ దేవదత్తుణ్ణి పీడించింది. ఒకనాడు బుద్ధుణ్ణి సమీపించి "శాక్యమునీ, మీరు వృద్ధులవుతున్నారు. భిక్షుసంఘం వేలకొలది సభ్యులతో అనేక కేంద్రాల్లో విస్తరించింది. ఈ నిర్వహణ భారం మీరు ఇంకా మోయడం ఎందుకు? నాయకత్వం నాకప్పగించండి. నేనూ మీలాగా

←

శాక్యపుత్రుణ్ణి కనుక మీ వారసత్వం నాకు సంక్రమించడం సముచితంగా ఉంటుంది. అదీగాక భిక్షుసంఘంలో అత్యధికులు నన్నే తగిన వారసునిగా భావిస్తున్నారు" అన్నాడు.

"దేవదత్తా, ఏమిటి నీవనేది? చాలా వింతగా మాట్లాడుతున్నావు. నాయకత్వం ఏమిటి? వారసత్వం ఏమిటి? ఈ భిక్షుసంఘాన్ని స్థాపించినవాడుగా నన్ను నేను ఎన్నడూ భావించలేదు. దీనికి నాయకుడుగానూ భావించుకోలేదు. ఈ విహారాలు, ఆరామాలు నా ఆస్తిగానూ భావించలేదు. గత నలభై సంవత్సరాలుగా నేను చేస్తూ వచ్చింది ఒకటే. భవ్యులు (eligible persons) ఎవరైనా ఎదురైతే 'ఏహి భిక్షో చర బ్రహ్మచర్యం' (come o monk, lead religious life) అని పిలుపునిస్తూ వచ్చాను. నాయకుడు, అనుచరులు అనే వ్యవహారానికి ఇక్కడ తావు లేదు. ఇక్కడ అందరూ సమానులే. నడిపించేవాడు నడిచేవాళ్ళు అనే విభాగం లేదు. ఎవరికి వారు వెలుగుబాట వేసుకొని ముందుకు నడవవలసిన కార్యక్రమమిది. ప్రాజ్ఞులలో అగ్రేసరుడైన శారిపుత్రుణ్ణి కూడా నేను నాయకునిగా నియమించను. ఇక ఇతరుల విషయం ఎందుకు? వెళ్ళు" అన్నాడు బుద్ధుడు.

మరొక దినం దేవదత్తుడు బుద్ధుణ్ణి సమీపించి "మన భిక్షుసంఘంలోని భిక్షువుల జీవనశైలిలో (style of living) మార్పులు తీసుకరావలసిన ఆవశ్యకత కనబడుచున్నది. భిక్షుజీవనం అనే పదం సుఖజీవనం అనే పదానికి పర్యాయపదంగా మారిపోకూడదు. మన భిక్షువులు చాలా మంది సుఖానికి మరిగినారు. సనాతన భిక్షుధర్మాలకు తిలోదకాలిస్తున్నారు. కనుక సంస్కరణలు చేపట్టవలసిన అవసరం ఏర్పడింది. మన భిక్షువులందరూ విధిగా ధూతాంగములను* (austere practices) పాటించే నియమాన్ని మనం పెట్టుకోవాలి" అన్నాడు. బుద్ధుడు సమ్మతించలేదు.

---

* **ధూతాంగములు పదమూడు :**

*1. పాంశుకూలిక: = wearing patched-up robes. 2. త్రైచీవరిక: = wearing only three robes 3. పైండపాతిక: = going for alms 4. సపదానిక: = not omitting any house whilst going for alms 5. ఐకాసనిక: = eating at one sitting one meal a day eater*

→

"తప్పనిసరి నియమంగా (compulsory) కాకుండా ఐచ్ఛిక అంశంగా (optional) అది ఉండనీ, మంచిదే" అన్నాడు.

తనను ఎదగనీయకుండా బుద్ధుడు అడ్డుకొంటున్నాడని దేవదత్తుడు భావించి కోపం పెంచుకొన్నాడు. సంఘభేదనం అనే మహాపరాధానికి ఒడిగట్టి కొన్ని వందలమంది భిక్షువులను తన పక్షానికి త్రిప్పుకొని వాళ్ళను తనవెంట తీసుకొని వెళ్ళి వేరే భిక్షుసంఘాన్ని ఏర్పాటు చేసుకొన్నాడు. ఎక్కడో మగధలో పర్యటిస్తున్న శారిపుత్ర మౌద్గల్యాయనులకు సంఘభేదన వార్త చేరింది. వారిరువురూ హుటాహుటి కోసలకు వచ్చి బైటకు వెళ్ళిపోయిన ఆ భిక్షువులలో ఐదువందల మందిని మళ్ళీ స్వంతగూటికి వచ్చేలా చేయగలిగారు.

దేవదత్తుని ప్రతిప్రయత్నమూ విఫలం కావడంతో అతడు పరమ క్రుద్ధుడై యుక్తాయుక్త వివేచనం కోల్పోయాడు. బుద్ధుణ్ణి అంతం చేసేందుకు పరమనికృష్ట ప్రయత్నాలు కూడా చేశాడు. గృధ్రకూట పర్వతాన్ని అధిరోహిస్తున్న బుద్ధుని మీదికి ఒక మహాశిలను దొర్లించాడు. బుద్ధునికి ఏమీ కాలేదు కానీ ఆ శిలనుండి ఒక తునక చెదిరి బుద్ధుని కాలి బొటనవేలికి గాయం అయ్యింది. ఒకనాడు రాజగృహంలో భిక్షాటన చేస్తున్న బుద్ధుని మీదికి దేవదత్తుడు నాలాగిరి అనే మదించిన ఏనుగును ఉసిగొల్పాడు. నాలాగిరి ప్రచండ స్వైరవిహారం దెబ్బకు ఆ వీధి వీధి అంతా ఒక్క క్షణంలోనే నిర్మానుష్యం అయిపోయింది-బుద్ధుడు, ప్రక్కన ఆనందుడు తప్పించి. నాలాగిరి మహా భయంకరంగా ఘీంకరిస్తూ బుద్ధుని మీదికి వచ్చింది. అక్కడ ఆ క్షణంలో ఏమి చిత్రం జరిగిందో తెలియదు గానీ దాని మదమంతా ఆ క్షణంలోనే ఆవిరైపోయి బుద్ధుని పాదాలముందు మోకరిల్లింది.

---

*6. పాత్రపైండికః = eating only from alms-bowl 7. ఖలు పశ్చాత్ భక్తికః = refusing all further food 8. ఆరణ్యకః = living in the forest 9. వృక్షమూలికః = living under a tree 10. అభ్యవకాశికః = living in the open air 11. శ్మశానికః = living in a cemetery (charnel-ground) 12. యథాసంస్తారికః = being satisfied with whatever dwelling 13. నైషదికః = sleeping in sitting position (and never lying down)*

మనుష్యులైతేనే చెప్పిన పని సరిగ్గా చేసి రాగలుగుతారని దేవదత్తుడు భావించి పేరు మోసిన ఇద్దరు హంతకులను పంపించాడు. వాళ్ళిరువురూ బుద్ధుణ్ణి చంపడానికి బదులు త్రిరత్నశరణు పొంది ఉపాసకులుగా తిరిగివచ్చారు. కాషాయానికి తగని ఇన్ని దారుణ ప్రయత్నాలు చేసి దేవదత్తుడు చివరకు సాధించింది మరణానంతరం అవీచి నరకం!

ఒకనాటి భిక్షు సమావేశంలో దేవదత్తుని ప్రస్తావన వచ్చినప్పుడు బుద్ధుడు క్రింది శ్లోకాలను చెప్పాడు.

***అనిష్కషాయః కాషాయం యో వస్త్రం పరిధాస్యతి***
***అపేతో దమసత్యాభ్యాం న స కాషాయమర్హతి*** 1-9

***యశ్చ వాంతకషాయః స్యాత్ శీలేషు సమాహితః***
***ఉపేతో దమసత్యాభ్యాం స వై కాషాయమర్హతి*** 1-10

పంచ కషాయాల్లో* (corruptions) క్లేశ* కషాయం ఒకటి. ఈ క్లేశ కషాయాన్ని వదలగొట్టుకొననివాడు, దమము (restraint) లేనివాడు, అసత్యవాది అయినవాడు కాషాయధారణకు అర్హుడు కాడు. క్లేశములను తొలగించుకొన్నవాడు, శీలసంపన్నుడు, దమము కలిగినవాడు, సత్యవాది అయినవాడు కాషాయధారణకు అర్హుడు.

---

* **పంచకషాయములు** *(Five impurities or corruptions)*

*1. ఆయుకషాయం = decrease in life span in this epoch 2. దృష్టికషాయం = dogmatic or philosophical or religious beliefs grounded in reified thought 3. క్లేశకషాయం = afflictions primarily the afflictions of clinging 4. సత్త్వకషాయం = impurity of existence as an ignorant living being 5. కల్పకషాయం = problems of living in a degenerate time.*

* *క్లేశములు (afflictions or mind defiling unwholesome qualities) ఇవి పది దాకా ఉన్నాయి. 1. లోభము (greed), 2. ద్వేషము (hate), 3. మోహము (delusion), 4. మానం (conceit), 5. దృష్టి (speculative views), 6. విచికిత్స (sceptical doubt), 7. స్త్యాన (mental torpor), 8. ఔద్ధత్య (restlessness), 9. అహ్రీక (shamelessness), 10. అనపత్రాప్య (lack of moral dread or unconscientiousness).*

# శ్యామావతి

వత్సదేశం రాజు శంఖముఖుడు మారువేషంలో దేశసంచారం చేస్తూ రౌరకగ్రామం వచ్చి ప్రక్కనే ఉన్న వల్గుమతి అనే చిన్న నది ఒడ్డుకు వెళ్ళాడు. ఆ నదీతీరంలో చెమ్మగిల్లియున్న ఇసుకలో ఇద్దరు చిన్నమ్మాయిలు ఇసుకగూళ్ళు కట్టుకొంటూ వినోదిస్తున్నారు. ఇంతలో మరొక చిన్న పిల్లవాడు అక్కడికి వచ్చి ఆ గూళ్ళను చూసి కోటలను కూల్చివేసే వీరుడి ముఖభంగిమను ప్రదర్శిస్తూ ఆ ఇసుకగూళ్ళను కాలితో తన్నివేశాడు. ఆ ఇద్దరమ్మాయిల్లో ఒక అమ్మాయి గుండె పగిలిపోయేలా గట్టిగా ఏడవడం మొదలుపెట్టింది. మరొక అమ్మాయి శాంతంగా చూస్తూ ఉండిపోయింది. ఏడవకుండా శాంతంగా ఉన్న ఆ అమ్మాయితో శంఖుముఖుడికి మాట్లాడాలనిపించింది. దగ్గరకు వెళ్ళి మొదట ఆ పిల్లవాడి చెవి పట్టుకొని మెలిపెట్టూ "రే, నీవు తన్నేసిన గూళ్ళు నీవే కట్టి వాళ్ళకివ్వు. లేకుంటే పళ్ళు రాలగొట్తాను" అన్నాడు. ఆ పిల్లవాడు విపరీతంగా బెదిరిపోయి వెంటనే ఇసుకమీద కూర్చొని పాదం మీదికి ఇసుక తోసి గూడు కట్టే పనిలోకి దిగాడు. ఏడుస్తున్న అమ్మాయి ఏడుపు నిలిపేసింది. శంఖముఖుడు శాంతంగా ఉన్న అమ్మాయిని ప్రశంసాదృష్టితో చూస్తూ "నీ పేరేమిటమ్మా? నీ నాన్న పేరేమి?" అని కొన్ని ప్రశ్నలు వేసి మాట్లాడించి తన దారిన వెళ్ళిపోయాడు.

పదేండ్ల తరువాత శంఖముఖుడు తన కుమారుడు ఉదయనుడికి వివాహం చేయదలచాడు. పదేండ్లక్రితం వల్గుమతీ నదీతీరంలో తను చూసి మాట్లాడిన బాలిక జ్ఞాపకం వచ్చింది. పేరు కూడా జ్ఞాపకమే. శ్యామ. వెంటనే రౌరక గ్రామానికి మనుషులను పంపాడు. ఈ పదేండ్లలో శ్యామ కుటుంబంవాళ్ళు ఐదు గ్రామాలు మారారు. రాజసేవకులు అన్వేషించి అన్వేషించి మూడు నెలల

---

* శ్యామావతి ప్రస్తావన బాలనక్షత్రం శీర్షిక క్రింద కూడా వస్తుంది.

తరువాత ఆ కుటుంబాన్ని తిమింగల గ్రామంలో పట్టుకోగలిగారు. శ్యామకు అప్పటికి పెళ్ళి కాలేదు. అది ఆమె అదృష్టమో ఉదయనుడి అదృష్టమో తెలియదు. శ్యామ, యువరాణి అయ్యింది. శ్యామావతీదేవిగా పేరు మారింది.

ఉదయనుడు భోగలాలసుడు. కౌశాంబిలోని ఘోషితారామానికి వెళ్ళి బుద్ధుణ్ణి ఒక్కసారి కూడా దర్శించింది లేదు. శ్యామావతి రమ్మని పిలిస్తే "నీవు నాలో అర్ధభాగం. వెళ్ళి దండిగా పుణ్యం గడించిరా. అందులో సగభాగం నాకు ఎలాగూ వస్తుంది కదా" అని కుతర్క వాక్యం పలికాడు. శ్యామావతి మళ్ళీ అతణ్ణి ఎప్పుడూ రమ్మని పిలవలేదు. ఒంటరిగానే వెళ్ళేది. ఆరామానికి ఏ ఆడంబరమూ లేకుండా నిరాడంబరంగా వెళ్ళేది. అయినప్పటికీ ఆమె ఎవరో తెలియనివాళ్ళు ఆరామంలో ఆమెను చూసి "ఎవరబ్బా ఈమె? మహారాణిలాగా కనిపిస్తుంది" అనుకొనేవారు. ఆ చూపులో, ఆ నడకలో, ఆ మాటలో, ఆ కదలికల్లో అంత హుందాతనం వ్యక్తం అయ్యేది! పుస్తకాల్లో ఉండే దశరాజ ధర్మాలు వ్యక్తుల్లో చూడదలిస్తే శ్యామావతినే చూడాలి. (దశరాజ ధర్మాలు : 1. దానం, 2. శీలం, 3. పరిత్యాగం (unselfishness), 4. ఆర్జవం (honesty), 5. మార్దవం (getleness), 6. తపస్సు (not being given to luxurious life), 7. అక్రోధం, 8. అవిహింస (compassion), 9. క్షాంతి, 10. అవిరోధం (agreeability).

ఒకనాడు శ్యామావతి బుద్ధుణ్ణి సందర్శించి "శాస్తా, మీరు అనేక ధర్మాలను బోధిస్తారు. అన్ని ధర్మాలకు ఏది ఆధారం, ఏది మనిషికి బలాన్నిచ్చేది అట్టి ధర్మాన్ని తెలుపండి" అని అడిగింది.

"మహారాణీ, అన్ని కుశల ధర్మాలకు ఆధారం అప్రమాదం (zeal, non-laxity, earnestness, diligence, watchfulness, mindfulness). అన్నిటికీ బలాన్నిచ్చేదీ ఇదే. అన్ని జంతువుల పాదాల గుర్తులు (foot prints) ఏనుగు పాదం గుర్తులో అణగిపోయినట్లుగా అన్ని కుశల ధర్మాలు అప్రమాదంలో అంతర్గతములవుతాయి. మహారాణీ, ఇప్పుడు నేనొక ఊహా చిత్రాన్ని మాటల్లో చెబుతాను. అప్రమాదం ఎందుకుండాలో అర్థం అవుతుంది. క్రింద భూమిని

పైన ఆకాశాన్ని ఒరుసుకుంటూ నాలుగు దిక్కుల నుండి నాలుగు మహాపర్వతాలు ఒకదానికి అభిముఖంగా ఒకటి వేగంగా కదలివస్తున్నాయని ఊహించు. ఆ పర్వతాల మధ్య చిక్కుకున్న మానవుడు వాటిమధ్య నలిగిపోకుండా తప్పించుకోగలడా? అంత వేగం, అంత బలం అతనికున్నదా? ఆ నాలుగు పర్వతాలలో ఒకటి జరా (ముసలితనం), రెండవది వ్యాధి, మూడవది విపత్తి (misfortunes), నాలుగవది మరణం. యౌవనాన్ని నలగగొట్టుకుంటూ జరా వస్తుంది. ఆరోగ్యాన్ని నలగగొట్టుకొంటూ వ్యాధి వస్తుంది. అన్ని సంపత్తులను తుత్తునియలు చేస్తూ విపత్తి వస్తుంది. జీవితాన్ని మ్రింగివేస్తూ మరణం వస్తుంది. తుది శ్వాస తరువాతి ప్రయాణంలో ఎవరి సహాయమూ ఉండదు. మహారాణీ, ఒక్క ధర్మమే ఆ సమయంలో త్రాణంగా (defence), లయనంగా (resting place), శరణంగా (refuge) పరాయణంగా (support) ఉంటుంది. అప్రమాదవర్తనులే ధర్మసంపత్తిని ఆర్జించగలరు" అని అక్కడ ఉపవిష్టులైయున్న భిక్షువులను కూడా ఉద్దేశించి క్రింది శ్లోకాలు చెప్పాడు.

***అప్రమాదోఽ మృతపదం ప్రమాదో మృత్యో: పదమ్***
***అప్రమత్తా న మ్రియంతే ప్రమత్తా యథా మృతా:*** 2-1

అప్రమాదం (heedfulness, mindfulness) నిర్వాణానికి దారితీస్తుంది. ప్రమాదం (negligence) మృత్యువుకు దారి తీస్తుంది.

***ఏవం విశేషతో జ్ఞాత్వా అప్రమాదే పండితా:***
***అప్రమాదే ప్రమోదంత ఆర్యాణాం గోచరే రతా:*** 2-2

అప్రమాదం వలన కలిగే మేలును తెలుసుకొని పండితులు (wise) ఆర్యసత్యాల చింతనలో ఆనందం పొందుతారు.

***ప్రమాదమనుయుంజంతి బాలా దుర్మేధసో జనా:***
***అప్రమాదం చ మేధావీ ధనం శ్రేష్ఠమివ రక్షతి*** 2-6

బాలురు (foolish), దుర్మేధసులు (ignorant) అయినట్టి జనులు అజాగ్రత్తగా

జీవిస్తూ కష్టాల పాలవుతారు. మేధావి అప్రమాదగుణాన్ని శ్రేష్ఠమైన సంపదగా భావించి రక్షించుకొంటాడు.

**మా ప్రమాదమనుయుంజీత మా కామరతిసంస్తవమ్**
**అప్రమత్తో హి ధ్యాయన్ ప్రాప్నోతి విపులం సుఖమ్** 2-7

ప్రమాదం చెందకు. కామరతి (sense pleasures) పట్ల సంస్తవం (acquaintance, familiarity, intimacy) వద్దు. ఏమరుపాటు, సోమరితనం లేకుండా ధ్యానం చేసేవాడు విపుల సుఖాన్ని పొందుతాడు.

**అప్రమాదేన మఘవా దేవానాం శ్రేష్ఠతాం గతః**
**అప్రమాదం ప్రశంసంతి ప్రమాదో గర్హితః సదా** 2-10

దేవతలలో ఇంద్రుడు శ్రేష్ఠుడు. అప్రమాదగుణం వల్లనే అతను ఆ స్థానం పొందగలిగాడు. అప్రమాదం ఎక్కడైనా ఏ కాలంలోనైనా ప్రశంసింపబడుతుంది. ప్రమాదం నిందింపబడుతుంది.

**అప్రమాదరతో భిక్షుః ప్రమాదే భయదర్శీ వా**
**సంయోజనం అణుం స్థూలం దహన్ అగ్నిరివ గచ్ఛతి** 2-11

అప్రమాదాన్ని ఇష్టపడుతూ ప్రమాదంలో భయాన్ని చూసేవాడు సంయోజనాల (fetters) విషయంలో అగ్నిలాంటివాడు. పది సంయోజనాలను అవి స్థూలరూపంలో ఉండనీ సూక్ష్మ రూపంలో ఉండనీ - మొత్తాన్ని దహించి వేస్తాడు.

సంయోజనాలు:

1. సత్కాయదృష్టి (false view of self)
2. విచికిత్స (doubt regarding four noble truths)
3. శీలవ్రతపరామర్శ (clinging to mere rites and rituals)
4. కామరాగ (sense desires)

5. ప్రతిఘ (hatred, ill-will)
6. రూపరాగ (craving for fine material existence)
7. అరూపరాగ (craving for immaterial existence)
8. మాన (pride, conceit)
9. ఔద్ధత్య (restlessness, excitement)
10. అవిద్య (ignorance)

---

*మొదటి ఐదు, అవరభాగీయ సంయోజనములు (lower fetters). మనం ఇప్పుడున్నట్టి కామధాతువు (desire realm) పట్ల ఆసక్తి కలిగించి బంధించునట్టివి కనుక అవరభాగీయములు. చివరి ఐదు, ఊర్ధ్వ భాగీయములు (higher fetters). రూపధాతువు (fine material realm), అరూపధాతువు (immaterial realm) పట్ల ఆసక్తి కలిగించి బంధిస్తాయి. మొదటి మూడు ఛేదించినవాడు స్రోతాపన్నుడు. ఈ మూడింటిని ఛేదించడంతోబాటు 4, 5 సంయోజనాల స్థూలరూపాన్ని ఛేదించినవాడు సకృదాగామి. 4, 5 సంయోజనాల సూక్ష్మరూపాన్ని కూడా ఛేదించినవాడు అనాగామి. మొత్తం పదింటినీ ఛేదించినవాడు అర్హతుడు.*

Note : *స్నానం చేయకుండా మాసిన బట్టలు మార్చకుండా ఉండే వ్యక్తి దేహం పట్ల సాధారణంగా అందరికీ అశుచి (dirty) అనే భావం కలుగుతుంది. అదే వ్యక్తి చక్కగా స్నానం చేసి ఉతికిన బట్టలు కట్టుకుంటే శుచి (clean) అనే భావం కలుగుతుంది. స్నానం చేసి ఉతికిన బట్టలు కట్టుకొన్నందువల్ల దేహానికి శుచిత్వం వచ్చిందనుకోవడం లోకసమ్మతభావమే అయినా ఇది పృథక్జనభావంగానే శాస్త్రం చెబుతుంది. స్నానం చేసి ఉతికిన బట్టలు కట్టుకున్నా దేహానికున్న దాని లక్షణం (అశుచిత్వం) ఉండనే ఉంటుంది. స్నానం వల్ల దేహానికి పవిత్రత, శుచిత్వం, శోభనత్వం వచ్చిందనుకోవడం శీలవ్రతపరామర్శలో ఒకానొక అంశం.*

# శుభకరసింహుడు

శుభకరసింహుడనే యువకునికి ఒక ముఖ్యమైన జీవిత సమస్య ఎదురయ్యింది. ఎటూ తేల్చుకోలేకపోతున్నాడు. జీవితంలో ఏదైనా జటిల సమస్య వచ్చినప్పుడు తనకు తానే తొందరపడి ఏదో ఒక నిర్ణయానికి వచ్చి వెంటనే అలా చేసివేయడం మంచిది కాదని అతనికి తెలుసు. హితులతో మిత్రులతో ఆత్మీయులతో ఇంకా ఇతర పెద్దలతో ఆ సమస్యను చర్చించి వాళ్ళ సలహాలు కూడా తీసుకొని అన్ని కోణాలూ ఆలోచించి నిదానంగా నిర్ణయానికి రావడం మంచిదనుకొన్నాడు.

మూడు యోజనాల (యోజనం = 7 మైళ్ళు) దూరంలో ఉన్న ఆశ్రమానికి వెళ్ళాడు. ఆ ఆశ్రమం నిండా చింత చెట్లు ఉండడం వల్ల చింతతోపు ఆశ్రమం అనే అందరూ అంటారు. ఆశ్రమాధిపతిని కలిసి "స్వామీ, నేను పెండ్లి చేసుకోవడం మంచిదా కాదా సలహా ఇవ్వండి" అన్నాడు శుభకరుడు. స్వామి అతణ్ణి లోనికి తీసుకపోయి ఉత్తరీయం పట్టమని చెప్పి ముంతడు చింతగింజలు కొలిచి అందులో పోసి నాలుగైదు చింతగింజలు కూడా చేతిలో ఉంచాడు. "ఇదేమిటి స్వామీ" అన్నాడు ఆశ్చర్యంతో శుభకరుడు. "నీ ప్రశ్నకు జవాబు నాయనా! నీ ఉత్తరీయంలో ఎన్ని గింజలున్నాయో అన్ని నష్టాలు, నీ చేతిలో ఎన్ని గింజలున్నాయో అన్ని లాభాలు నాయనా! ఇది నా సలహా, ఆపైన నీ ఇష్టం" అన్నాడు స్వామి.

ఆ సలహా శుభకరుని మీద బాగా పని చేసింది. పెండ్లి వద్దనుకొన్నాడు. ఏదైనా ఆశ్రమంలో చేరాలనుకొన్నాడు. చింతతోపు స్వామి ప్రవర్తన, మాట, చూపు విడ్డూరంగా (eccentric గా) ఉండడం వల్ల అక్కడ మాత్రం వద్దనుకొన్నాడు. తన ఊరికి ఐదు యోజనాల దూరంలో ఉన్న మామిడితోట ఆశ్రమంలో చేరాడు.

చేరిన వెంటనే గుండు గీయించారు. రెండు రోజుల్లో ఇతనికి ఆ చోటు వెగటనిపించింది. ఈ మూర్ఖుల దగ్గర తను నేర్చుకొనేది ఏమీ లేదని భావించి సంచి తీసుకొని బైటకు వెళ్ళిపోతుంటే అక్కడొకడు "ఏమయ్యా, అప్పుడే వెళ్ళిపోతున్నావు? నీకీచోటు లాభంగా కనిపించలేదా?" అని అడిగాడు. "లాభం లేకేమండీ, ఉచితంగా గుండు గీయించుకొని వెళ్తున్నానుగా" అన్నాడు తల నిమురుకొంటూ శుభకరుడు.

ఇంటికి చేరాడు. ఇప్పుడు ఊర్లో ఎవరూ అతణ్ణి 'శుభకరా' అని పిలవడం లేదు. 'బోడిగుండూ' అని పిలుస్తున్నారు. వెంట్రుకలు పొడవుగా ఒత్తుగా పెరిగాక కూడా అలాగే పిలుస్తున్నారు. "సంస్కారహీనులు" అని తిట్టుకొంటూ శుభకరుడు ఏడు యోజనాల దూరంలోని నారికేళాశ్రమంలోకి అడుగు పెట్టాడు.

అక్కడ గురువుగారి నివాసం వద్ద అప్పటికే వందలమంది గుమికూడి యున్నారు. గురువుగారు పై అంతస్థులోని తన గదినుండి క్రిందకు దిగడం మొదలుపెట్టగానే క్రిందనున్న శిష్యగణం ముక్తకంఠంతో "దేవుడొస్తున్నాడు ఒక్కొక్క మెట్టే దిగివస్తున్నాడు" అని ఆవేశంగా చిందులు వేస్తూ పాడడం మొదలుపెట్టారు. క్రింది మెట్టుకు ఆయన చేరిన వెంటనే పూలకిరీటం ఒకటి తలకు తగిలించి అప్పటికే సిద్ధంగా ఉన్న పల్లకిలో కూర్చొనబెట్టి మోసుకొని "దేవుడొస్తున్నాడు దేవుడొస్తున్నాడు" అని పాడుకొంటూ ఆశ్రమం మధ్యలో ఉన్న మండపానికి కదిలారు.

మండపంలో గురువుగారు ఆసీనులయ్యాక ఆస్థానభక్తుడొకడు స్వాగత వచనాలు ఇలా పలికాడు: "లోకంలో కొందరు తపస్వులుంటారు కానీ విద్వత్తు ఉండదు. కొందరికి విద్వత్తు ఉంటుంది కానీ తపస్సు ఉండదు. రెండూ ఉన్న కొందరికి అనుభవం ఉండదు. మన గురువుగారిలో ఈ మూడూ గంగా యమునా సరస్వతీ నదులులాగా కలిసియున్నాయి. కనుక మన గురువుగారు ప్రయాగక్షేత్రంతో సమానం. హిమగిరిలో మన గురువుగారు ఒంటికాలిమీద నిలబడి ఇరవై ఏండ్లు తపస్సు చేశారు. మీరడగవచ్చు - 'రెండు కాళ్ళమీద

నిలబడి చేసియుండవచ్చు గదా' అని. రెండు కాళ్ళమీద నిలబడి చేస్తే ఆ బరువు తాళలేక భూమి కృంగిపోయి జీవులు కష్టాల పాలవుతారని శ్రీవారు ఒంటికాలి మీదనే నిలబడి తపస్సు చేశారు. నూతన సంవత్సరం ప్రవేశించిన ఈ శుభతరుణంలో శ్రీగురుదేవులుగారు ఈ విశ్వసృష్టి ఎప్పుడు ఎలా ఏ క్రమంలో మొదలయ్యిందో మనకందరికీ కళ్ళకు కట్టినట్టుగా చెప్పబోతున్నారు. మీరందరూ శ్రీవారి ప్రసంగం కోసం చాలా ఆత్రంగా ఎదురు చూస్తున్నారని నాకు తెలుసు గనుక నా ఈ స్వాగత వాక్యాలను ఇంతటితో ముగిస్తున్నాను. జై గురుదేవా, జై జై గురుదేవా."

గురువుగారు ఉపన్యాసం కోసం కంఠాన్ని సవరించుకొంటున్నారు. అంతలోనే ఐదుగురు శిష్యులు వేదిక మీదికి వచ్చి మండలాకారంలో కూర్చొన్నారు. ఒక్కొక్కరి చేతిలో ఒక నారింజపండున్నది. సగం కోసి ఒక సగం మళ్ళీ నాలుగు ముక్కలుగా కోసిన పండ్లవి. దేవి నిరూపణ కోసం ఈ తతంగం అనేది శుభకరునికి అర్థమైపోయి ఇక ఆ ప్రసంగం వినడం శుద్ధదండుగ అనిపించి "ఆ మామిడితోట ఆశ్రమానికి అన్నలా ఉందే ఇది" అనుకొని వెంటనే ఊరు చేరాడు.

ఇంటికి చేరగానే తల్లి కసిరింది. "ఇటు ఇల్లూ గాకుండా అటు ఆశ్రమమూ గాకుండా ఇక్కడికి అక్కడికి ఊరక తిరుగుతూ జీవితం గడిపావంటే పై జన్మలో ఉభయచరంగా (కప్పగా) పుడతావు" అని కసిరింది. తల్లి మాటకు ఎదురు చెప్పలేక శుభకరుడు వివాహం చేసుకొన్నాడు.

ఇన్నేండ్లపాటు అతడు స్త్రీ విషయంగా తన అమాయకతను కాపాడుకొంటూ వచ్చినవాడు గనుక జీవితంలో స్త్రీ విలువ ఎంత గొప్పదో బాగా తెలిసి వివాహం చేసుకొన్నవాడయ్యాడు. రెండేండ్లు జీవితం మధురంగా గడిచింది. శుభకరుడు త్వరలో తండ్రి కాబోతున్నాడు కానీ,

**కృతాకృతాపరీక్షో౽యం మృత్యుర్విశ్రంభఘాతకః**
**స్వస్థాస్వస్థైరవిశ్వాస్య ఆకస్మికమహాశనిః**

"నవమాసాలుగా ఒక నవ్యదేహం రూపుదిద్దుకొనడం అయ్యింది; ఇక వెలుగులోకి రావలసిన పని మాత్రమే మిగిలియున్నది కనుక కాసేపు ఆగుతాను" అని మృత్యువు ఆలోచించడు. మృత్యువు నమ్మదగినవాడు కాదు. రోగులు, నీరోగులు ఎవ్వరూ నమ్మదగినవాడు కాదు. ఆకస్మిక పిడుగుపాటు లాంటివాడు.

ప్రసవ సమయంలో సకాలానికి తగిన వైద్యసేవ అందకపోవడంతో శుభకరుని భార్య మరణించింది. గొడ్డలిపెట్టులాంటి ఆ దెబ్బను తట్టకోలేక శుభకరుడు విలవిలలాడిపోయి గట్టిగా రోదించాడు.

ఇంటిలో ఇక ఉండడం దుర్భరం అనిపించి శుభకరుడు పదియోజనాల దూరం నడుచుకొంటూ వెళ్ళి జేతవనం చేరాడు. తీవ్రశోక భార పీడితుడైన అతనికి బుద్ధభగవానుడు మహా కరుణతో భారహార సూత్రం (putting down the burden sutra) ఉపదేశించి ఉపశమనం కలిగించాడు. శుభకరుడు మళ్ళీ ఇంటి ముఖం చూడలేదు. జీవితాన్ని భిక్షువుగా గడుపుతూ కాలాంతరంలో అర్హతుడయ్యాడు. ఆయా సందర్భాలలో అతనికి బుద్ధుడు చెప్పిన రెండు శ్లోకాలు :

***అనవస్థితచిత్తస్య సద్ధర్మమవిజానతః***
***పరిప్లవప్రసాదస్య ప్రజ్ఞా న పరిపూర్యతే*** 3-6

చంచల చిత్తునికి, సద్ధర్మం (good or true law) తెలియనివానికి, శ్రద్ధ* దృఢంగా లేనివానికి పూర్ణమైన (perfect) ప్రజ్ఞ (insight, wisdom) కలుగదు.

---

* *శ్రద్ధ అనేది మూడుకోణాల అతివిలువైన వజ్రం. ఒక కోణం నమ్మకం (faith). బుద్ధుని వాక్యాలు నమ్మదగినవియే. ఎంత తర్కించి చూచినా అబద్ధములు అనిపించడం లేదు- ఇది మొదటి*

→

**అనవస్రుతచిత్తస్య అనన్వాహతచేతసః**
**పుణ్యాపాపప్రహీణస్య నాస్తి జాగరతో భయమ్** **3-7**

రాగము ద్వేషము లేనివానికి పుణ్యాపాపములు లేవు. అట్టివాడు అజ్ఞాన నిద్ర నుండి మేల్కొన్నవాడుగా ఉంటాడు. ఇక వానికి పీడకలల భయమే ఉండదు.

---

*బుద్ధుడు దేన్ని లక్ష్యంగా గమ్యంగా చెబుతున్నాడో దాన్ని అనుభవంలోకి తెచ్చుకోవడం అసాధ్యంగా తోచడం లేదు. నాకున్నూ సాధ్యమే. కనుక ప్రయత్నిస్తాను - ఇది రెండవ కోణం. ఇంగ్లీషులో confidence. మూడవకోణం ప్రసాదం (clarity or purity or serenity of mind). ఇతరులతో ఘర్షణపడి పొందగలిగే లక్ష్యాన్ని (goal) బుద్ధుడు చెప్పలేదు. కనుక ఆ లక్ష్య సాధనలో మనస్సు కల్లోలం కావలసిన అవసరం లేదు. పదిమంది పిల్లలను పోగుజేసి వాళ్ళకు ఒక చాక్‌లెట్ చూపించి "ఆ చెట్టును తాకి అందరికంటే ముందుగా ఎవడు ఇక్కడికి పరుగెత్తుకొనివస్తాడో వాడికి ఇది ఇస్తాను" అంటే ఆ పిల్లలు ఒకర్నొకరు తోసుకొంటూ కుమ్ముకొంటూ నెట్టుకొంటూ ద్వేషించుకొంటూ పరుగెత్తుతారు కదా! అలాంటి rat race బుద్ధశాసనంలో లేదు కనుక serenity of mind.*

*Note :- భారహారసూత్రం అనగానే వత్సిపుత్రీయులు జ్ఞాపకానికి వస్తారు. శ్రావకయానంలోని 18 శాఖల్లో ఒక శాఖ వత్సిపుత్రీయులు. తక్కిన అన్ని శాఖలు అనాత్మవాదాన్ని చేస్తే వీళ్ళు మాత్రం పుద్గలవాదం (personalist view) చేశారు. తమ వాదానికి ఆధారంగా భారహార సూత్రాన్ని బాగా వాడుకొన్నారు. భారాన్ని (పంచస్కంధాలను) నెత్తికెక్కించుకొని ఆ తరువాత "అబ్బా, ఏమిటీ బరువు!" అని నిర్వేదంతో త్రోసివేసేవాడొకడుండాలి కదా! వాడే పుద్గలుడు (Person). ఈ పుద్గలుణ్ణి దృష్టిలో పెట్టుకొనియే బుద్ధుడు భారహారసూత్రం చెప్పాడని వత్సిపుత్రీయులు వాదించారు. అభిప్రాయ భేదాలు ఎన్ని ఉన్నా అందరూ కలిసి శాంతియుతంగా ఒక విహారంలోనే ఉండడం సుగత అనుయాముల ప్రత్యేకత. సద్ధర్మ పుండరీకం వేయి రీతులుగా వికాసం చెందడానికి కారణం ఈ భావస్వాతంత్ర్యమే.*



# అస్వస్థ భిక్షువు

ఒక వృద్ధభిక్షువు పడకనుండి లేవలేనంత అస్వస్థుడైనాడు. అంతా పడకలోనే. ప్రక్కలకు తిరిగిపడుకోవడం కూడా అతనికి అసాధ్యమైంది. ఎప్పుడూ వెల్లికిల పడుకొని ఉండడంతో వీపు మీద కురుపులు (bed sores) కూడా లేచాయి. ఆ దుర్గంధాన్ని భరించలేక ఆ ఛాయలకు ఎవరూ వచ్చేవారు కాదు. అతను బాగా ఆరోగ్యంగా ఉన్న రోజుల్లో ఎవరితోనూ సత్సంబంధాలు లేకుండా చిన్న చిన్న విషయాలకు కూడా అతిగా ఘర్షణ పడుతూ ఇతరుల పట్ల చాలా నిర్లక్ష్యంగా* జీవించాడు కనుక ఇప్పుడు ఉపస్థాయకులు (serving or nursing persons) కరువై నిస్సహాయుడయ్యాడు.

ఆ సమయంలో బుద్ధుడు ఆ విహారానికి రావడం జరిగింది. ఆ అస్వస్థ భిక్షువు దుఃస్థితి చూసి కరుణావివశుడై ఉపస్థాయక చర్యను తానే చేపట్టాడు. ఆనందుడు సహాయపడగా ఆ అస్వస్థభిక్షువు దేహాన్ని, వస్త్రాలను, పడకను, కుటీరాన్ని అంతా శుభ్రపరచి అతనికి కొంత ఉపశమనం కలిగించాడు. అక్కడ చేరిన భిక్షువుల నుద్దేశించి "మీరు పరస్పరం సహాయం చేసుకొనకపోతే ఎలా?" అని

---

* *అతను బాగా ఆరోగ్యంగా తిరిగిన రోజుల్లో ఎవరైనా రోగగ్రస్తుడు ఔషధం తెచ్చిపెట్టమని కోరితే "నేనూ ఇల్లూవాకిలీ వదలి వచ్చింది నీకు ఔషధం తెచ్చి పెట్టే నౌకరీ చేయడానికనుకున్నావా?" అని దర్పంగా నిరసన వాక్యం పలికేవాడు. "సోదరా, ఈ బట్టలు కాస్త ఉతికి పెట్టు" అని ఎవరైనా దుర్బలభిక్షువు కోరితే "నీకు రోగం దేహానికే అనుకొన్నాను. కళ్ళకు కూడానా? నేను ఏం బట్టలు కట్టుకొనియున్నానో తెలియడం లేదా? మోక్షధ్వజం (flag of nirvana = కాషాయం) కట్టుకొనియున్న నేను నీకు చాకలివానిగా కనిపిస్తున్నానా?" అని పరుషంగా మాట్లాడేవాడు. కాషాయం కట్టుకోవడంతోనే కళ్ళు నెత్తికెక్కినవాళ్ళలో అతడు ప్రథముడు.*

మృదువుగా మందలించాడు. ఆ భిక్షువు ఇంకా ఎక్కువనాళ్ళు బ్రతికే స్థితిలో లేడని చూసినవారెవరైనా చెప్పగలరు. ఆ అవసానదశలోనైనా అతడు దేహధ్యాస నుండి (clinging to bodily existence) ముక్తుడై పరమార్థ చింతన చేస్తే శుభం జరుగుతుందని దేహధ్యాసను సడలించే క్రింది శ్లోకాన్ని బుద్ధుడు చెప్పాడు.

***అచిరం బతా ఽ యం కాయః పృథివీమధిశేష్యతే***
***క్షుద్రో ఽ పేతవిజ్ఞానో నిరర్థమివ కళింగరమ్*** **3-9**

అకటా! త్వరలోనే ఈ దేహం, విజ్ఞానం (stream of consciousness) లేనిదై పోతుంది. ఆ పిమ్మట ఎందుకూ పనికిరాని పొట్టులాగా మట్టిలో కలిసిపోతుంది.

---

Note : *బుద్ధుని మహాపరినిర్వాణం తరువాత ఆరు నెలలకు మహాకాశ్యపుని అధ్యక్షతన రాజగృహ సమీపంలోని పాండవ గుహలో 500 అర్హతులు సమావేశమై బుద్ధుని ఉపదేశాలను క్రోడీకరించారు కదా! ఆ సమావేశానికి ప్రథమ సంగీతి (సంగీతి = group recitation) అని పేరు. ప్రథమ సంగీతివాళ్ళకు బుద్ధుని జీవిత చరిత్ర మీద దృష్టి పడి ఉంటే పదివేల పుటల జీవిత చరిత్ర గ్రంథం తయారయి ఉండేది. కానీ వాళ్ళ దృష్టి పూర్తిగా ఉపదేశాల మీదనే. ఉపదేశాలకు భూమికగా అక్కడక్కడా కొన్ని జీవిత సంఘటనలు యథాలాపంగా (casual గా) పొందుపరచారు. అలాంటి సంఘటనల్లో అస్వస్థభిక్షువు సంఘటన ఒకటి.*



# నందగోపుడు

హేతువులు (causes) కాని వాటిని హేతువులుగా నమ్మి నష్టాల పాలయిన వాళ్ళలో నందగోపుడొకడు. "ఈశాన్యంలో పల్లం ఉండాలి" అని ఒక బైరాగి చెబితే ఆ మాటలు నమ్మి ఇంటికి ఈశాన్యంగా ఒక పెద్ద గుంతను ధనవ్యయం చేసి త్రవ్వించాడు. వానకు ఆ గుంత నిండిపోయింది. నందగోపుని చంటిపిల్లవాడు ఒకనాడు దోగాడుతూ వెళ్ళి ఆ గుంతలో పడి చనిపోయాడు. ఈ దుర్ఘటన నందగోపుణ్ణి బాగా క్రుంగదీసింది. కానీ మిథ్యాదృష్టి వదులుకోలేదు. మరొక బైరాగిని తీసుకొచ్చాడు. "దోషం ఈశాన్యంలో లేదు ఆగ్నేయంలో లేదు. అసలు దోషం అంతా ఇంటి నిర్మాణంలోనే ఉంది. దీన్ని ఇలానే ఉంచితే ఇక ఇంటిలో ఒక్కరు కూడా మిగలరు" అని చెప్పి వెళ్ళాడు. తన తాతగారు కట్టించిపోయిన ఆ బటువైన ఇంటిని నందగోపుడు చాలా ధనవ్యయం చేసి నేలమట్టం గావించాడు. మరికొంత ధనవ్యయం చేసి నివాసం కోసం ఒక మాదిరి ఇల్లును కట్టించుకొన్నాడు.

నందగోపుని వృత్తి వ్యవసాయం. ఊర్లోని రైతులందరూ వాన కోసం ఎదురు చూస్తున్నారు. ఎవ్వరూ పొలం పనుల్లోకి దిగలేదు. నందగోపుడు క్రోసు దూరంలోని నిగమానికి (వాణిజ్యకేంద్రం) వెళ్ళి పంచాంగ పండితుణ్ణి సంప్రదించాడు. "ఈ నెలలో మంచి వర్షాలున్నాయని పంచాంగం చెబుతున్నది" అన్నాడు పంచాంగ పండితుడు. నందగోపుడు ఊర్లోవాళ్లను ఆశ్చర్యంలో ముంచుతూ పొలం పనుల్లోకి దిగాడు. బావి అడుగున ఉన్న నీటిని పొలాలకు తోడించాడు. నాలుగు సాళ్ళు దున్నించి ఎరువులు వేసి విత్తనాలు చల్లాడు. ధనవ్యయం చాలానే అయ్యింది. ఆ నెలలో ఒక బొట్టు వర్షం పడలేదు. బావిలో నీళ్ళు ఊరడం లేదు. పెట్టిన పైరు మొత్తం ఎండిపోయింది.

మరుసటి సంవత్సరం వర్షాలు సకాలంలో బాగానే పడ్డాయి. నందగోపుడు నిగమానికి వెళ్ళి జ్యోతిష పండితుణ్ణి తన రాశిఫలం చెప్పమన్నాడు. "ఈ ఏడాది నీ రాశిఫలం బాగా లేదు. ఏ పని ఎత్తుకొన్నా నష్టమే వస్తుంది'' అన్నాడు పండితుడు. నందగోపుడు పొలం పనులు ఎత్తుకోలేదు. మొత్తాన్ని బీడు పెట్టేసి ఇంటి తన్నె మీద కూర్చొన్నాడు.

ఈ అవకతవక వ్యవహారం వల్ల (mismanagement వల్ల) అప్పులు పెరిగిపోతూ వచ్చింది. కొంచెం కొంచెం పొలం అమ్ముతూ వచ్చాడు. ఆర్థిక పరిస్థితిని చక్కదిద్దుకోవాలనుకొన్నాడు. నిగమానికి వెళ్ళి ఒక మంత్ర పండితుణ్ణి సంప్రదించాడు. "నేనొక మంత్రం చెవిలో ఊదుతాను. దీన్ని ప్రొద్దున వేయిసార్లు మధ్యాహ్నం సాయంత్రం కూడా వేయేసిసార్లు జపిస్తూ ఉండు. నీ దారిద్ర్యం మాయమైపోతుంది'' అని చెవిలో "బృకుటీ తటి వేతటి వేతటి వైరటి వైరటి శ్వేతే శ్వేత జటితి స్వాహా'' అని మంత్రాన్ని ఊదాడు.

రైతుబిడ్డ ప్రొద్దన్నే లేచి పొలం మీదికి పోతేనే బాగుపడతాడు. తిన్నె మీద కూర్చొని జపం చేస్తే బాగుపడతాడా? జపం కోసం పొలం పనులు వదలుకున్నాడు. దారిద్ర్యం మాయం కాలేదు. ఉన్న కాస్త పొలం మాయమయ్యింది. నందగోపుడు పరమ దారిద్ర్యావస్థకు చేరాడు. దారిద్ర్యం ఎక్కువ కావడంతో ఇంట్లో తగవులు ఎక్కువై ఒకనాడు భార్యను అనవసరంగా కొట్టి అవమానించాడు. ఇన్నాళ్ళు భరిస్తూ వచ్చిన ఆమె ఇక భరించలేక బావిలో దూకి చనిపోయింది.

సాధారణంగా ఎవ్వరి ఇంటికీ వెళ్ళని ఒక ముసలాయన నందగోపుని ఇంటికి వచ్చాడు. సానుభూతి ప్రకటించి ఓదార్చడానికి కాదు. వచ్చి చీవాట్లు పెట్టాడు. "మంత్రాలకు మామిడి కాయలు రాలుతాయట్రా దున్నపోతా! ధనం గడించాలంటే మూడే మార్గాలున్నాయిరా గాడిదా! కష్టపడడం, అడుక్కోవడం, దోచుకోవడం. నీవు మంత్రం చెబితే ఆకాశం నుండి నాణాలు, చినుకులు

పడినట్లుగా పడతాయనుకొన్నావ్రా వెఱ్ఱికుంకా! ఏం మిగిల్చావని ఇంకా ఇక్కడే ఉన్నావు? నీ కొంపను నిలువునా ముంచిన మిథ్యాదృష్టి నిన్ను కూడా పూర్తిగా నాశనం చేయకముందే జేతవనానికి వెళ్ళి ఆ జ్ఞానభాస్కరుణ్ణి దర్శనం చేసుకో. బాగుపడతావు'' అన్నాడు.

నందగోపుడు జేతవనం వెళ్ళాడు. బుద్ధుడు అతణ్ణి కరుణార్ద్రదృష్టితో చూసి "శారిపుత్రా, ఇతనికి ప్రవ్రజ్యదీక్ష ఇవ్వు'' అన్నాడు. బుద్ధుని మాటకు శారిపుత్రుడు ఎదురు చెప్పడు, కానీ ఇలా అన్నాడు: "తీర్థికభావాలు బాగా ఒంటబట్టిన వ్యక్తిలా కనిపిస్తున్నాడు. మన మధ్య ఇమడగలడా అని నా సంశయం''

"సంశయం ఎందుకు?

**మోక్షబీజమహం హ్యస్య సుసూక్ష్మముపలక్షయే**
**ధాతుపాషాణవివరే నిలీనమివ కాంచనమ్**

ఖనిజంరాయిలో ఎక్కడో లోపల ఒక సన్నగీతవలె అణగియున్న బంగారంలాగా ఇతనిలోనూ సుసూక్ష్మంగా ఉన్న మోక్షబీజాన్ని నేను చూడగలుగుతున్నాను'' అన్నాడు బుద్ధుడు. శారిపుత్రుడు నందగోపునికి ప్రవ్రజ్యదీక్ష* ఇచ్చి అతణ్ణి ఒక ఉపాధ్యాయుని,

---

* *భిక్షు సంఘానికి (monastic order) ఆద్యులు బౌద్ధులే. అంతకు పూర్వం సన్యాసులు ఉండినప్పటికీ దానిని ఒక వ్యవస్థగా (well established order) ఏర్పరచడం బౌద్ధులే తొలుత చేశారు. దీన్ని గురించి వ్రాయాలంటే ప్రత్యేకంగా ఒక పుస్తకం వ్రాయాలి. సంగ్రహంగా చెప్పాలంటే భిక్షుసంఘం పూర్తిగా ప్రజాస్వామ్య (democracy) పద్ధతిలో నడిచింది. ఎనిమిదేండ్లు దాటినవాడెవడైనా చేరవచ్చు. కనిష్ఠవయోపరిమితేగానీ గరిష్ఠవయోపరిమితి లేదు. చేరినపుడు ప్రవ్రజ్య దీక్ష (leaving the world ceremony) ఇస్తారు. అప్పటినుండి అతడు భిక్షుసంఘంలో శ్రామణేరుడనబడుతాడు (novice). శ్రామణేరులకు ఉపాధ్యాయుడు (preceptor) ఉంటాడు. ఉపాధ్యాయుడితో శ్రామణేరుడు సార్థవిహారిగా (co-resident) ఉంటాడు. శ్రామణేరులకు ఆచార్యుడు (teacher) కూడా ఉంటాడు. ఆచార్యుడి అధీనంలో శ్రామణేరుడు అంతేవాసిగా (pupil) ఉంటాడు. ఇలా ఇద్దరి పర్యవేక్షణలో ఎనిమిదేండ్లు గడిపాక ఉపసంపద దీక్షకు (ordination ceremony) అర్హుడయి భిక్షువు అవుతాడు.*

ఒక అధ్యాపకుని అధీనంలో ఉంచాడు. ఎనిమిదేండ్ల శిక్షణ తరువాత ఒక పోషధదినం అతనికి ఉపసంపద దీక్ష ఇచ్చి భిక్షువును చేశాడు. ఆ తరువాత పదేండ్లకు అతడు స్థవిరుడయ్యాడు (senior monk). కార్య కారణాల విషయంలో చక్కని అవగాహన కలిగించుకొని కాలాంతరంలో అనాగామి స్థితిని అందుకొన్నాడు. వచ్చిన కొత్తలో బుద్ధుడు అతనికి చేసిన ఉపదేశం నుండి రెండు శ్లోకాలు:

**ద్విట్ ద్విషం యత్ కుర్యాద్ వైరీ వా పునర్వైరిణమ్**
**మిథ్యాప్రణిహితం చిత్తం పాపీయాంసమేనం తతః కుర్యాత్** 3-10

పరస్పరం ద్వేషించుకొనేవాళ్ళు, పరస్పరం శత్రుత్వాన్ని పెంచుకొన్నవాళ్ళు ఒకరికొకరు చేసుకొనే అపకారం కన్నా ఎక్కువ అపకారం మిథ్యాదృష్టికి వశమైన మనస్సు వల్ల కలుగుతుంది.

**న తన్మాతాపితరౌ కుర్యాతామన్యే చాపి చ జ్ఞాతికాః**
**సమ్యక్ ప్రణిహితం చిత్తం శ్రేయాంసమేనం తతః కుర్యాత్** 3-11

తలిదండ్రులు, దగ్గరి బంధువులు చేయలేనంత మేలు సమ్యక్‌దృష్టికి మళ్ళిన చిత్తం వల్ల కలుగుతుంది.



# మరీచిక

శిక్షానందుడనే భిక్షువు బుద్ధుణ్ణి దర్శించడానికోసం కన్యాకుబ్జం నుండి శ్రావస్తికి ప్రయాణమయ్యాడు. కొన్ని రోజుల ప్రయాణం తరువాత దారిలో ఒక గ్రామీణుడు తోడయ్యాడు. ఇద్దరూ పిచ్చాపాటి మాట్లాడుకొంటూ నడుస్తున్నారు. శిక్షానందుడు అడుగులు వేయడం ఆపి దూరంగా దేన్నో పరిశీలనగా చూస్తూ "ఆ తటాకం పేరేమిటి?" అని గ్రామీణుణ్ణి అడిగాడు. గ్రామీణుడు పక్కున నవ్వి "అది అగ్గితెర సామీ" అన్నాడు. (ఎండమావిని గ్రామీణ భాషలో అగ్గితెర అంటారు. సంస్కృతంలో మరీచిక). ఎండమావుల గురించి శిక్షానందుడు ఉపన్యాసాల్లో వినియున్నాడు గానీ అదేమిటో ఇప్పుడే అనుభవానికి వచ్చింది. "ఆహా ఏమి చిత్రం! తెల్లగా తళతళ మెరసిపోతూ స్వచ్ఛమైన మధురమైన జలంలాగా ఉవ్విళూరిస్తున్న ఆ దృశ్యం! ఈ గ్రామీణుడు ప్రక్కన లేకుంటే నేను ఈ పాటికి దారి తప్పేవాడిని. అటువైపు నడకను మళ్ళించియుండేవాడిని. స్వచ్ఛజలము, మధురజలము, సుఖశీతలస్పర్శజలము అని భ్రమించి అటు వెళ్ళియుండేవాడిని. ఆ వంచనాశిల్పం (ఎండమావి) యథార్థ స్వరూపాన్ని తెలిపి నన్ను అలవిగాని ఆయాసం నుండి తప్పించిన ఈ గ్రామీణుడు ఇక్కడ ఇప్పుడు నాకు గురువులాంటి వాడు. ఎంతో మేలు చేశాడు" అనుకొని మనస్సులోనే అతని పాదాలకు నమస్కరించి ప్రయాణం సాగించాడు. వారం రోజుల ప్రయాణం తరువాత శ్రావస్తిని ఆనుకొని ప్రవహిస్తున్న అచిరావతి నదిని దాటాడు. నది దాటాక ఈవలి ఒడ్డున ఏర్పడిన తెల్లని నురగను దోసిలినిండా తీసుకొని దాన్నే చూస్తూ "ఆహా! ఎంత అందంగా తెల్లగా మెరసిపోతున్నది" అనుకొంటుండంగానే ఆ నురగ తన రూపాన్ని ఆకారాన్ని ప్రకాశాన్ని కోల్పోయి అణగిపోయింది.

అధ్యాత్మ గురువులు తమ ఉపదేశాల్లో ప్రాపంచిక విషయాల యొక్క అనిత్యత్వాన్ని (క్షణక్షణం మారిపోతూ వినాశం చెందడం) తెలియజేయడానికి నురగను ఎందుకు దృష్టాంతంగా వాడారో అప్పుడతనికి అర్థమయ్యింది. "అనిత్యత్వం ముద్ర లేని వస్తువు ముల్లోకాలు గాలించినా దొరకదు. అంతా నురుగే. ఇది పరమసత్యం" అనుకొంటూ జేతవనంలోకి అడుగుపెట్టాడు. గంధకుటీరం (బుద్ధుని నివాసకుటీరం) దిక్కుగా తిరిగి అంజలి ఘటించి "నమో బుద్ధాయ, నమో నమో సంబుద్ధాయ, నమో నమో నమో సమ్యక్ సంబుద్ధాయ" అంటు సాగిలపడి మ్రొక్కాడు. కొన్ని క్షణాలు తరువాత లేచి గంధకుటీరం వైపు అడుగులు వేశాడు. దూరం నుండే చూశాడు - కొందరు భిక్షువులకు ఉపదేశిస్తున్న భగవానుణ్ణి. అడుగుల వేగం పెంచి గంధకుటీరం చేరాడు. సరిగ్గా ఆ సమయంలోనే బుద్ధుని వదనకమలం నుండి క్రింది శ్లోకం వెలువడింది.

**ఫేనోపమం కాయమిమం విదిత్వా**
**మరీచిధర్మం అభిసంబుధానః**
**ఛిత్వా మారస్య ప్రపుష్పకాణి**
**అదర్శనం మృత్యురాజస్య గచ్ఛేత్** **4-2**

ఈ శరీరం నురగలాగా అనిత్యమని మరీచికలాగా అనాత్మయనీ (unsubstantial) తెలిసికొని మారుడు ప్రయోగించే పుష్పబాణాలను వమ్ము చేసి మృత్యువుకు అందనంత దూరానికి భిక్షువు చేరాలి (అర్హత్వాన్ని పొందాలి).

# సప్తవర్గీయ భిక్షువులు

జేతవనంలో నానారకాల భిక్షువులున్నారు. కొందరికి అభిధర్మం అంటే ఇష్టం, శారిపుత్రుని వద్దకు వెళ్తారు. కొందరికి వినయం అంటే ఇష్టం, ఉపాలి వద్దకు వెళ్తారు. కొందరికి సూత్రాలంటే ఇష్టం, ఆనందుని వద్దకు వెళ్తారు. కొందరికి మానసిక శక్తులంటే ఇష్టం, మౌద్గల్యాయనుని వద్దకు వెళ్తారు. ఆరుగురు భిక్షువులకు లోకాభిరామాయణం ఇష్టం, వాగీశుని వద్దకు వెళ్తారు. వాగీశుడు తీరిక సమయంలో వేపచెట్టు క్రింద అరుగు మీద వచ్చి కూర్చుంటాడు. ఈ ఆరుగురు ఆయన్ను పరివేష్టించి కూర్చుంటారు. వారి మధ్య జరిగిన ఒకనాటి సంభాషణ:

వాగీశుడు: మీరీ వార్త విన్నారా? ఉత్తరమల్ల గణతంత్రం ఎన్నికతో రామగుప్తుడు గెలిచాడట!

1వ భిక్షువు: ఆశ్చర్యంగా ఉందే! రుద్రసేనుడు గెలుస్తాడని కదా అందరూ అనుకొనింది!

4వ భిక్షువు: రుద్రసేనుడు ఈ వరకే రెండుసార్లు గెలిచాడు కదా! కొత్తముఖానికి అవకాశం ఇచ్చి చూస్తామని రామగుప్తుణ్ణి గెలిపించియుంటారు.

వాగీశుడు: అదేమీ కాదు. శలాక (vote) ఉన్న పౌరులందరికీ సింధూదేశం గుఱ్ఱాలను ఒక్కొకటి ఇస్తానని రామగుప్తుడు వాగ్దానం చేసి అఖండ విజయం సాధించాడట!

3వ భిక్షువు: అంత ధనం ఉందా అతని వద్ద?

5వ భిక్షువు: ఉంటే మాత్రం అతని ధనం ఎందుకిస్తాడు? కోశాగారంలో ఉంటే ఇస్తాడు.

2వ భిక్షువు: గాంధారదేశం నుండి మగధకి మల్లయోధుల జట్టు వచ్చిందటగా! ఏ జట్టు గెలిచిందో?

వాగీశుడు: ఇప్పటికి నాలుగు పోటీలు జరిగాయి. రెండు జట్లు చెరి రెండు పోటీలు గెలిచాయట. ఐదవది ఎల్లుండి జరుగుతుంది. బలే ఉత్కంఠంగా ఉంటుందిలే. ఈ భిక్షు నియమాలు అడ్డు రాకపోతే నేను వెళ్ళేవాడినే.

6వ భిక్షువు: ఈ మధ్య కొన్ని దినాలుగా కమల, విహారానికి రావడం లేదు. గమనించారా?

వాగీశుడు: మొన్న నళిని ఇంటికి భిక్షకు వెళ్తే తెలిసింది. అక్కడ విమల కనిపించింది, కమల సంగతి అడిగాను. వత్సదేశం నుండి బంధువులు వచ్చారట. అందుకని రావడం లేదట. నిన్న వనజ కనిపించింది. తనూ ఇందిరా ఈ పోషధానికి రావడం లేదని చెప్పింది. లలితా, వాసవి తప్పక వస్తారట.

2వ భిక్షువు: సుదత్తుడు అంగదేశం నుండి వంగదేశానికి వాణిజ్యాన్ని విస్తరించాడటనే! మరి ఇది మిగారుణ్ణి దెబ్బతీస్తుందంటారా?

వాగీశుడు: తప్పక దెబ్బ తీస్తుంది. కానీ అక్కడి నష్టాన్ని అతడు కన్యాకుబ్జంలో పూడ్చుకోగలడు. ఎలా అంటే అపుత్రశ్రేష్ఠి పోయాడుగా! ఇక కన్యాకుబ్జంలో మిగారుడిదే ఇష్టారాజ్యం.

5వభిక్షువు: అపుత్రశ్రేష్ఠి వందా ఇరవై కోట్ల ఆస్తిపరుడని విన్నాము. అదంతా ఇప్పుడేమైందో?

వాగీశుడు: వారసులు లేకపోతే ఆస్తి అంతా రాజుకే కదా! 'అపుత్రశ్రేష్ఠి ఎప్పుడు చస్తాడా' అని గ్రద్దలాగా ఎదురు చూస్తున్న ప్రసేనజిత్తు దాన్నంతా కోశాగారానికి చేర్చుకొన్నాడు.

3వ భిక్షువు: పిల్లలు లేనివాడు దానధర్మాలు చేసి పుణ్యం గడించి ఉండవచ్చుగదా!

ఎందుకు వృథాగా పోనిచ్చాడు?

వాగీశుడు: "స్వభావో దురతిక్రమః" అపుత్రశ్రేష్ఠి ఆనందశ్రేష్ఠికి అన్న అనవచ్చు. ఇద్దరినీ పోలిస్తే ఆనందశ్రేష్ఠి కొంచం నయం. అపుత్రశ్రేష్ఠి ఎప్పుడూ చినిగిన దుస్తులు వేసుకొనేవాడు. ఎవరైనా విరాళం అడగడానికి వస్తే "నేనిప్పుడు చాలా కష్టాల్లో ఉన్నాను. కొత్తబట్టలు కూడా కొనుక్కోలేక ఈ దరిద్రపు చినుగులతోనే తిరుగుతున్నాను. మీకేమి సహాయం చేయగలను?" అనేవాడు.

1వ భిక్షువు: ధనగుప్తుడు మొన్న పట్టపగలు నడిబజారులో వందమంది జనం చూస్తుండగానే వీరదత్తుణ్ణి నరికేశాడు కదా! శిక్ష నుండి ఎట్లా తప్పించుకొన్నాడబ్బా?

4వ భిక్షువు: 'ఆత్మరక్షణ' వాదం చేసినాడట!

6వ భిక్షువు: అదేమీ కాదు. కనకప్రభ సహాయం చేసిందంటున్నారు.

వాగీశుడు: మీకు తెలిసినదంతా గాలి వార్తలు. లోపల ఏం జరిగిందో నా చెవికొచ్చింది. ధనగుప్తుణ్ణే పోయి అడిగాను- 'ఎలా బైటపడ్డావయ్యా?' అని. జరిగింది చెప్పాడు. చెరి వెయ్యి వరహాలు తొమ్మిది మంది న్యాయధీశులకు ఇచ్చాడట. వాళ్ళొక ధ్రువీకరణపత్రం వైద్యుణ్ణి అడిగి తెమ్మన్నారట. వైద్యుడికి ఒక వెయ్యి ఇచ్చి దాన్ని తీసుకెళ్ళాడట. తీర్పు అనుకూలంగా వచ్చేసింది. "బాల్యావస్థ, ఉన్మాదావస్థ, మదావస్థ (inebriating condition) - ఈ మూడవస్థల్లో ఉన్నవాళ్ళు చేసింది పరిగణనలోకి తీసుకోరాదు. ధనగుప్తుడు ఉన్మాది అని వైద్యుడు ధ్రువీకరించాడు. శుక్రాచార్య శిక్షాస్మృతి 564వ శ్లోకం ప్రకారం ధనగుప్తుడు నేరం చేయలేదని తీర్పు ఇస్తున్నాము". ఇదీ అసలు విషయం.

పరిసరాలను కూడా గమనించలేనంతగా లోకాభిరామాయణంలో మునిగిపోయిన ఆ సప్తవర్గీయ భిక్షువులు అక్కడికి బుద్ధుని రాకను గమనించనేలేదు.

---

* *ఆనందశ్రేష్ఠి కథ చూడుడు ధర్మపదం కథలు*

"భిక్షువులారా" అనే సంబోధన విని అందరూ తత్తరపాటుతో లేచి నిలబడబోయారు. వాళ్ళను అలానే కూర్చోమని బుద్ధుడు చేతితో సంజ్ఞ చేసి ఇలా అన్నాడు. "సంభిన్న ప్రలాపం (idle talk, useless talk, gossip, senseless talk) చేయడానికేనా మీరు ఇల్లూ వాకిలీ వదలి భిక్షువులయ్యింది? దీనివల్ల మీకు కలిగే ప్రయోజనం ఏమిటి? లోకంలో ఎన్నో జరుగుతుంటాయి. ఆ సమాచారాన్నంతా తెలుసుకొంటూ మీరు సాధించబోయేదేమిటి? అది మీ జీవితానికి ఏవిధంగా ఉపయోగిస్తుంది? ఒక్కసారి బాగా ఆలోచించుకోండి. మనస్సనే పెద్ద గ్రంథాన్ని మీవద్దే ఉంచుకొని దాన్ని అధ్యయనం చేయడం మానివేసి నిరర్థకమైన అన్య విషయాలలో కుతూహలాలు పెంచుకొన్నారు. భిక్షువుగా ఉన్నవాడు జనపద వితర్కాలనుండి జ్ఞాతివితర్కాల నుండి కామవితర్కాలనుండి వ్యాపాద వితర్కాలనుండి మనస్సును దూరం చేయకుండా నిర్లక్ష్యంగా జీవిస్తూ ఉంటే జరిగేది ఏమిటో తెలుసా?

**పుష్పాణి హ్యేవ ప్రవిచిన్వంతం వ్యాసక్తమనసం నరమ్**
**సుప్తం గ్రామం మహోఘ ఇవ మృత్యురాదాయ గచ్ఛతి** 4-4

లోకవార్తా పుష్పాలను సేకరిస్తూ మైమరచియున్న నరుణ్ణి ఒకనాడు మృత్యువు తటాలున లాక్కెళ్ళిపోతుంది-గాఢనిద్రలో ఉన్న గ్రామాన్ని మహాప్రవాహం లాక్కెళ్ళిపోయినట్లుగా.

**పుష్పాణి హ్యేవ ప్రవిచిన్వంతం వ్యాసక్తమనసం నరమ్**
**అతృప్తమేవ కామేషు అంతకః కురుతే వశమ్** 4-5

లోకవార్తా పుష్పాలు ఏదినానికాదినం క్రొత్తవి పుడుతూనే ఉంటాయి. ప్రొద్దున లేచిన వెంటనే వాటిని గిల్లుకోవడం అనే వ్యసనంలో పడిపోయినవాడు చివరకు మృత్యువు వశం అవుతాడు. అజ్ఞానిగానే చస్తాడని అర్థం.

# లోకక్షేముడు

పూర్వారామానికి ఎనిమిదిమైళ్ళ దూరంలో ఉత్తరంగా ఉన్న అంగదిన్న గ్రామసీమలో ఒక ఆరామం ఉన్నది. అక్కడి శ్రామణేరులకు (novices) ఉపాధ్యాయుడుగా లోకక్షేముడుంటే బాగుంటుందని అంగదిన్నవాళ్ళు భావించి పూర్వారామంవాళ్ళకు వినతి చేశారు. లోకక్షేముడు ఇరవై ఏండ్లుగా పూర్వారామంలో ఉంటున్నాడు. అతణ్ణి పంపించడానికి పూర్వారామంవాళ్ళు మొదట ఒప్పుకోలేదు. అంగదిన్నవాళ్ళు మాటిమాటికి ఒత్తిడి చేయడం వల్ల కాదనలేక చివరికి ఒప్పుకొన్నారు. వెంటనే అంగదిన్నవాళ్ళు అమోఘసిద్ధి అనే భిక్షువును పూర్వారామానికి పంపారు - లోకక్షేముణ్ణి వెంటబెట్టుకొనిరమ్మని. అమోఘసిద్ధుడు పూర్వారామానికి వచ్చిన సమయంలో అక్కడ లోకక్షేముడు లేడు. ప్రక్కనున్న పల్లెకు భిక్షకై వెళ్ళియుంటాడని అక్కడివాళ్ళు చెప్పారు. అమోఘుడు అతని రాకకై ఒక గంట వేచి చూసి అప్పటికీ అతను రాకపోయేసరికి ఆ పల్లెకు నడిచాడు. ఆ పల్లెను సమీపిస్తుండగా లోకక్షేముడు ఎదురయ్యాడు. అభివాదనం చేసి "మిమ్మల్ని అంగదిన్నకు తోడ్కొనిరమ్మని నన్ను పంపారు" అన్నాడు. "సరే వెళ్దాంపద" అని లోకక్షేముడు అంగదిన్న వైపు అడుగులు వేశాడు. "అటెక్కడికి వెళ్తున్నారు?" అన్నాడు అమోఘుడు. "అంగదిన్నకు" అన్నాడు లోకక్షేముడు. "చూసి రావడానికి కాదండీ మిమ్మల్ని రమ్మంటున్నది, అక్కడే ఉండటానికి" అన్నాడు అమోఘుడు. "అక్కడ ఉండడానికే వెళ్తున్నాను" అన్నాడు లోకక్షేముడు. "మరి మీ వస్తువులు (luggage) తెచ్చుకోవడానికి మళ్ళీ వస్తారా?" ప్రశ్నించాడు అమోఘుడు. "మళ్ళీ వచ్చే పనేముంది? నా వస్తువులు (luggage) అక్కడేమీ లేదు. కుటీరంలో ఒక చాప, కంబళి, ఆసనం, నీటి కూజా ఉన్నాయి. అవి నావి కావు. ఆరామానివి" అని లోకక్షేముడు

అంగదిన్నవైపు నడుస్తూనే ఉన్నాడు. "భదంతా, ఆగండి. పది నిముషాల్లో వచ్చేస్తాను. అక్కడ నా వస్తువులు తేనెచెంబు, ఊరగాయముంత, లోటా, పళ్ళెం వదలివచ్చాను. తెచ్చుకోవాలి" అన్నాడు అమోఘుడు. లోకక్షేముడు ఆశ్చర్యంతో "నీవు వచ్చి గంట కూడా కాలేదు. అప్పుడే అన్ని వస్తువులు చేరిపోయాయా!" అన్నాడు. (అమోఘసిద్ధి కుటీరం గనక చూస్తే లోకక్షేముడు ఆశ్యర్యపోవడం కాదు, మూర్ఛబోతాడు. అమోఘుడు మకాం మార్చాలంటే వస్తువులు చేరవేయడానికి ఎద్దులబండి అవసరం అవుతుంది). "నేనెవర్నీ ఏమీ అడగను భదంతా. భక్తులే ఇస్తుంటారు. వద్దంటే వాళ్ళ మనస్సు గాయం అవుతుంది. అందుకని తీసుకొంటాను. మీరిక్కడే ఉండండి. వచ్చేస్తాను" అని అమోఘుడు పూర్వారామం వైపు వేగంగా అడుగులు వేస్తూ వెళ్ళాడు.

లోకక్షేముడు అంగదిన్న ఆరామం చేరగానే అక్కడున్న శ్రామణేరులు (novices), భిక్షువులు సగౌరవంగా అతనికి అభివాదనం చేసి అతని రాకకు సంతోషాన్ని వ్యక్తం చేస్తూ తొలి సందేశం ఇమ్మని చుట్టూ గుమికూడారు. వాళ్ళ ఉత్సుకతను గమనించి లోకక్షేముడు అక్కడ తన తొలి సందేశాన్ని క్రింది విధంగా వ్యక్తం చేశాడు.

"సోదరులారా, మనం ధర్మస్వామిని శరణు పొంది శిష్యులమయినాము. స్వంత ఇల్లూ వాకిలీ, కర్మ (profession) వదలివచ్చి ఆయన్ను ఆశ్రయించాము. ఎక్కడికి వచ్చినా మనకు ప్రప్రథమంగా అవసరమైనది వృత్తియే (జీవిక = ఆహారం, పానీయం వగైరా) కదా! ధర్మస్వామి మనకు ఒక విధమైన జీవికను అనుమతించియున్నాడు. ప్రజలనుండి ఆహారం, చీవరం (వస్త్రం), శయన ఆసనాదులు అవసరమైన మేరకే భిక్షగా స్వీకరించడానికి అనుజ్ఞ ఇచ్చియున్నాడు. మనకు ఒక విధమైన కర్మను (profession or activity) కూడా నిర్దేశించియున్నాడు. ఆర్య అష్టాంగమార్గములో (నిరోగామినీ ప్రతిపద్ = path leading to the

cessation of craving, the cause of misery) నడవడమే మన కర్మగా (profession) విధించియున్నాడు. అన్యమైన కర్మలు మనకు లేదు. స్వంత జీవికా లేదు. మన ఆహారం, వస్త్రాలు, వస్తువులు, నివాసం ఏదీ మన స్వంతం కాదు. కనుక వీటియందు పెద్ద ప్రయత్నం లేకుండానే మమకారభావం తొలగించుకోవడానికి మనకు వీలయ్యింది. కానీ అహంకార నిర్మూలనం అంత తేలిక కాదు. అది ప్రజ్ఞ (insight or wisdom) ద్వారానే సాధ్యం. ప్రజ్ఞ కలుగాలంటే కాయ వ్యపకర్షం (seperation), చిత్త వ్యపకర్షం (seperation) అవసరం. మనం ఒంటరి జీవితాన్ని (single living) ఎన్నుకోవడంతో కాయవ్యపకర్షం సులభం అయ్యింది. చిత్తవ్యపకర్షం కొంచెం కష్టమే. అకుశల వితర్కాల నుండి (unskillful thoughts, unwholesome thoughts) చిత్తాన్ని దూరం చేస్తూ ఉండాలి. వ్యాపాదవితర్కాలు, కామవితర్కాలు, జ్ఞాతివితర్కాలు, జనపదవితర్కాలు, అమరవితర్కాలు - వీటికి చిత్తంలో చోటిచ్చి పెంచకండి. ప్రజల నుండి మనం ఆమిషదానం (material gift) తీసుకొని బ్రతుకుతున్నాము. బదులుగా మనం వారికి ధర్మదానం (gift of teachings of Buddha) చేయాలి. మన వాక్కును కేవలం ధర్మదానం కోసమే వాడాలి. అన్య విషయ ప్రసంగాలు మనం చేయకూడదు. చివరగా ఒక మాట. నేడు దేశంలో మన ధర్మస్వామి కాకుండా ఇతర శాస్తారులు ఆరుగురున్నారు. 1. పూరణకాశ్యపుడు, 2. మస్కరీగోశాలీపుత్రుడు, 3. సంజయవైరటీసుతుడు, 4. అజితకేశకంబళుడు, 5. కకుదకాత్యాయనుడు, 6. నిర్గ్రంథజ్ఞాతిపుత్రుడు. మన శాస్తను గౌరవించడం, ప్రేమించడం అంటే అన్యశాస్తలను తక్కువ చేసి మాట్లాడడం అనే అవివేకంలో మనం పడకూడదు. భిన్న భిన్న రుచుల ప్రజలకు భిన్న భిన్న శాస్తారుల అవసరం ఎప్పుడూ ఉంటుంది. కనుక ఇతర శాస్తలను కూడా గౌరవించండి. మన శాస్తపట్ల గౌరవం, శ్రద్ధ, ప్రేమ, భక్తి చెక్కు చెదరనీయకుండా అట్లే ఉంచుకొని ఇతర శాస్తలను గౌరవించడం చేయండి. ఎన్నడూ వాళ్ళనుగానీ వాళ్ళ బోధనలను గానీ తూలనాడకండి. మన

శాస్త్ర మీద మనకు వీరాభిమానం ఉంటే దాన్ని ప్రకటించే ఆరోగ్యమైన పద్ధతి వేరే ఉంది. మన శాస్త్ర ఉపదేశాలు హాటకప్రభాసం అనే రసజాతం (elixer = పరుసువేది) వంటిది. హాటక ప్రభాసం స్పర్శ సోకగానే ఇనుము బంగారం అవుతుందని ప్రతీతి. ఉపదేశాల స్పర్శతో మనలోని పృథక్ జనత్వం (worldly nature) అనే ఇనుమును జినపుత్రత్వం (ఆర్యత్వం = noble nature ) అనే బంగారంగా మార్చుకొనడమే మన వీరాభిమానాన్ని ప్రకటించుకొనే ఆరోగ్య విధానం. కనుక సోదరులారా, మనం అందరం సదా జాగరూకులుగా ఉంటూ చిత్తవీక్షణ, కాయవీక్షణ చేసుకొంటూ మనలోని దోషాలను ఎప్పటికప్పుడు కనిపెట్టి సరిచేసుకొంటూ భగవంతుడు నిర్దేశించిన మార్గంలో పయనించేవారమగుదుముగాక!"

ఆ తరువాత ఒకనాడు పూర్వారామంలో లోకక్షేముని ప్రస్తావన వచ్చినపుడు బుద్ధుడు అతణ్ణి ఉద్దేశించి క్రింది శ్లోకం చెప్పాడు.

***యథా ఽ పి భ్రమరః పుష్పం వర్ణగంధమహేఠయన్***
***పలాయతే రసమాదాయ ఏవం గ్రామే మునిశ్చరేత్*** **4-6**

భ్రమరం (తుమ్మెద), పుష్పం యొక్క ఆకారానికి గానీ గంధానికి గానీ ఎటువంటి నష్టాన్ని కలిగించకుండా చాలా మృదువుగా తనకు కావలసినంతవరకే రసాన్ని మాత్రం తీసుకొని వెళ్ళిపోతుందో అలాగే ముని (భిక్షువు) గృహస్థులకు పీడాకరం (taxing) కాకుండా మెలగవలెను. (చిత్తమౌనం ఉన్నవాణ్ణి ముని అంటారు.)

# గయాశీర్షుడు

గయాశీర్షుడు మంచి గురువును అన్వేషిస్తున్నాడు. ఒకనాడు ఆ పని మీదనే తీర్థిక సేవాశ్రమానికి వెళ్ళాడు. ఆ దినం అక్కడ ప్రశ్న-ప్రతివచన కార్యక్రమం జరుగుతోంది. మంచి సమయానికే వచ్చాననుకొని పోయి భక్తజనంలో కూర్చొన్నాడు. తీర్థికస్వామి వేదిక మీదికి వచ్చి ఆసీనులై "ఇక కార్యక్రమం మొదలు పెట్టాము" అన్నాడు. వెంటనే ఒక భక్తుడు లేచి నిలబడి "తూర్పు, పడమర, ఉత్తరం, దక్షిణం అని నాలుగు దిక్కులున్నాయి. ఏ దిక్కుముఖంగా కూర్చొని భోజనం చేయవలెనో సెలవివ్వండి" అని ప్రశ్నించాడు.

"దీర్ఘాయుష్షు కావాలనుకొంటే తూర్పుముఖంగా కూర్చొని భుజించాలి. కీర్తి కావాలనుకుంటే దక్షిణదిక్కు ముఖంగా కూర్చొని తినాలి. సంపద కావాలంటే పడమటిదిక్కు ముఖంగా కూర్చొని ఆరగించాలి. ముక్తి కావాలనుకుంటే ఉత్తర దిక్కు ముఖంగా కూర్చొని భుజించాలి" అని తీర్థికస్వామి ప్రతివచనం పలికాడు.

గయాశీర్షుడు లేచి నిలబడి "స్వామీ, నాకు దీర్ఘాయుష్షు, కీర్తి, సంపదా, ముక్తీ ఈ నాలుగూ కావాలి. మరి నేను గిఱ్ఱున తిరిగే రంగులరాట్నంలో కూర్చొని భుజించవలెనా?" అని ప్రశ్న వేశాడు.

తీర్థికస్వామి కాసేపు గంభీరంగా ఆలోచించి "నాలుగు కోరికలు ఏకకాలంలోనే మనస్సులో తలెత్తజాలవు. ఒకటి తరువాత ఒకటి కలుగవచ్చును. ఒక కోరిక వ్యక్తావస్థలో (manifest state) ఉంటే తక్కినవి అవ్యక్తావస్థలో (unmanifest state) ఉంటాయి. కనుక రంగుల రాట్నం అవసరం లేదు" అని ప్రతివచనం ఇచ్చాడు.

ఇంకేమీ చేయకుండా ఉత్తరదిక్కు ముఖంగా కూర్చొని తింటూ ఉంటే సరిపోతుందా?" అని గయాశీర్షుడు అనుబంధ ప్రశ్న వేశాడు.

తీర్థికస్వామి మళ్ళీ కాసేపు లోతుగా ఆలోచించి "ముక్తికి ఉత్తరం దిక్కుముఖంగా తినడం ఒకటే చాలదు. ఇది సహకారి కారణం మాత్రమే. ఇంకా ఇతర కారణాలు కూడా అవసరం. ఉదా: కుమ్మరి, కుండలు చేయాలంటే మట్టి అవసరం, సారె అవసరం, నీళ్ళు అవసరం, త్రిప్పడం అవసరం కనుక సరే ఇక తరువాతి ప్రశ్నకు వెళ్దాం" అన్నాడు భక్తులను చూస్తూ. భక్తులనుండి ఒకటి తరువాత ఒకటి చాలా ప్రశ్నలు వచ్చాయి. ప్రతి ప్రశ్నకూ స్వామి నాలుగైదు నిముషాలపాటు ఓపికగా ప్రతివచనాలు పలికాడు. (మాదిరి ప్రశ్నలొక రెండు: "కాలము వేగముగా పరుగెత్తుచున్నది. మనమేమి చేయవలెను?"; "నిరాధారముగా ఉన్న ఆకాశము ఎప్పుడైననూ విరిగి మీద బడవచ్చును. అప్పుడు తీసుకొనవలసిన జాగ్రత్తలు ఏమిటి?")

"ఈ కార్యక్రమం ఇప్పటికి ముగిసినది. మళ్ళీ పై వారం సమావేశం అవుదాము" అని స్వామి లేవడానికి ఉపక్రమిస్తుండగా గయాశీర్షుడు చాలా వినయాన్ని జిజ్ఞాసను ప్రదర్శిస్తూ "స్వామీ, నన్నొక ప్రశ్న చాలా నాళ్ళుగా వేధిస్తున్నది. సృష్టిలో కొన్ని గాడిదలు పొట్టి కొమ్ములు కలవిగానూ కొన్ని పొడవు కొమ్ములు కలవిగానూ ఎందుకున్నాయి? ఈ సృష్టి వైషమ్యానికి కారణం ఏమిటి? తెలియపరచవలసినదిగా సవినయంగా మనవి చేస్తున్నాను" అన్నాడు.

తీర్థికస్వామి గాఢంగా ఆలోచించి "సృష్టిలోని అన్ని వైషమ్యాలకు కారణం గుణముల తారతమ్యమే. తమస్సు కన్నా రజస్సు ఎక్కువగా ఉన్నప్పుడు గాడిదలకు పొడవు కొమ్ములు కలగడం, రజస్సుకన్నా తమస్సు ఎక్కువ అయినపుడు పొట్టికొమ్ములు కలగడం జరుగుతుంది. ఈ గుణముల తారతమ్యం కర్మానుసారంగా ఉంటుంది" అని ప్రతి వచనం పలికాడు.

"స్వామీ, తమస్సు రజస్సులకన్నా గాడిదలలో సత్త్వం ఎక్కువైనపుడు ఏమి జరుగుతుందో సెలవిస్తారా?" అన్నాడు గయాశీర్షుడు.

తీర్థికస్వామి మళ్ళీ గాఢంగా ఆలోచించి "సత్త్వగుణాధిక్యత సాధారణంగా పశువులకు ఉండదు. ఒకవేళ గాడిదల్లో సత్త్వాధిక్యత కలిగే పక్షంలో వాటికి కొమ్ములు మొలవకపోవడం అనేది జరుగుతుంది. ఇప్పుడు ఈ పరిప్రశ్న కార్యక్రమాన్ని సమాప్తం చేస్తున్నాను. పై వారం మళ్ళీ కలుస్తాము" అని వేదిక నుండి లేచి క్రిందకు దిగాడు.

గయాశీర్షుడు ఈ ప్రకారంగా అనేక ఆశ్రమాలకు వెళ్ళడం, వాళ్ళ ప్రసంగాల్లో పక్షదోషాలు, హేతుదోషాలు, స్వవచనవ్యాఘాత దోషాలు, అనవస్థాదోషాలు, చక్రకదోషాలు, అన్యోన్యాశ్రయదోషాలు ఇంకా ఇతర దోషాలున్నాయని అనుకొంటూ కొన్ని చోట్ల ఘర్షణ పడుతూ చివరకు జేతవనం చేరాడు. బుద్ధుని బోధనలు చాలా హేతుబద్ధంగా ఉన్నాయని అతనికి తోచి అక్కడ ప్రవ్రజ్యదీక్ష తీసుకొన్నాడు. ఆ సందర్భంలో అతనికి బుద్ధుడు క్రింది శ్లోకాన్ని చెప్పాడు.

**న పరేషాం విలోమాని న పరేషాం కృతాకృతమ్**
**ఆత్మన ఏవ అవేక్షేత కృతాని అకృతాని చ** **4-7**

ఇతరుల లోపాలను, కృత్యములను అకృత్యములను విమర్శిస్తూ ఉండడంలో ప్రయోజనం లేదు. తన లోపాలేమిటి? తను చేస్తున్నదేమిటి? అని ఆత్మపరిశీలన చేసుకొంటూ ఉండడం మంచిది.

# ఛత్రపాణి

కోసలరాజు ప్రసేనజిత్తు ఒకనాడు బుద్ధ సందర్శనం కోసం జేతవనం వచ్చాడు. రాజు వచ్చినా రాణి వచ్చినా మంత్రి వచ్చినా భిక్షువులెవరూ లేచి నిలబడి మర్యాద చూపరు. ఆ విషయం ప్రసేనజిత్తుకు తెలుసు. ఆ విషయం ప్రసేనజిత్తుకు తెలుసు. వాళ్ళు లేచి నిలబడి మర్యాద చూపాలని తను ఆశించిందీ లేదు. అంతటి దురహంకారం తన రక్తంలో లేదు. కానీ ఆనాడు అక్కడ కూర్చొనియున్న ఒక మామూలు పౌరుడు తనను చూచి కూడా లేచి నిలబడకుండా భిక్షుకీవిని వెలయించడం ప్రసేనజిత్తుకు ఆగ్రహం తెప్పించింది. అతని ముఖంలో వచ్చిన మార్పును దానికి కారణాన్ని కూడా పసిగట్టిన బుద్ధుడు ప్రసేనజిత్తుతో "కోసలాధీశా, ఛత్రపాణి బైట మామూలు పౌరుడే. కానీ ఇక్కడ అతని స్థాయి వేరే. చాలా ఏండ్లుగా అతడు ధర్మాన్ని (teachings) శ్రవణం చేస్తూ వస్తున్నాడు. శ్రవణం చేయడమే కాదు, పది సంయోజనాల్లో (fetters) ఐదింటిని వదిలించుకొని అనాగామి స్థాయిని అందుకున్నవాడు. అతడు మీ పట్ల అమర్యాద చూపలేదు. ఇక్కడ నా ముందరున్నాడు గనుక అధ్యాత్మ సంప్రదాయం పాటిస్తూ లేచి నిలబడలేదు. కనుక అతనిలో అమర్యాద దోషాన్ని చూడకండి" అని హితువు చెప్పాడు. ప్రసేనజిత్తు ఆగ్రహం తాటాకు మంటలా చప్పున చల్లారిపోయింది. తిరిగి వెళ్తున్నప్పుడు ఛత్రపాణికి కూడా చేతులు జోడించి నమస్కరించి "మీ గొప్పదనం ఏమిటో తథాగతులవారి వల్ల తెలిసింది. మీరు నా దేవేరులకు ధర్మభాణకులుగా ఉండాలని మనవి చేస్తున్నాను"అన్నాడు. "కోశలాధీశా, నేనింకనూ శైక్షావస్థలోనే (learning stage) ఉన్నాను. తథాగతులవారి శిష్యులు 80 మంది ఒకరికి మించినవాళ్ళు ఒకరుండగా నేను దేవేరులకు ధర్మభాణకుడుగా

ఉండడమేమిటి? ఆనందులవారిని ఒప్పించి పంపుతాను. ఆయన ధర్మనిధి, ధర్మరక్షకుడు. ఎనభైనాలుగువేల ఉపదేశ వాక్యాలు ముద్రించినట్లుగా ఆయన జ్ఞాపకంలో నిలిచిపోయాయి. అంతటి జ్ఞాపకశక్తి ఈ జంబూద్వీపంలో ఇంకెవ్వరికీ లేదు" అన్నాడు వినయంగా ఛత్రపాణి.

* * *

ప్రసేనజిత్తు దేవేరులు మల్లికాదేవికి, వాసవీదేవికి ఆనందుడు ధర్మభాణకుడయ్యాడు. ఒకనాడు, ఆనందుడు బుద్ధునితో ఇలా అన్నాడు "బుద్ధదేవా, బహుజనహితం కోసం సుఖం కోసం మీరు ధర్మామృతవర్షం కురిపిస్తున్నారు. మీ అమృత వాక్కులను నేను తు.చ. తప్పకుండా మల్లికకు వాసవికి చెబుతున్నాను. మల్లిక ప్రయోజనం పొందుతున్నట్లుగా కనిపిస్తున్నది. వాసవి కించిత్ ప్రయోజనం కూడా పొందలేక పోతున్నట్లనిపిస్తున్నది. ఈ వ్యత్యాసానికి కారణం ఏమిటి?" అని ప్రశ్నించాడు.

"ఆనందా, మనం చెప్పేది మోక్షగమన మార్గమే. గమనం ఎవరికివారు చేయవలసియున్నది. మోక్ష గమనానికి అంతరాయాలు (obstacles) మూడున్నాయి. 1. అగంతుకామతా(non-inclination) 2. మార్గవిభ్రమం (confusion regarding path) 3. మార్గసంశయం (doubt). వాసవిలో ఏ అంతరాయం ఉందో గమనించి ఆ అంతరాయం తొలిగిపోయే బోధన పద్ధతిని అవలంబించు. మొదటి అంతరాయానికి కారణం సత్కాయదృష్టి (personality belief or false view of self). రెండవ అంతరాయానికి కారణం శీలవ్రత పరామర్శ (clinging to mere rites and rituals). మూడవ అంతరాయానికి కారణం దృష్టిపరామర్శ (speculative views, dogmatic views). వాసవిలో మొదట సత్కాయ దృష్టి చెదరిపోయే విధంగా బోధించు. ఇది అంత తేలిక కాదు. సత్కాయ దృష్టి కేవలం మానవులకే కాదు పిపీలకాది బ్రహ్మపర్యంతం ఉన్నట్టిదే. పిపీలకాదులు సత్కాయదృష్టికి పేర్లు

పెట్టవు. మానవుడు దానికి రకరకాల ముద్దు పేర్లు పెట్టుకొన్నాడు. ప్రతి జీవికీ పుట్టుకతో కర్ణునికి సహజ కవచకుండలాల్లాగా - ఈ సత్కాయదృష్టి అనే కవచం వచ్చినట్టిది. ఈ కవచం ఊడినప్పుడే మానవుడు మోక్షస్రోతస్సులో పడతాడు. ఆ తరువాత ఆ స్రోతస్సే అతణ్ణి గమ్యానికి చేర్చుతుంది. కానీ ఈ కవచాన్ని వదిలించుకోవడం అనేది చాలా కష్టమైన పని. దేహం పట్ల ఏక సంజ్ఞ (One single unit idea) పోగొట్టాలి. అందుకే నేను స్కంధాలు, ధాతువులు, ఆయతనాలు అంటూ ఉపదేశం మొదలుపెట్టింది. మనం మేఘంలాగా పని చేసుకపోవాలి. మేఘం, వర్షించేటప్పుడు ఇది చవిటి భూమి, ఇది సారమైన భూమి అని లెక్కబెట్టూ కూచోదు. సమానంగా వర్షించి అంతరించిపోతుంది. అలాగే మనమున్నూ ధర్మామృతవర్షాన్ని కురిపిస్తాము. ఫలించడం, ఫలించకపోవడం అనేది వినేవాళ్ళ ఆచరణ మీద ఆధారపడి ఉంటుంది.

**యథాపి రుచిరం పుష్పం వర్ణవదగంధకమ్**
**ఏవం సుభాషితా వాక్ అఫలా భవత్యకుర్వతః** 4-8

సుభాషితాన్ని (well-spoken word) ఆచరించనివానికి అది పరిమళం లేని అందమైన పుష్పంలాగా నిరుపయోగం అవుతుంది.

**యథాపి రుచిరం పుష్పం వర్ణవత్ సుగంధకమ్**
**ఏవం సుభాషితా వాక్ సఫలా భవతి కుర్వతః** 4-9

సుభాషితాన్ని ఆచరించేవానికి అది పరిమళం కలిగిన అందమైన పుష్పం లాగా ఉపయోగపడుతుంది.

# కుండలకేశి

రాజగృహంలో (మగధరాజ్యం తొలి రాజధాని. పాతపేరు గిరివ్రజం) పుష్పకూటునికి మంచి పలుకుబడి. రాజు నుండి తలారి వరకు అతని మాట చెల్లుతుంది. ఆ పుష్పకూటుని కుమార్తె కుండలకేశి. బైటేవో వ్యవహారాల్లో అతడు తలమునకలుగా ఉంటూ ఎప్పుడూ గంభీరంగా ఉంటాడు. కానీ ఇంట్లోకి అడుగు బెట్టి కుండలకేశి ముఖం చూసిన క్షణంలోనే అతని ముఖం మారిపోతుంది. ముఖంలో మందహాసం పొంగుతుంది; కంఠంలో మార్దవం వచ్చేస్తుంది; కన్నుల్లో అదొక విధమైన వికాసం, మెరుపు వచ్చేస్తుంది. పద్దెనిమిదేండ్ల క్రితం అతనొక అనామకుడు. జీవనం కోసం ఆ ఊరు చేరి ఒక మాలాకారుని (florist) వద్ద నౌకరుగా చేరాడు. అప్పుడే కుండలకేశి పుట్టింది. ఆ బిడ్డ పుట్టిన వేళావిశేషం ఏమిటో తెలియదు, అతని జీవిత గమనం చిత్ర విచిత్ర గతులలో పురోగమించింది. కథాకాలం నాటికి అతడు రాజగృహం పురప్రముఖులు మొదటి ఎనిమిది మందిలో ఒకడు.

ఒకనాడు కుండలకేశి భవన ఉపరితలం (terrace) మీద విహరిస్తూ వీధిలో కోలాహల ధ్వని వినిపిస్తే కుతూహలంతో తొంగి చూసింది. ఒక యువకుణ్ణి వధ్యశాలకు రక్షకభటులు నడిపించుకునిపోతున్నారు. ప్రజలు అతని మీద జాలి చూపుతూ లడ్డు జిలేబీలాంటివి అతని చేతికి ఇస్తున్నారు. వాటిని అతడు తీసుకొంటున్నాడేగానీ తినడం లేదు. మట్టిపెళ్ళను నలిపినట్లు నలిపి జారవిడుస్తూ పరమ శ్మశాన వైరాగ్యంతో చూపరులకు అపర శుకదేవునిలా కనబడుతూ నడుస్తున్నాడు. కుండలకేశి అతణ్ణి చూసింది. కళ్ళప్పగించి తదేకంగా చూసింది. వరించింది. వివాహం చేసుకోవాలనుకొంది.

ఆమెకు రెండేండ్ల క్రితమే వివాహం నిశ్చయమైంది. విక్రమబాహు కొడుక్కిచ్చి వివాహం చేయాలని తండ్రి నిశ్చయించాడు. విక్రమబాహు కొడుకు తక్షశిలలో చదువుకొంటున్నాడు. కొన్ని నెలల్లో చదువు పూర్తి చేసుకొని వస్తాడు.

కుండలకేశి మేడమీది నుంచి వేగంగా క్రిందికి దిగి తండ్రి వద్దకు నేరుగా వెళ్ళి తన వింత కోరికను బైట పెట్టింది. పుష్పకూటుడు ఈ పద్దెనిమిదేండ్లలో తొలిసారిగా కూతురిని కోపంతో కసిరి మాట్లాడాడు. "పిచ్చిపిచ్చిగా వాగకు. వాడిమీద నీకంత దయగా ఉంటే చావు నుండి వాణ్ణి తప్పిస్తాను" అన్నాడు. ఆ మాత్రం కసిరి మాట్లాడినందుకే కుండలకేశి బిగ్గరగా ఏడవడం మొదలుపెట్టింది. ఆమె కంటిలో నలుసు పడితే తన గుండెలో బల్లెం దిగినంతగా బాధపడిపోయే పుష్పకూటుడు ఆ కూతురి ఏడుపుకు తట్టుకోలేక విలవిలలాడిపోయాడు.

* * *

కుండలకేశికి పెండ్లయి మూడు వారాలయ్యింది. పుష్పకూటుడు రాచకార్యం మీద అవంతికి వెళ్ళాడు. ఇల్లరికపుటల్లుడు భార్య గదికి వచ్చి "కేశీ, నేనెంత అదృష్టవంతుణ్ణి! యముని పిడికిలినుండి నన్ను ఇద్దరు దేవతలు తప్పించారు. ఒక దేవత నీవు. ఇంకొక దేవత కొండ మీద దుర్గమ్మ. పెండ్లయి మూడువారాలైనా ఇంతవరకు అమ్మ దర్శనానికి వెళ్ళనేలేదు. ఇక అమ్మను చూడకుండా ఉండలేను. అమ్మవారికి నిలువుదోపిడి మొక్కుబడి తీర్చివస్తాము. సర్వాభరణ భూషితవై బయలుదేరు" అన్నాడు ప్రేమగా.

* * *

భార్యాభర్తలిద్దరూ దుర్గమ్మ కొండ ఎక్కుతూ లోయ అంచుదారికి వచ్చారు. అతను ఆగాడు. ఆమె ముందుకు పోతూ ఉంది. "ఆగు" అన్నాడు. ఆమె ఆగింది. పిడిబాకును చేతికి తీసుకొన్నాడు. "మా గూడెంలో నాకు భార్య, ఇద్దరు పిల్లలున్నారు. వాళ్ళ పోషణ కోసమే నేను చోరక్రియ చేసి ప్రాణం మీదికి

తెచ్చుకొన్నాను. నీవు నన్ను కాపాడావు. ఆ మేలును మరవలేను. కనుక ఇప్పుడు నీకు రెండు క్షణాలు సమయం ఇస్తున్నాను. ఇష్టదేవతకు చివరి ప్రార్థన చేసుకో. సరిగ్గా రెండు నిముషాల తరువాత నీవుండవు. నిన్ను చంపి నీ ఆభరణాలు తీసుకొని శవాన్ని ఈ లోయలో పారవేసి నా దారిన పోతాను. ఇక నీవు కళ్ళు మూసుకొని ధ్యానం చేసుకో" అన్నాడు. అవి హాస్యం మాటలు కావు యథార్థమే అని కుండలకేశికి అర్థం అయ్యింది. "నా దేవత ఎదుటే ఉండగా కళ్ళు మూసుకొనడం దేనికి? నా భర్తే నా ఇష్టదేవత. నా ఇష్టదేవతకు ముమ్మారు ప్రదక్షిణం చేసి పాదాల చెంత వాలుతాను" అని భక్తితో చేతులు జోడించి "పతిదేవాయ నమః పతిదేవాయ నమః" అని భక్తితో ప్రదక్షిణం మొదలుపెట్టింది. మొదటి ప్రదక్షిణం పూర్తి చేసింది. రెండవ ప్రదక్షిణం చేస్తూ బలాన్నంతా కూడగట్టుకొని అమాంతం అతణ్ణి లోయలోకి తోసివేసింది.

"ఛీ ఛీ, ఎంతటి అవిశ్వసనీయ ప్రపంచంలో జీవిస్తున్నాము!" అనుకొని మొత్తం లోకాన్ని కాకిరెట్టగా అసహ్యించుకొని కుండలకేశి పరమ వైరాగ్యంతో భిక్షుణీ విహారానికి వెళ్ళి శైలను* ఆశ్రయించింది. శైల, భగవంతుని శిష్యురాలు. అర్హతురాలు. భవరోగానికి దివ్యౌషధంగా ఆమె శూన్యతాబోధన చేస్తుంటుంది. కుండలకేశికి కూడా అదే బోధన చేసి చివరగా తన ఉద్బోధనను క్రింది శ్లోకంతో ముగించింది.

**శూన్యమాధ్యాత్మికం పశ్య శూన్యం పశ్య బహిర్గతమ్**
**న విద్యతే సోఽపి కశ్చిద్ యో భావయతి శూన్యతామ్**

(See that the interior is empty, see that externals are empty, and there is no one who meditates on emptiness.)

---

* శైల ప్రస్తావన రేవతుడు శీర్షిక క్రింద కూడా వస్తుంది.

ఆ బోధన వల్ల కుండలకేశి చిత్తం ప్రసన్నమయ్యింది. లోకాన్ని తెగడడం లేదా పొగడడం అనే ద్వయం (duality) నుండి చిత్తం విముక్తమయ్యింది.

ఆ తరువాత ఒకనాడు విశాఖ బుద్ధునితో సంభాషిస్తూ కుండలకేశి ప్రస్తావన తెచ్చి "ఆ పిల్ల పూర్వాశ్రమంలో వట్టి మూర్ఖురాలుగా ప్రవర్తించింది" అన్నది. దానికి సమాధానంగా బుద్ధుడు "తన మూర్ఖత్వాన్ని మూర్ఖత్వంగా గుర్తించనన్నాళ్ళు ఆమె మూర్ఖురాలే. మూర్ఖత్వాన్ని మూర్ఖత్వంగా గుర్తించిన క్షణంలో పండితురాలయ్యింది కదా" అని క్రింది శ్లోకాన్ని చెప్పాడు.

**యో బాలో మన్యతే బాల్యం పండితో వాపి తేన సః**
**బాలశ్చ పండితమానీ స వై బాల ఇత్యుచ్యతే** **5-4**

ఉన్నదున్నట్లుగా చూడడం ప్రజ్ఞ. మూర్ఖుడు తాను మూర్ఖుణ్ణని తెలుసుకుంటే ఉన్నదున్నట్లు తెలుసుకొన్నాడు కనుక అతణ్ణి పండితుడనవచ్చు. ఇక మూర్ఖుడెవడంటే, తనలో ఉన్న మూర్ఖత్వాన్ని ఏమాత్రం గుర్తించకుండా దానికి పాండిత్యం అని పేరు పెట్టుకొని మురిసిపోతున్నవాడు.

---

Note : *శైల, క్షేమ, ధర్మదిన్న, ఉత్పలవర్ణ, కృశా గౌతమి - ఇలా Homan arhants పేర్లు చాలా ఉన్నాయి. ఆ పేర్ల సరసన కాలాంతరంలో కుండలకేశి పేరు కూడా చేరింది. ఏదో ఒక shock, తగలకపోతే మనిషి ఆధ్యాత్మికతకు మళ్ళడు. కుండలకేశికి ఒక రకమైన shock, మరొకరికి మరొక రకమైన shock. కుండలకేశి, విహారంలో చేరిన కొత్తలో అక్కడున్న కొందరు అపరిపక్వచిత్తులు ఆమె ప్రస్తావన వచ్చినపుడు "అమ్మకచెల్ల! ఎంత వైరాగ్యం! అంత సంపదను వదులుకొని వచ్చేసింది!" అని ముక్కు మీద వేలు వేసుకొనేవాళ్ళు. సంపదలుండి వదులుకొనివస్తే 15 యూనిట్ల వైరాగ్యం, సంపదలు లేకుండా వచ్చి చేరితే 1/4 యూనిట్ వైరాగ్యం అని వాళ్ళ భావన కాబోలు! పరమ అజ్ఞానులు!*

# కుమారజీవుడు

కుమారజీవుడు మహాకాశ్యపుని శిష్యుడు. తథాగత శాసనాన్ని తలదాల్చినవారు వేలాదిమంది ఉన్నారు. ఆ వేలాదిమందిలో ఐదు వందల మంది అర్హతులు. ఆ ఐదు వందల అర్హతులలో గౌతమునికి ముఖ్య శిష్యులు ఎనభైమంది. ఆ ఎనభై మందిలో ఎనిమిది మంది ప్రముఖ శిష్యులు. ఆ ఎనిమిది మందిలో మహాకాశ్యపుడొకడు. బుద్ధునికి శిష్యుడు కాకముందు నుంచే మహాకాశ్యపునికి ఒక విధమైన మహత్త్వం ఉండేది. భక్తితో ఏదైనా దేవాగారం ప్రవేశించి దేవతాప్రతిమకు మ్రొక్కితే ఆ క్షణంలోనే ఆ విగ్రహం భళ్ళున పగిలిపోయేది. ఇలా కొన్ని సార్లు జరిగాక దేవాగారాలకు వెళ్ళడం మానుకొన్నాడు. తొలిసారిగా బుద్ధుణ్ణి చూసినపుడు హృదయం భక్తి, గౌరవం, శ్రద్ధతో పరవశించింది. చేతులు జోడించి నమస్కరించాలనుకొన్నాడు. నమస్కరిస్తే ఈయనకు, దేవతా విగ్రహాలకు అయిన మాదిరి రూపనాశనమయిపోతుందేమో అని సంశయించి నమస్కరించలేదు. "కాశ్యపా, సంశయించకు, తథాగతునికి నమస్కరించు" అన్నాడు బుద్ధుడు. కాశ్యపుడు నమస్కరించాడు. బుద్ధునికి ఏమీ కాలేదు. "బుద్ధం శరణం గచ్ఛామి" అని కాశ్యపుడు సాష్టాంగ నమస్కారం చేసి "ఇకనుంచి మీరే నా శాస్త (teacher)" అన్నాడు.

"బహుజన హితం కోసం బహుజన సుఖం కోసం నీవు అన్ని దిక్కులకూ వెళ్ళు. ధర్మాన్ని ప్రజలకు తెలియజేయి" అని బుద్ధుడు కాశ్యపునికి ప్రేరణ ఇచ్చాడు. ఆ ప్రేరణతో కాశ్యపుడు జీవితాన్నంతా పర్యటనలోనే గడిపాడు. ఒకసారి మగధలో పర్యటిస్తుండగా కాశ్యపునికి కుమారజీవుడు శిష్యుడయ్యాడు. బుద్ధ శాసనాన్ని అతనికి సాకల్యంగా చెప్పి "నాయనా నీవు అదృష్టవంతుడివి.

క్షణసంపత్ (favourable conditions for spiritual progress) పుష్కలంగా కలిగియున్నావు. మనుష్యజన్మ విలువ ఇంతాఅంతా కాదు. అందులోనూ యువకుడుగా ఉన్నావు. అవికలేంద్రియుడవుగానూ ఉన్నావు (not handicapped). తథాగత శాసనాన్ని విన్న భాగ్యమూ పొందావు. ఆర్య స్రోతస్సులో ప్రవేశించావు. ఆ స్రోతస్సులో అలా తేలియాడుతూ (just float) ఉంటూ వచ్చావంటే ఆ స్రోతస్సే నిన్ను మోక్షసాగరానికి చేర్చుతుంది. వెళ్ళు నాయనా. నీవెక్కడున్నా అష్టలోకధర్మాలు (లాభం×అలాభం, యశస్సు×అయశస్సు, నింద×ప్రశంస; సుఖము×దుఃఖము - ఇవి అష్టలోకధర్మాలు) నిన్నంటకుండా చూసుకో. బురదగుంటలో ఉన్నా బురద అంటని కమలం లాగా జీవించు. అష్టలోకధర్మాలలో ఒక దానికి కృంగిపోవడం మరో దానికి పొంగిపోవడం చేయకుండా చిత్తంలో ఉపేక్షా (సమతా) సంపదను పెంచుకొంటూ ఉండు" అని హితబోధ చేసి పంపాడు.

కుమారజీవుడు సంచారం చేస్తూ బైరియా అనే పల్లెకు వచ్చాడు. ధూతాంగములలో (చూడుడు దేవదత్తుని కథక్రింది పాదపీఠిక) కొన్నిటిని పాటిస్తూ అక్కడే ఉండదలచాడు. ఆ ఊరిలోని చివరి ఇంటి వద్ద ఆగి ఒక చిన్న గులకరాయి చేతికి తీసుకొని బలం కొద్దీ ఊరి వెలుపలి దిక్కుగా విసిరివేశాడు. ఆ గులకరాయి పడిన చోటుకి వెళ్ళి గుర్తు గీసుకొన్నాడు. (ధూతాంగములలో ఒకటి ఆరణ్యకః అంటే వనవాసి అని అర్థం. వనవాసం లేదా అరణ్యావాసం అంటే పులులు సింహాలు ఎలుగుబంట్లు తిరుగుతున్న దట్టమైన అడవిలో ఉండడం అని అర్థం కాదు. అట్టి చోటికి వెళ్తేనే ధూతాంగం పాటించినట్లని భావించి ఎవడైనా వెళ్తే చేతోవిముక్తి సంగతి దేవుడెరుగు, అతి త్వరలో దేహవిముక్తిని మాత్రం ఏ పులో సింహమో ఇస్తుంది. బౌద్ధంలో ఆరణ్యకః అంటే జనావాసానికి దూరంగా ఉండడం అని. గ్రామం పొలిమేరకు అవతల నివాసం ఉండడం అని అర్థం. గ్రామం పొలిమేరను బౌద్ధ భిక్షువులు నిర్ణయించే విధానాల్లో ఒకానొక విధానం పాటించి కుమారజీవుడు రాయిని విసిరివేసి గుర్తు పెట్టుకొన్నాడు).

గృహస్థులకు పీడాకరం కాని (non-taxing) భిక్షువు లభించడం ఆ గ్రామస్థులు చేసుకొన్న అదృష్టం. గ్రామంలోకి వెళ్ళి నలుగురు పెద్దల్ని కలిసి తన సంకల్పాన్ని తెలియజేయగానే వాళ్ళు పరమ సంతోషంతో అతను చూపిన స్థలంలో ఒక చిన్న కుటీరం అరగంట లోపలే నిర్మించి ఇచ్చారు.

* * *

ఆ ఊరిలో ఒక పెద్దింటి యువతి రత్నదీపకు తలిదండ్రులు సంబంధాలు వెతుకుతున్నారు. చాలా సంబంధాలు వచ్చాయి కానీ వీళ్ళకు ఏదీ కుదరడం లేదు. తల్లికి నచ్చిన సంబంధం తండ్రికి నచ్చలేదు. ఆయనకు నచ్చింది ఈమెకు నచ్చలేదు. ఇరువురికీ నచ్చింది రత్నదీపకు నచ్చలేదు. రత్నదీపకు నచ్చింది తలిదండ్రులకు నచ్చలేదు. అందరికీ నచ్చింది, అవతలివాళ్ళకు నచ్చలేదు. సంబంధాలు వెతుకుతూనే ఉన్నారు. ఏండ్లు గడుస్తున్నాయి. వచ్చినవాళ్ళకు అమ్మాయి వయస్సు మూడేండ్లు తగ్గించే చెబుతున్నారు.

రత్నదీప గర్భవతి అయ్యింది. తల్లి కాళికావతారం దాల్చింది, తండ్రి ప్రచండ భైరవుడయ్యాడు. "ఎవడే వాడు?" అని ఒకరి వెంబడి ఒకరు రౌద్రంగా గద్దిస్తూ అడిగారు. వాడెవడో తలచుకొంటేనే రత్నదీపకు చచ్చేంత సిగ్గు అవమానంగా ఉంది. నోరు తెరిచి ఎలా చెప్పడం? వాడెవడో చెప్పకపోతే వీళ్ళు చావగొట్టి చెవులు మూసేదాకా వదలరు. చెబితే గుండె పగిలి చస్తారు లేదా ఉరేసుకొంటారు. ఆమె మనస్సు చెప్పలేనంత గజిబిజిగా చీకటి కమ్మినట్లుగా ఉంది. ఇప్పటికే పది మొట్టికాయలు నెత్తిమీద, పది దెబ్బలు వీపుమీద పడ్డాయి. ఇక తట్టుకోలేక తటాలున ఒక అబద్ధం చెప్పేసింది. "కుమారజీవుడు" అనేసింది.

* * *

రత్నదీప తండ్రి నందిదేవుడు ఆ వీధి పెద్దలను పదిమందిని రచ్చబండకు రమ్మని పిలిచాడు. ఆ పెద్దలలో ఒకాయన తలలో వెయ్యి సామెతలు ఎప్పుడూ

కదులుతూ ఉంటాయి. మాట మాటకు సామెత ఒకటి తగిలించకపోతే ఆయనకు ఊపిరాడదు. నందిదేవుడు కుమారజీవుని అకృత్యాన్ని ఆ పెద్దలకు చెప్పాడు. వారెవ్వరూ నమ్మలేదు. సామెతలాయన కూడా నమ్మలేదు. కానీ సామెత ఒకటి వెంటనే చెప్పాలన్న ఉబలాటంతో "బ్రహ్మకైన పుట్టు రిమ్మతెగులు" అన్నాడు. "మనం ఇప్పుడేం చేయాలో నీవే చెప్పాలి. అతణ్ణి ఇక్కడ్నుంచి వెళ్ళగొట్టామా?" అన్నాడు నందిదేవుణ్ణి చూస్తూ మరో పెద్దాయన. "వెళ్ళగొట్టే అతనికది ఒక శిక్షా? ఇంకో ఊరికి వెళ్తాడు. ఇంతకన్నా పెద్ద గుడారం ఒకటి వేసుకొని హాయిగా బ్రతుకుతాడు" అన్నాడు నందిదేవుడు. "మరేం చేయమంటావు?" అన్నాడు పెద్దాయన. "ఎలా శిక్షించాలో నాకొక ఆలోచన ఉన్నది. అతను ఈ ఊరిలోనే ఉండాలి. మిమ్మల్ని కోరేది ఒక్కటే. ఇక మీదట అతను మన పెద్దిండ్ల వీధిలో అడుగుపెట్టకూడదు. ఇంకెక్కడైనా అడుక్కుతిననీ. అతణ్ణేమీ మనం కొట్టబనిలేదు తిట్టబనిలేదు. 'మా వీధికి రావద్దు' అని ఒక మాట చెప్పి వస్తాం రండి" అన్నాడు నందిదేవుడు. "ఎందుకంత తొందర? లేడికి లేచిందే పరుగు" అంటూ సామెతలాయన కూడా అందరితోబాటు లేచాడు.

పెద్దలందరూ కుమారజీవుని కుటీరానికి వెళ్ళి అతను చేసిన ఘోరమైన తప్పిదాన్ని చెప్పారు. అంతా విని "అలానా" అన్నాడు కుమారజీవుడు. "ఊరు వదలిపోరాదు. పెద్దిండ్ల వీధిలో అడుగుపెట్టరాదు" అన్నారు పెద్దలు. "అలాగే" అన్నాడు కుమారజీవుడు.

పెద్దలు తిరిగి వస్తుండగా ఒక పెద్దాయన "మనం చెప్పిందానికల్లా అతను తల ఊచిన తీరు చూస్తే తప్పు చేసినవాడిలాగే కనిపిస్తున్నాడు" అన్నాడు. వెంటనే సామెతలాయన "తలలు బోడులైన తలపులు బోడులా" అన్నాడు.

ఆరు నెలలు గడిచింది. కుమారజీవుడు ఆ ఊరు వదలిపెట్టలేదు. జీవితం కష్టంగా ఉన్నా ఎప్పటిలా నిర్వికారంగా ఉంటున్నాడు. భిక్షను బడుగు

వర్గాల నివాసాలకు వెళ్ళి తెచ్చుకొంటున్నాడు. ఒకనాటి సాయంత్రం ఆనాపానసతి (mindfulness of inbreathing and outbreathing) చేయడం కోసం కుటీరంలో ఆసనం పరచుకొంటుండగా "పాపభిక్షూ, నీ కర్మఫలాన్ని తెచ్చాను. వచ్చి తీసుకెళ్ళు" అన్న మాటలు వినిపించాయి. కుమారజీవుడు బైటకు వచ్చాడు. నందిదేవుడు కుటీరం ముందు నిలుచుని ఉన్నాడు. "ఇదిగో నీ ముద్దు బిడ్డడు" అంటూ కుమారజీవుని చేతికి పురుటి శిశువును అందించాడు. "అలానా" అంటూ కుమారజీవుడు ఆ శిశువును తీసుకొన్నాడు.

రత్నదీప ఆరు నెలలుగా గడప దాటి వీధిలోకి వెళ్ళింది లేదు. ఇప్పుడైతేనో గడప దాటి కుమారజీవుని కుటీరానికి వేగంగా పరుగెత్తాలని ఆమె హృదయం తపిస్తూ ఉన్నది. కానీ గడప దాటలేదు. మేడమీదికి పోయింది. చాలా దూరంలో ఉన్న ఆ కుటీరాన్ని చూడాలని తపించింది. గడ్డివామి అడ్డం వస్తున్నది. ఇంకొక కోణంలో చూడాలని ప్రయత్నించింది. చెట్లు అడ్డం వస్తున్నవి. మరొక కోణంలో రెండంతస్థుల ఇల్లొకటి అడ్డం వస్తున్నది. ఏ కోణం నుంచీ ఆమెకు కుటీరం కనబడదు. నిరాశ చేసుకొని సాలె వీధి మలుపు వైపే తదేకంగా చూపులు నిలిపింది. ఒక గంట తరువాత బిడ్డనెత్తుకొని నడుస్తున్న కుమారజీవుడు కనిపించాడు. ఎక్కడ ఎవరిని అడిగి సంపాయించాడో తెలియదు పాలచెంబును ఒక చేతితో పట్టుకొని మరొక చేతితో బిడ్డను భుజానికి ఆనించుకొని పోతుండడం కనిపించింది. ఆ ఒక క్షణ దృశ్యం కోసం రోజూ రత్నదీప మేడ మీదికి వెళ్ళి గంటల తరబడి కూర్చొనేది.

ఈ వరకే కృశించియున్న కుమారజీవుని దేహం శిశు సంరక్షణ బాధ్యత వల్ల మరింత కృశించింది. అసలు నిదురిస్తాడా అనేది అనుమానం. కంటికి రెప్పలా బిడ్డను చూసుకొంటూ వస్తున్నాడు. కుమారజీవుడు కృశించిపోతున్నా బిడ్డ మాత్రం పుష్టిగా బొద్దుగా ఆరోగ్యంగా పెరుగుతున్నాడు. ఇలా ఆరు నెలల కాలం గడిచింది. కుమారజీవుడు మరింత కృశించిపోయాడు. నడుస్తున్నప్పుడు ఆయాసం

వల్ల అక్కడక్కడ కాసేపు కూర్చొని నడుస్తున్నాడు. సాలె వీధి మలుపులోనూ ఒకసారి కుమారజీవుడు ఆయాసంతో అలా కాసేపు చెట్టు క్రింద కూర్చొని విశ్రమించి మళ్ళీ వెళ్ళడం రత్నదీప చూసింది.

రత్నదీప గడప దాటింది. దాటనీయకుండా ఆమెను ఇక బ్రహ్మదేవుడు కూడా ఆపలేడు. రచ్చబండ ఎక్కింది. అక్కడ వేపచెట్టు కొమ్మకు వేలాడదీసియున్న గంటను గణగణగణమని అదే పనిగా మ్రోగించింది. వీధి జనం అంతా గాబరాగా అక్కడికి పరుగెత్తుకొని వచ్చారు. రత్నదీప పూనకం వచ్చినదానిలా ఇంకా గంటను మ్రోగిస్తూనే ఉన్నది. ఇద్దరు స్త్రీలు ఆమెను పట్టుకొని గంటను మ్రోగిస్తున్న చేయిని బలవంతంగా క్రిందకు లాగి "ఏమైంది?" అని ప్రశ్నించారు.

* * *

ఊరి పెద్దలందరూ కుమారజీవుని కుటీరానికి పశ్చాత్తాప తప్తులవుతూ వెళ్లారు. కుటీరంలో కుమారజీవుడు బిడ్డను గుడ్డ ఉయ్యాలలో ఊగిస్తున్నాడు. నందిదేవుడు నేరుగా కుటీరంలోకి వెళ్ళి కుమారజీవుని పాదాలకు సాగిలపడి లేచి "మహానుభావా, ఆకాశాన్నంటే మహోన్నత వ్యక్తిత్వం మీది. నేను భూమి మీద ప్రాకే కీటకాన్ని. అజ్ఞానం వల్ల అహంకారం వల్ల తొందరపాటు వల్ల మిమ్మల్ని దోషిగా భావించి కష్టపెట్టాను. వాస్తవం తెలిసింది. మీరు అనుమతి ఇస్తే బిడ్డను తీసుకపోవడానికి వచ్చాను" అన్నాడు. ఇదంతా విని కుమారజీవుడు ఎప్పటిలాగానే నిర్వికారంగా "అలానా" అని ఉయ్యాల్లో నుంచి బిడ్డను తీసి నందిదేవుని చేతిలో పెట్టాడు. ఆ కుటీరం చిన్నది గనుక ఊరిపెద్దలు ఒక్కొక్కరే లోనికి పోయి క్షమాపణలు చెబుతూ నమస్కరించారు. చివరగా లోనికి పోయిన సామెతలాయన భక్తితో పరవశించిపోతూ "నడిచే దైవమా, ఈ దాసుని తప్పు దండముతో సరి" అని సాష్టాంగ నమస్కారం చేశాడు.

* * *

ఒకనాటి భిక్షు సమావేశంలో కుమారజీవుని ప్రస్తావన వచ్చినపుడు బుద్ధుడు "అతడు మన భిక్షు సంఘానికి లభించిన అమూల్యరత్నం" అని ప్రశంసించి కుమారజీవుణ్ణి ఉద్దేశిస్తూ క్రింది శ్లోకం చెప్పాడు.

**యథా౽ పి హ్రదో గంభీరో విప్రసన్నో ౽ నావిలః**
**ఏవం ధర్మాన్ శ్రుత్వా విప్రసీదంతి పండితాః** 6-7

గంభీరమైన (deep) సరస్సులోని జలం ఎలా స్వచ్ఛంగా, ఆటుపోటులు లేకుండా నిశ్చలంగా ఉంటుందో అలాగే గంభీరమైన ధర్మాలను (teachings) విని అర్థం చేసుకొన్న పండితుల మనస్సు కూడా సుప్రసన్నంగానూ నిశ్చలంగానూ ఉంటుంది.

---

*ఈ కథలో నాకు తోచిన విశేషం వ్రాస్తాను. ఇందులో దుష్టపాత్రలు ఎవరూ లేరు. అయినా దుఃఖం తప్పలేదు very existence is misery. మనదేశంలో బుద్ధుణ్ణి వదిలేస్తే పాశ్చాత్యదేశంలో ఒక్క schopenhauer ఈ సత్యాన్ని దళసరి చర్మం వాళ్ళకున్నూ అర్థమయ్యే రీతిలో సోదాహరణంగా వివరించాడు.*

Note:- *ఈ కథ అభూతకల్పన కాదు. జరిగినదే. self protective instinct ఎంతో బలమైనది. దేహ విషయంలో ఆ instinctని జయించినవారు కొందరుండవచ్చు. కానీ అపనింద విషయంలో అట్టివారిలోనూ self protective instinct ముందుకు వచ్చి తీరుతుంది. కుమారజీవుడు సాధించిన spiritual heights మన ఊహకు కూడా అందదు. "శూన్యతా కరుణాగర్భం" అన్న నాగార్జున వాక్యానికి సాకార రూపం కుమారజీవుడు.*



# జీవకుడు

బాధానివారణ కోసం వచ్చిన విద్యల్లో రెండు విద్యలు గొప్పవి. 1. వైద్యవిద్య 2. అధ్యాత్మవిద్య. రెండింటిలోనూ నకిలీ వైద్యులుండనే ఉన్నారు. నకిలీవైద్యుల (quacks) మీద ఛలోక్తులు ప్రాచీనకాలం నుండి ఉన్నాయి. ఒక ఛలోక్తి (joke):

*వైద్యరాజ నమస్తుభ్యం యమరాజ సహోదర:*
*యమస్తు హరతే ప్రాణాన్వైద్య: ప్రాణాన్ ధనాని చ*

యమరాజ సహోదరా, నీకు నమస్కారం. మీ అన్న కేవలం ప్రాణాన్ని మాత్రం హరిస్తాడు, నీవో ప్రాణాన్ని ధనాన్ని కూడా హరిస్తావు! అన్నకు మించిన తమ్ముడంటే నీవేనయ్యా!

పాశ్చాత్యం నుండీ ఒక ఛలోక్తి: శ్మశానవాటికలోని ఒక డాక్టరు గారి సమాధి శిలాఫలకం (epitaph) మీద చెక్కిన సంస్మరణ వాక్యం: Here like a hero he lies and those he has slain lie around him.

ఇక్కడ డాక్టరు అభిమన్యుడు లాగా కనబడుతున్నాడు. వైద్య వీర విహారం చేసి అనేకమందిని హతమార్చి చివరకు తానూ నేలగూలిన దృశ్యం!

ఆధునికమైన ఒక ఛలోక్తి: "శస్త్రచికిత్స (operation) విజయ వంతమయింది. రోగి మరణించాడు" (operation is successful, but patient died).

* * *

రాజగృహంలో జీవకుడు పేరు మోసిన వైద్యుడు. రాజులు, మంత్రులు, సేనాపతులు, శ్రేష్ఠిప్రముఖులు-వీరందరికీ అతనే కుటుంబ వైద్యుడు (family doctor). బుద్ధునికీ, భిక్షు సంఘానికీ అతనే వైద్యుడు. జీవకునికి సమానంగా విద్య గడించిన చంద్రప్రదీపుడు కూడా ఆ ఊరిలో వైద్యుడుగా ఉన్నాడు. అతడు రంగంలోకి దిగేటప్పటికే జీవకుడు సుప్రతిష్ఠితుడై (well established) ఉన్నాడు. చంద్రప్రదీపుని వద్దకు పెద్దగా రోగులు రావడం లేదు. జీవకుని గృహం వద్ద రద్దీ తట్టుకోలేని కొందరు మాత్రం వస్తున్నారు. చంద్రప్రదీపుడు ఆలోచించాడు: "జీవకుడు నేనూ చదువుకొన్నది ఒకే విద్యనే. అతనికెంత తెలుసో నాకూ అంత తెలుసు. పేరు ప్రఖ్యాతులొక్కటి అతనికి కూడిక అంశంగా (plus point) ఉన్నది. ఆ విషయంలో అతనితో నేను పోటీ పడలేను. వేరే విధానంతో అతణ్ణి ఎదుర్కోవాలి".

* * *

ఇప్పుడు జీవకుని ఇంటి ముందు రద్దీ బాగా తగ్గిపోయింది. చంద్రప్రదీపుని ఇంటి ముందు త్రొక్కిసలాటే అనవచ్చు. బాధా నివారణ శక్తి లేదా రోగనివారణ శక్తి ఔషధంలో ఉన్నది. ఆయా ఔషధాన్ని చంద్రప్రదీపుడు సరిగ్గా నిర్ధారించి ఇస్తాడు. ఆ ఔషధ గుణమే రోగాన్ని నయం చేస్తుంది. చంద్రప్రదీపునికి అది బాగా తెలుసు. కానీ ఈ మధ్య రోగులను ఆకట్టుకొనేందుకు ఒక కిటుకు (gimmick) చేస్తున్నాడు. గదిలో అశ్వినీ దేవతల చిత్రపటం ఉంచాడు. ఔషధం ఇచ్చేముందు ఔషధం మీద రెండు చేతులను వివిధ రీతుల్లో త్రిప్పి ఆ పిమ్మట ఔషధాన్ని అశ్వినీదేవతల పటానికి చూపుతూ "నీలవజ్రదండా తురుతురు హులు హులు హో హో గులుగులు గులాషయ గులాషయ, మహావిషమ వజ్రా కురు కురు కిణికిణి, సమయవిజృంభితా స్ఫోటయ స్ఫోటయ స్వాహా" అని మంత్రాలు చెప్పి ఔషధాన్ని రోగులకు ఇవ్వడం మొదలుపెట్టాడు. ఔషధాలకు మంత్రశక్తిని జతచేసి

ఇస్తున్నాడని ప్రజల్లో ప్రచారం కొన్ని రోజుల్లోనే వేగం అందుకొన్నది. చంద్రప్రదీపునికి మహర్దశ మొదలయ్యింది. రోగులు దూర ప్రాంతాల నుండి కూడా ఎక్కువ సంఖ్యలో వస్తున్నారు. వ్యక్తిగత విషయాల్లో సలహాలు కూడా అడుగుతున్నారు. "శాకాహారమే మంచిదని జీవకుడు నాకు చెప్పాడు. మీరేమంటారు?" అని ఒకడడిగితే చంద్రప్రదీపుడు ఇలా సమాధానం ఇచ్చాడు: "అతడు వైద్యశాస్త్రం తెలిసి చెప్పిన మాట కాదు అది. బుద్ధుని ఉపదేశాలు ఎక్కడో విని పలికిన చిలక పలుకులు. ఏదైనా సలహా ఇస్తే స్వయంగా తెలుసుకొని ఇవ్వాలి. నా పరిశోధనలో తేలిన అంశం ఏమిటంటే మానవుని జీర్ణకోశం పంది యొక్క జీర్ణకోశంతో చాలా దగ్గరి పోలిక కలిగియున్నది. పంది, మాంసం తినదు. మాంసం తినే జంతువుల జీర్ణకోశాల నిర్మాణమే వేరు. అట్టి నిర్మాణం మానవ జీర్ణకోశంలో లేదు. కనుక మానవుడుగా ఉన్నవాడు మాంసాహారం తింటూ ఉంటే తన జీర్ణకోశానికి కృతకమైన పనిని అప్పగిస్తూ దాని పటుత్వానికి సహజత్వానికి దెబ్బగొట్టి చివరకు తాను నష్టపోతాడు. నీవు మానవుడవు కనుక నీకు శాకాహారమే మంచిది."

"ఇంత రామాయణం ఎందుకు? ఆ ముక్క మొదట్లోనే చెప్పి యుండవచ్చుగా" - ఆ వ్యక్తి స్వగతంలో అనుకొని సెలవు తీసుకొన్నాడు.

జీవకుడు ఈ మధ్య తరచుగా వేణువనం వెళ్తున్నాడు. బుద్ధుని బొటనవేలి గాయానికి (చూడుడు దేవదత్తుని వృత్తాంతము) చికిత్స చేస్తున్నాడు. రోజూ వెళ్ళి కట్టు విప్పి మళ్ళీ కొత్త కట్టు కట్టున్నాడు. ఒకనాడు కట్టు కట్టూ "రాత్రి మీరు సుఖంగా విశ్రమించగలిగారా? లేక నొప్పి వల్ల ఆయాసం పాలయ్యారా?" అని కుశల ప్రశ్నలు వేశాడు. సమాధానంగా బుద్ధుడు క్రింది శ్లోకం చెప్పాడు.

*గతాధ్వనో విశోకస్య విప్రముక్తస్య సర్వథా*
*సర్వగ్రంథప్రహీణస్య పరిదాహో న విద్యతే* 7-1

చేరవలసిన గమ్యం చేరినవాడు, మానసికవ్యధలు లేనివాడు, పంచస్కంధ బంధం నుండి ముక్తుడైనవాడు, అన్ని గ్రంథులను (ముడులు = ties) వదలగొట్టినవాడు - అయిన అర్హతునకు పరిదాహం (distress) ఉండదు.

(గ్రంథులు: అభిద్య(coveteousness), వ్యాపాద (ill-will),శీలవ్రతపరామర్శ (clinging to mere rites and rituals as if they are the sum and substance of whole spirituality), ఇదం సత్య అభినివేశం (adherence to one's preconceptions as Truth).

అర్హతుడు కానీండి ఎవరైనా కానీండి వేదన (feelings = painful feelings, pleasurable feelings, neutral feelings) ఉంటుంది. అర్హతులైనవారు మనస్సును అక్కడే నిలుపగలుగుతారు. తరువాతి మెట్టుకు పోనీయరు. మామూలు ప్రజలకు వేదన కలిగిన వెంటనే మనస్సు తృష్ణావశం అయిపోతుంది (craving to get or to get rid of).

# పూర్ణుడు

శూర్పార నిగమంలో (సంత ఊరు) గోకర్ణశ్రేష్ఠి కుమారుడు పూర్ణుడు. గోకర్ణశ్రేష్ఠి ఒకనాడు కుమారుణ్ణి ఎదురుగా కూర్చొనబెట్టుకొని ఇలా అన్నాడు. "కృష్ణా రామా అనుకొనే వయస్సొచ్చేసింది నాకు. తాళం చెవులు నీ చేతికివ్వాలనుకొంటున్నాను. ఇక నీవు ఆ సుదత్తుని కొడుకులా అల్లరి చిల్లరిగా వీధులు తిరగడానికి వీలు లేదు. బాధ్యత తెలుసుకో. పద్దెనిమిది తరాలుగా వస్తున్న మన కుటుంబ ఆచారాన్ని నీవూ పాటించాలి. ఆ ఆచారం ప్రకారం నిన్ను ఆరు నెలలు ఇంటి నుండి బహిష్కరిస్తున్నాను. నేటి నుండే అది అమలులోకి వస్తుంది. ఇదిగో పదిహేను వరహాలు. నీవిక ఏమి తంటాలు పడతావో నాకు తెలియదు. ఈ ఆరు నెలలు నిన్ను నీవు పోషించుకొంటూ ఆ తరువాత వెయ్యిన్నీ ఐదు వందల వరహాలతో ఇంట్లో అడుగుపెట్టాలి. అప్పుడే నీ చేతికి తాళాలు ఇవ్వబడుతుంది. ఇది మన కుటుంబ ఆచారం. వంచన వద్దు. ఎవర్నీ నీవు అప్పు అడిగి తీసుకరాకూడదు. నీ కష్టార్జితంతో రావాలి. వెళ్ళు" అన్నాడు. "ఈ కుటుంబాచారం ఇన్నాళ్ళు చెప్పకుండా ఎందుకు దాచిపెట్టాడు వీడు?" (స్వగతంలో తండ్రిని వీడు వాడు అనే అంటాడు పూర్ణుడు) అనుకొంటూ బయలుదేరాడు.

పూర్ణుడికి ఏదైనా చిన్న సమస్య వచ్చినా ఊరి పొలిమేరలోని గ్రామ దేవత ఆలయం వరకు నడవడం అలవాటు. అలా నడుస్తూ ఆ సమస్య మీద ఆలోచన చేయడం అతని పద్ధతి. ఆ దినం మంచి ఎండ, అయినా నడుస్తూ పొలిమేరకు వచ్చాడు. అడవినుండి వంట కట్టెల మోపులతో ఐదుగురు బోయలు ఎదురుగా వస్తున్నారు. వాళ్ళను చూశాడు. అందరూ "హుహుహు హుహుహు" అంటూ

వస్తున్నారు. పూర్ణుడికి బలే ఆశ్చర్యం వేసింది. ఎండకు ఊసురోమని తాను నడుస్తుంటే వీళ్ళకేమో అది హిమాలయ చలిగా ఉందే అని ఆశ్చర్యపోయి పరిశీలనగా చూశాడు. విషయం అర్థమయ్యింది. "బోయలూ, ఏం కట్టెలవి?" అని అడిగాడు. "ఏమో మాకు తెలవదు. కొత్త చెట్టు కనబడితే కొట్టుకొచ్చాము" అన్నారు బోయలు. "ఏం ధరకిస్తారు మోపు?" అడిగాడు పూర్ణుడు. వరహాకిస్తామన్నారు బోయలు. "మోపు ఒకటికి రెండు వరహాలిస్తాను. నా వెనకే రండి" అని పూర్ణుడు వెనుదిరిగాడు. వాళ్ళు ఇతణ్ణి పిచ్చివాణ్ణి చూసినట్లు చూశారు. వాళ్ళభావం గ్రహించి పూర్ణుడు "నిజంగానే కొంటాను. ఇవిగో రూకలు" అని నాణాలు చూపించాడు.

చందనశ్రేష్ఠి ఇంటి తిన్నె మీదికి మోపులు దింపించి వాళ్ళకు చెరి రెండు వరహాలు ఇచ్చి పంపివేసి "చందనశ్రేష్ఠీ" అని కేకవేశాడు. లోపలనుంచి చందనశ్రేష్ఠి వచ్చి పూర్ణుణ్ణి చూసి "ఏమిటి పూర్ణా, సుదత్తుని కొడుకులా ఠీవిగా వెలిగిపోతున్నావు" అన్నాడు. "నేనూ వ్యాపారంలోకి దిగాను. చూడు నా సరకు. ఎంతకు కొంటావు?" అని మోపులను చూపాడు. చందనశ్రేష్ఠి ఆశ్చర్యపోయాడు. ఆ చందనం కట్టెలు అపురూపమైనవి. చాలా అరుదైనవి. వత్సరాజు ఇవే కావాలంటాడు. ఆమ్రపాలి కూడా ఇవి తప్ప వేరే వద్దంటుంది. చందనశ్రేష్ఠి వెయ్యి వరహాలన్నాడు. పూర్ణుడు రెండు వేలు చెప్పాడు. మధ్యేమార్గంగా వెయ్యిన్నీ ఐదువందలకు బేరం కుదిరింది.

"వాణ్ణి (అంటే గోకర్ణశ్రేష్ఠిని అన్నమాట) ఆశ్యర్యంతో నోరు తెరచుకొనేలా చేస్తాను" అనుకొని పూర్ణుడు ఇంటికి బయలుదేరాడు. దారిలో రచ్చబండ దగ్గర కొందరు గుమికూడియుంటే అక్కడికి వెళ్ళి "ఏమిటా వింత" అని చూశాడు. శ్రావస్తినుండి వ్యాపారం పని మీద ఆ ఊరు వచ్చిన జయకుంజరశ్రేష్ఠి ప్రశ్నోత్తర కార్యక్రమం (quiz programme) నిర్వహిస్తున్నాడు. ఎక్కడికి వెళ్ళినా అది అతనికొక వినోదం. "ఈ ప్రశ్నకు సమాధానం ఇవ్వండి చూస్తాం. సరిగా చెప్పినవాడికి వరహా బహుమానం. 'బుద్ధుడు బోధివృక్షం క్రింద ధ్యానంలో ఉండగా ఆయన

శిరస్సు మీద పడగతో గొడుగు పట్టిన నాగుని పేరు చెప్పగలరా?' ఎవరూ చెప్పలేకపోయారు. 'వరహా నాకే మిగిలింది. ఆ నాగుని పేరు ముచిలిందుడు. మరొక ప్రశ్న. బుద్ధునికి మొదటిసారిగా భిక్ష సమర్పించినదెవరు? సుజాత అని ఒకడు తొందరగా అరచాడు - వరహాకొట్టేయాలని తప్పు. తారుమారుగా చెప్పావు. సిద్ధార్థునికి చివరి భిక్ష ఇచ్చినావిడ సుజాత. అయినా పోనీలే ఇదిగో వరహా. బుద్ధునికి మొదటి భిక్ష ఇచ్చిన అదృష్టవంతులు బాహ్యదేశీయ వ్యాపారులు త్రపుష భల్లికులు. సరే మరో ప్రశ్న. ఋషిపతనంలో (మృగదావం = సారనాథ్) పంచ భిక్షువులకు బుద్ధుడు జ్ఞానబోధ చేస్తుంటే అక్కడ పొదలో దాక్కొనియున్నవాడొకడు ఆ బోధ విని జ్ఞాని అయిపోయాడు. వాని పేరేమి? యశుడు అని అందరూ ఒక్కసారిగా అరిచారు. "ఇందరికి ఒక వరహా ఎట్లివ్వను? కనుక ఇది నాకే."

ఈ ప్రశ్నోత్తర కార్యక్రమం పూర్ణుణ్ణి బలే ఆకట్టుకొనింది. కార్యక్రమం ముగిస్తూ కుంజరశ్రేష్ఠి లేవబోతుండగా పూర్ణుడు "నాదొక ప్రశ్న. ఇప్పుడు బుద్ధుడెక్కడున్నాడు? సరిగా చెప్పగలవా?" అని ప్రశ్నించాడు. "శ్రావస్తిలోని పూర్వారామంలో" అన్నాడు జయకుంజరుడు. "ఇదిగో ఐదు వరహాలు తీసుకో" అని అతని ముందుకు నాణాలు విసిరివేసి పూర్ణుడు ఇంటికి నడిచాడు.

పూర్ణుడు ఇంటి వాకిలికి ఇవతలే నిలబడి "గోకర్ణశ్రేష్ఠి", అని గట్టిగా పిలిచాడు. (పూర్ణుడు సరిగానే పిలిచాడు. ఆరు నెలలపాటు నాన్న అమ్మ అక్క వగైరా సంబంధ పదాలు వాడరాదు. బహిష్కరణ కాలం వరకు అవి నిషిద్ధములు). "ఇదిగో నీవడిగిన వెయ్యిన్నీ ఐదువందలు. సందేహించకు. కష్టపడి సంపాయించిందే! ఒక వంద ఇటు పడయ్. శ్రావస్తికి వెళ్ళి ఆరు నెలల తరువాత వస్తా."

* * *

పూర్ణుడు ఆరు నెలల తరువాత ఇంటికి రాలేదు. పూర్వారామంలో ప్రవ్రజ్య దీక్ష తీసుకొని శ్రామణేరుడయ్యాడు (novice). ఆ తరువాత ఎనిమిదేండ్లకు ఉపసంపద దీక్ష తీసుకొని భిక్షువయ్యాడు. మరో పదేండ్లకి స్థవిరుడయ్యాడు

(senior monk). ఒకనాడు బుద్ధుణ్ణి సమీపించి "భగవాన్, సంసారపంకంలో (mire) కూరుకుపోయిన జనులను బైట పడవేసే అభయహస్తం లాంటిది మీ దివ్య ఉపదేశాలు. ప్రపంచ ప్రజలందరికీ తెలియవలసిన అమృతవాక్కులు'' అన్నాడు. ఆ తరువాత జరిగిన సంభాషణ:

పూర్ణుడు: భగవాన్, శ్రోణాపరాంతం వెళ్ళడానికి నాకు అనుమతి ఇవ్వండి. అక్కడి ప్రజలకు ధర్మాన్ని వినిపించాలి.

బుద్ధుడు : అక్కడి ప్రజలు నిన్ను చూసి పాదపూజలు, సన్మానాలు, సత్కారాలు, రాజోచిత ఆతిథ్యాలు ఇచ్చి నెత్తినబెట్టుకోరు. అసలు నిన్ను పట్టించుకోరు.

పూర్ణుడు : లాభ సత్కార పూజల కోసం వెళ్ళాలని లేదు. తరతరాలుగా ఉపేక్షింపబడిన ఆ వర్గాలకు కూడా ధర్మసందేశం చేరాలి.

బుద్ధుడు : నీవు అక్కడికి వెళ్తావు. వాళ్ళు నిన్ను నానా దుర్భాషలాడి దూషిస్తే ఏమి చేస్తావు?

పూర్ణుడు : శ్రోణాపరాంత ప్రజలు ఎంతో మంచివారు, యోగ్యులు అనుకొంటాను. నన్ను కొట్టకుండా వదలిపెట్టిన కరుణాత్ములనుకొంటాను.

బుద్ధుడు : వాళ్ళు నిన్ను రాళ్ళతో కొట్టి కఱ్ఱలతో బాది దేహమంతా గాయాలు చేస్తారనుకో. అప్పుడేమి చేస్తావు?

పూర్ణుడు : శ్రోణాపరాంతీయులు చాలా మంచివారనే భావిస్తాను. నన్ను చంపకుండా దయ చూపారు కదా అని తలుస్తాను.

బుద్ధుడు : నిన్ను చంపడానికి కత్తులు దూసి నీ మీదికి వస్తారనుకో. ఏమి చేస్తావు?

పూర్ణుడు : శ్రోణాపరాంతీయులు ఎంతో మంచివారు, నా మీద చాలా దయ చూపుతున్నారు. దేహం అనే ఈ చెఱసాలనుండి విముక్తిని ప్రసాదిస్తున్నారని భావిస్తాను.

బుద్ధుడు : పూర్ణా, నీకు అనుమతి ఇస్తున్నాను. అక్కడికి వెళ్ళు. ఆదికల్యాణం, మధ్యకల్యాణం, పర్యవసానకల్యాణం (good in the beginning, good in the middle, good in the end) అయినట్టి ధర్మాన్ని ఆ ప్రజలకు తెలియజేయి. నీవు ముక్తుడవైన విధంగా ఆ ప్రజలూ దుఃఖవిముక్తులయ్యే విధంగా శ్రమించు.

ఒకనాటి భిక్షు సమావేశంలో పూర్ణుని ప్రస్తావన చేస్తూ బుద్ధుడు చెప్పిన శ్లోకం

**శాంతం తస్య మనో భవతి శాంతా వాక్ చ కర్మ చ**
**సమ్యగ్ జ్ఞానవిముక్తస్య ఉపశాంతస్య తాదృశః** 7-7

అతని వాక్కు, మనస్సు, కర్మ అన్నీ శాంతపూర్ణములు. సమ్యక్ జ్ఞానం వల్ల విముక్తి పొంది ఉపశాంతుడైనవాడు.

*లోకక్షేముడి కథలో తెలిపిన ఆరు శాస్త్రారులతో బుద్ధుణ్ణి చేర్చితే ఆనాడు గంగాపరీవాహక ప్రాంతంలో ఏడుగురు శాస్తలు సమకాలీనులు. అందరూ శ్రమణ నాయకులే (leaders of monks). ఆ ఏడుగురిలో ఐదుగురి పేర్లు మాత్రమే మనకు తెలుస్తున్నది. జ్ఞాతిపుత్రునిది (మహావీరుడు) జైనంగా మనకు నేడు లభిస్తున్నది. ఏడుగురు శాస్త్రారుల ఉపదేశాల్లో జీవన విధానంలో పెద్దగా తేడాలేదని పరిశోధకుల అభిప్రాయం. తేడా అంతా వ్యక్తిత్వ లక్షణంలోనే (personality లోనే). బుద్ధునిది చాలా బలమైన అయస్కాంతం personality. సారం (stuff) ఉన్న యువకులు చాలా మంది ఆయనకు శిష్యులయ్యారు. సుఖహేతువైన ధర్మాన్ని ప్రపంచానికి తెలుపాలనే ఉత్తేజాన్ని పొందారు. నదులు దాటారు, ఎడారులు దాటారు, అడవులు దాటారు, హిమాలయం ఇవతలనుండి అవతలకు పోయారు. సముద్రం దాటారు. ఆ రోజుల్లో మృత్యుముఖాల్లాంటి ~~ఈ~~ ప్రయాణాల్లో ఎంతమంది ధర్మ సైనికులు మధ్య మధ్యలోనే నేలకొరిగారో మనం ఊహించలేము. పరమ శాంతంగా వ్యాప్తి చెందిన మతం ఒక్క బౌద్ధమే అని పరిశోధకుల అభిప్రాయం.*

# రేవతుడు

*Dialecticians (వాదవేత్తలు = తార్కికులు) like Huan tuan and Kungsun Lung tried to elaborate human thought and twist human minds. They could defeat men's words but not their minds.*

*The Logicians over-elaborated trivial matters in order to make their points irrefutable. Their judgement was merely based on words but contradicted human nature.*

శారిపుత్రుని కడగొట్టు తమ్ముడు రేవతుడు. ఇతడైనా ఇంటిపట్టున ఉండేలా జాగ్రత్త పడాలని తలిదండ్రులు అతనికి వివాహ ప్రయత్నం చేశారు. రేవతుడు సమ్మతించలేదు. ఆ కుటుంబమిత్రుడు ఒక సలహా ఇచ్చాడు: "జయరాశిని పిలిపిస్తాము. పెండ్లి వద్దని చెప్పేవాళ్ళను వాదంలో ఓడించి పెండ్లికి ఒప్పించే వాదకౌశలం ఆయనకున్నది. ఒకవేళ ఆయన రావడానికి వీలుపడకపోతే ముఖ్యశిష్యుడు మల్లవాదిగారిని పంపిస్తాడు. మన అదృష్టం బాగుంటే ఇద్దరూ వచ్చినా రావచ్చు. ఇతని తిక్క కుదురుతుంది."

జయరాశి, ఆయన ముఖ్యశిష్యుడు మల్లవాది బార్హస్పత్య (చార్వాక) సంప్రదాయానికి చెందినవారు. బార్హస్పత్యం లోకంలో మూడు రకాలుగా ఉన్నది. 1. సుశిక్షిత (well trained, cultured) చార్వాకం, 2. అశిక్షిత (untrained, uncultured, vulgar) చార్వాకం, 3. ప్రచ్ఛన్న (hidden) చార్వాకం. ప్రచ్ఛన్న చార్వాకుల సంఖ్య చాలా ఎక్కువ. లోకంలో వివిధ మతాల గొడుగుల క్రింద ఉండే జనాల్లో నూటికి తొంభైతొమ్మిది మంది ప్రచ్ఛన్న చార్వాకులే. జయరాశి మల్లవాదులది సుశిక్షిత చార్వాకం. గురుశిష్యులు ఈ మధ్య ఒకరికొకరు కొంత దూరంగా నివసిస్తున్నారు. అవసరమైనపుడు మాత్రం కలుస్తారు. ఒక అంశం

మీద అభిప్రాయభేదం వచ్చింది. "కుమ్మరివాడు పచ్చి కుండను ఆవంలో పెట్టి కాల్చినపుడు ఆ కుండ అనే ద్రవ్యానికి ఎరుపు అనే గుణం ఎలా వస్తుంది?" అనే అంశం మీద గొడవ పడ్డారు. గురువు పిఠరపాకవాదం చేస్తే శిష్యుడు పీలుపాకవాదం చేశాడు.

* * *

గురుశిష్యులు ప్రక్కప్రక్కన కూర్చున్నారు. రేవతుడు వాళ్ళకు ఎదురుగా కూర్చున్నాడు. గురుశిష్యుల స్వంత భాష పైశాచీభాష. రేవతుడికి ఆ భాష రాదు కనుక అతని స్వంత భాష అర్ధమాగధిలోనే వాదం చేయాలనుకొన్నారు. మల్లవాది వాదానికి ఉపోద్ఘాతంగా ఇలా అన్నాడు. 'పెండ్లి మంచిది' అనేది మా పక్షం. 'మంచిది కాదు' అనేది నీ పక్షం. మన మధ్య జరగబోయే వాదం, హేతు (reason) దృష్టాంతాల (example) మీదనే నడవాలి. ముందు నీ హేతు దృష్టాంతాలు చెప్పు. మేము పరీక్షిస్తాము."

రేవతుడు చాలా వినయంగా చేతులు జోడించి "మీరు ప్రసిద్ధులైన తర్కపుంగవులు (mighty bulls of logic). నేను మీ వద్ద నేర్చుకొనవలసిన చిన్నవాణ్ణి. వాదించడమా? ఎంతమాట! కేవలం నా సమస్యలను కొన్ని మీముందుంచి తగిన పరిష్కారం చూపవలసినదిగా మనవి చేస్తాను" అన్నాడు.

చర్చ మూడు గంటలు జరిగింది. జయరాశి ఏమీ మాట్లాడలేదు. ఉత్సవ విగ్రహంలా గమ్మగ కూర్చున్నాడు. మల్లవాదియే మాట్లాడాడు. మల్లవాది నీళ్లు త్రాగి చెంబును క్రింద ఉంచుతూ జయరాశి వైపు తిరిగి పైశాచీ భాషలో "ఆచార్యా, ఏమిటి మీరు బెల్లం కొట్టిన గుండ్రాయిలా మాటా పలుకూ లేకుండా కూర్చున్నారు. అంతా నేనే మాట్లాడాలా?" అన్నాడు అసహనంగా. "పదాల వర్గీకరణ తెలియనివాడితో నేను మాట్లాడను. ముందు వీణ్ణి పదాల వర్గీకరణ చెప్పమను. ఆపైన నేను మాట్లాడుతాను" అన్నాడు పైశాచీలోనే జయరాశి. "వీడి

మొహం! పదాల వర్గీకరణ చెప్పవయ్యా అని అడిగితే చెప్పాడుగా-నేను నవ్వు ఆపుకోలేక చచ్చాననుకో - కేశములు, రోమములు, నఖములు, దంతములు, ఎముకలు, చర్మము, రక్తము, మాంసము, చీము, వసా, లసికా అని డెబ్బై ఆరు పదాలు. వీడితో మాట్లాడుతుంటే నా మతి పోతున్నది. వెంట్రుకల నుండి-వీణ్ణి క్రిందకు లాగడానికి అరగంట పట్టింది. ఇకనైనా దారికి వస్తాడు కదా అనుకొంటే దంతాల మీదికి ఆపైన నోట్లోని ఎంగిలికి వెళ్ళిపోయాడు. ఏం చేయాలి వీడితో? ద్రవ్య లక్షణం (definition) చెప్పవయ్యా అంటే కుళ్ళిపోయి ఉబ్బిపోయి కంపుగొడుతున్న శవవర్ణన చేసి ద్రవ్య లక్షణం అంటాడేమిటండీ వీడు? ఈ మూర్ఖుణ్ణి నేను బాగు చేయలేను. మీరే చేయండి" అన్నాడు మల్లవాది. "పదాల వర్గీకరణ తెలియని మూర్ఖుడితో నేను మాట్లాడనని ఈ వరకే చెప్పానుగా! ప్రమాణ విద్య కాసంత కూడా తెలియని ఎడ్డెం మనిషి వీడు. ఈ రకం వాళ్ళమీద మనం ప్రయోగించే అస్త్రాలు ఒక్కొక్కటి వీడి మీద ప్రయోగం చేసి వచ్చేసెయ్. ఆగ్నేయాస్త్రంతో మొదలుపెట్టు. కట్టకడపట పాశుపతం వేసేసి వచ్చెయ్. దారికి వస్తాడు" అన్నాడు జయరాశి. "అంతేనంటారా?" అన్నాడు శిష్యుడు. "అంతే" అంటూ లేచి జయరాశి బైటకు నడిచాడు.

మల్లవాది పైశాచినుండి అర్ధమాగధికి మారి "చూడు బాబూ, ఇంతసేపు నీ గురించే మేము మా భాషలో మాట్లాడుకొన్నాము" అని రేవతుని దగ్గరకు బాగా జరిగి కూర్చొని ఇతరులెవ్వరికీ వినబడనంత మెల్లగా చెవిలో ఏవేవో నలభై నిముషాలు చెప్పి "ఇది సంగతి బాబూ, బాగా ఆలోచించుకో. మేము వెళ్ళివస్తాము" అని సెలవు తీసుకొన్నాడు.

వెళ్ళిపోతున్న ఆ గురుశిష్యులను చూస్తూ రేవతుడు "ఓ తార్కికులారా, మీకొక నమస్కారం. మీ విద్య బూజు దులిపే కుచ్చు కొయ్య లేదా దుమ్ము ఊడ్చే చీపురుకట్ట. నేను ఏనాడో బూజు దులిపేసుకున్నాను, దుమ్ము ఊడ్చేసుకున్నాను. నాకు మీ విద్య అవసరం లేదు. బుద్ధుని సుభాషితాలే (well

spoken words of Buddha) నాకు కావాలి. అవి సత్యోపసంహితములు, ధర్మోపసంహితములు, క్లేశహాయకములు (removers), నిర్వాణగుణానుశంసా సందర్శకములు (showing advantages in nirvana). మీ విద్య మీద నాకు గౌరవం ఉన్నదే గాని శ్రద్ధ, ప్రేమ లేదు. అవి మూడూ ఉన్న చోటికి నేను వెళ్తాను" అనుకొన్నాడు స్వగతంలో.

రేవతుడు జేతవనం చేరి ప్రవ్రజ్య తీసుకొని ఎనిమిదేండ్ల తరువాత భిక్షువయ్యాడు. బుద్ధుని వాక్యాలకు అన్నగారు (శారిపుత్రుడు) ఇచ్చే వివరణం కంటే అక్కగారు (శైల) చెప్పేదే అతనికి నచ్చింది. "తమ్ముడూ, బోధివృక్షం క్రింద బుద్ధుడేమి తెలుసుకొన్నాడో దాని గురించి ఆయన ఇంతవరకు ఒక అక్షరం కూడా చెప్పలేదు, చెప్పబోడు. ప్రజల ఆయా భావనారోగాలకు విరుగుడుగా (antidote= ప్రతిపక్షంగా) బుద్ధుడు చెప్పినదాన్నంతా మన అన్న (శారిపుత్రుడు) పరమార్థంగా తీసేసుకొని ధాతువులు, స్కంధాలు, ఆయతనాలు, ఆర్యసత్యాలు, సంసారం, నిర్వాణం అని పట్టుకొని వేలాడుతున్నాడు. 'పరమార్థో హి ఆర్యస్తూష్ణీభావః' (ultimate truth is noble silence) అనే విషయం ఎప్పుడు తెలుసుకుంటాడో! వైశాలిలోని తథాగత గృహస్థ శిష్యుడు విమలకీర్తి ఒక్కడే అతనికి తెలియజెప్పగల సమర్థుడుగా కనబడుచున్నాడు" అనింది. రేవతుడికి వెంటనే విమలకీర్తిని చూడాలనిపించి వైశాలికి వెళ్ళాడు. విమలకీర్తిని చూశాడు. కొంచెం బలమైన గాలి వీస్తే నిలవలేక తూలి క్రింద పడిపోయేవాడిలాగా బక్కపలచని వృద్ధుడతను.

రేవతుడు సామాన్యుడు కాదు. పంచ భయాలను జయించినవాడు. అతనికి ఆజీవికాభయం (fear regarding livelihood) లేదు, అశ్లోకభయం (అకీర్తిభయం) లేదు, దుర్గతిభయం (fear of bad migration) లేదు, పర్షచ్ఛారాద్యభయం (stage fear = సభాయాం సాంకుచిత్యం) లేదు, మరణభయం లేదు. మంచి యోగి కూడాన్నూ. అట్టివాడైనప్పటికీ, విమలకీర్తి పరమార్థాన్ని గురించి చెబుతుంటే హృదయం లోతుల్లోనుంచి ఏదో చెప్పను వీలుకాని భయం

పెల్లుబికి "ఆపండి" అని అరచాడు. "ఈ పరమార్థాన్ని తట్టుకొనే యోగ్యత, శక్తి, అర్హత ఇప్పుడు నాకు లేదు. మళ్ళీ వస్తాను" అని సెలవు తీసుకొన్నాడు. (విమలకీర్తి ఏమి చెబుతున్నాడో అర్థమవుతూ వచ్చినందువల్లే రేవతునికి భయం కలిగింది. మరి లోకంలో ఎందరో పరమార్థాన్ని గురించి ప్రసంగాలు చేస్తున్నారు, వింటున్నారు, వ్రాస్తున్నారు. వాళ్ళేమీ భయపడడం లేదే అంటే వాళ్ళకు (including this writer) అర్థం అయి చస్తేగదా భయపడడానికి. ఒక స్థాయికి వచ్చిన యోగికే ఆ విషయం కొంచెం అర్థం అయి భయం కలిగేది! 'పరమార్థో హి ఆర్యస్తూష్ణీభావః' (ultimate truth is noble silence) అన్న విషయాన్నే విమలకీర్తి రేవతునికి వివరించాడు. ఏదో ఒకటి అనుభవానికి అంది దాన్ని మాటల్లో వ్యక్తం చేయలేక మౌనంగా ఉండడం అనేది referencial silence అవుతుంది. ఇది భయాన్ని కలిగించదు. బోధివృక్షం క్రింద బుద్ధుడి అనుభవం ఇంకా చాలా పై స్థాయిది. అనుత్తర (supreme) స్థాయిది. దాని గురించి బుద్ధుడు ఏమీ మాట్లాడలేదు. అది non-referencial silence.)

రేవతుడు తిరిగి జేతవనం వెళ్ళలేదు. పదిమంది మధ్య ఉంటే ఏదో ఒకటి వాగుతూ ఉండవలసి వస్తుందని ఏకాంతవాసాన్ని కోరుకొన్నాడు. త్రివిధ శౌచాలను (కాయశౌచం, వాక్శౌచం, చిత్తశౌచం), త్రివిధ మౌనాలను (కాయమౌనం, వాక్మౌనం, చిత్తమౌనం) పాటిస్తూ ఒక అప్రశస్త స్థలంలో నివసించాడు. (ప్రశస్త స్థలమైతే జనసంచారం ఉంటుంది కదా!).

ఒకనాడు విశాఖ బుద్ధునితో మాట్లాడుతూ రేవతుని ప్రస్తావన తెచ్చి అతనెందుకు ఆ అప్రశస్తస్థలంలో ఉంటున్నాడు? పూర్వారామంలో (ఆమె కట్టించిన ఆరామం) వచ్చి హాయిగా ఉండవచ్చుగదా" అనింది. సమాధానంగా బుద్ధుడు క్రింది రెండు శ్లోకాలు చెప్పాడు.

***గ్రామే వా యది వాஉ రణ్యే నిమ్నే వా యది వా స్థలే***
***యత్ర ఉ ర్హంతో విహరంతి సా భూమీ రమణీయకా*** 7-9

గ్రామంగానీ అరణ్యంగానీ కోనగానీ కొండగానీ అర్హతులుండే చోటు రమణీయమే అవుతుంది.

*రమణీయాన్యరణ్యాని యత్ర న రమతే జనః*
*వీతరాగా రంస్యంతే న తే కామగవేషిణః* 7-10

రమణీయమైన నిర్జన వనప్రదేశాలు పృథక్ జనులకు రుచించదు. వీతరాగులకు రుచిస్తుంది. వారు కామగవేషులు (seekers of sense pleasures) కారు గనుక.

---

*కథలో శైలను, విమలకీర్తిని ప్రవేశపెట్టడం ద్వారా ఒక వివాదాస్పద విషయంలో రచయిత ఏ పక్షమో భంగ్యంతరంగా తెలుపడం జరిగింది. బుద్ధుని పరినిర్వాణం తరువాత ఐదు వందల ఏండ్లకు మహాయానం, ఆ తరువాత ఐదు వందల ఏండ్లకు తంత్రం (transformative psychology) వచ్చిందని సాధారణ అభిప్రాయం. అన్నీ మొదట్నుంచే ఉన్నాయనేది మరో అభిప్రాయం. ఇక ఈ విషయం ఎక్కువ చెప్పకుండా one of the greatest Buddhologists అయిన Lamotte వాక్యం ఉదాహరించి ఊరకుంటాను.*

*... We can not, therefore, accept, as does a certain critic, that as from the first Buddhist Council "a continual process of divergence from the original doctrine of the Teacher is evident", on the contrary, we are of the opinion that the Buddhist doctrine evolved along the lines which it's discoverer had unconsciously traced for it.*

*Note :- జయరాశి, మల్లవాదుల స్వంత భాష పైశాచీ కనుక వీళ్ళిరువురూ ఆంధ్రదేశీయులని తెలుస్తున్నది. ఆనాడు ఆంధ్రదేశంలో వాడుకలో ఉన్న భాషకు పైశాచి అని పేరు. ఆంధ్రదేశం నుండి అంతదూరం వెళ్ళి మగధరాజ్యంలో స్థిరపడడానికి కారణం ఏమైయుంటుంది? అక్కడ ఒకరా ఇద్దరా? ఏడుగురు శ్రమణ నాయకులు other worldly ఉద్యమాలు లేవదీసియున్నారు. వాళ్ళ ఉద్యమాల్ని ఢీకొని దేశంలో జనసంఖ్య పడిపోకుండా చూడాలి కదా! అందుకని మగధకి మారారు.*



# శారిపుత్రుని మేనమామ

మేనల్లుళ్ళు, మేనకోడలు ఎలా ఉన్నారో చూద్దామనీ బుద్ధుణ్ణి చూసినట్లుంటుందని శారిపుత్రుని మేనమామ జేతవనానికి వచ్చాడు. అతను వచ్చిన సమయంలో శారిపుత్రుడు అక్కడ లేడు. పూర్వారామంలో ఉన్నాడు. జేతవనానికి రమ్మని అతనికి సందేశం పంపారు. శారిపుత్రుడు బయలుదేరి వస్తుంటే దారిలో ఒక ఆజీవక భిక్షువు (మస్కరీపుత్ర గోశాలుని అనుయాయి) ఎదురయ్యాడు. కాసేపు వారిరువురి మధ్య "కామం" అంటే ఏమిటి? అనే విషయం మీద సంవాదం జరిగింది. శారిపుత్రుడు తన అభిప్రాయాన్ని ఒక శ్లోకంలో తెలిపాడు.

***న తే కామా యాని చిత్రాణి లోకే సంకల్పరాగః పురుషస్య కామః***
***తిష్ఠంతి చిత్రాణి తథైవ లోకే అథాత్ర ధీరాః వినియంతి కామమ్***

మనోహరములైన చిత్ర విచిత్ర బాహ్య విషయములు (fine things of the world) కామము కాదు. సంకల్పం (imagination) వల్ల మనస్సులో తలెత్తిన రాగమే కామము. చిత్ర విచిత్ర బాహ్య విషయములు (objects) ఎక్కడున్నవి అక్కడే ఉంటాయి. వాటి విషయంగా సంకల్పాలను (imaginations) మనస్సులో తలెత్తనీయకపోవడం ద్వారా కామాన్ని ధీరులు (wise) అదుపు చేస్తారు.

ఆజీవకుడు ఒప్పుకోలేదు. తన అసమ్మతిని ఒక శ్లోకంలో చెప్పాడు.

***న తే కామా యాని చిత్రాణి లోకే సంకల్పరాగం వదసీహ కామమ్***
***భిక్షుర్భవిష్యత్యపి కామభోగీ సంకల్పయన్ సో ఽ కుశలాన్ వితర్కాన్***

అయ్యా, "చిత్ర విచిత్ర బాహ్య విషయములు కామం కాదు, సంకల్పరాగమే (desire that the imagination nourishes) కామం" అంటున్నావు. అలా అయిన పక్షంలో మీ భిక్షువులందరూ కూడా కామోపభోగులే (tasters of kamas) అని చెప్పవలసి వస్తుంది. ఎందుకంటే ఏదో ఒక సమయంలో అకుశల వితర్కాలు (unprofitable thoughts=lustful thoughts) తలెత్తని భిక్షువు ఎవడున్నాడు మీలో?

ఆజీవకుని అసమ్మతి శారిపుత్రునికి పాక్షికంగా సమ్మతమే. కామోపభోగం మూడు విధాలు - కాయేన, వాచా, మనసా. మనస్సులో కొంత ఊహాగానం చేసినంత మాత్రాన భిక్షువు భిక్షుత్వాన్ని (status of monk) కోల్పోడు. అయితే అతను ఇంకా చిత్తపరిశుద్ధి సాధించవలసినవాడుగా ఉంటాడు. ఏ భిక్షువైతే తథాగతుని శాసనాన్ని కాయేన, వాచా ఉల్లంఘిస్తాడో అట్టివాడు మాత్రమే కామోపభోగి అయిపోయి భిక్షుత్వాన్ని (status of monk) కోల్పోతాడు. ఇలా శారిపుత్రుడు ఆజీవకుని ఆక్షేపణను పాక్షికంగా అంగీకరించి క్రింది శ్లోకం చెప్పాడు.

***తే చేత్ కామా యాని చిత్రాణి లోకే సంకల్పరాగో యది తే న కామః***
***శాస్తా ఽ పి తే భవితా కామభోగీ దృష్ట్వైవ రూపాణి మనోరమాణి***

అయ్యా ఆజీవకా, "చిత్ర విచిత్ర బాహ్య విషయములే కామము, సంకల్పరాగం కామం కాదు" అని నీవు అంటున్నావు. అలా అయిన పక్షంలో మీ గురువున్నూ కామభోగి (taster of kama) అయిపోతాడు. ఎందుకంటే, కన్నులు తెఱచి అలా బైట అడుగు వేస్తే మనోహర రూపములు కనబడనిదెవరికి? మీ గురువు కన్నులు మూసుకొని నడవరు కదా!

పై వాక్యానికి ఆజీవకుడు ఔననిగానీ కాదనిగానీ బదులు పలుకలేదు. "అలానా" అని తన దారిన వెళ్ళిపోయాడు.

శారిపుత్రుడు జేతవనానికి వచ్చి మేనమామను, బుద్ధుని దర్శనానికి తీసుకెళ్ళాడు. బుద్ధునికి నమస్కరించి మేనమామ ఇలా అన్నాడు. "భగవాన్, నా మేనల్లుళ్ళు మేనకోడలు మీ వద్దకు చేరి చాలా మంచి పని చేశారు. నా చిన్న వయస్సులో మీలాంటి దేశికుడు నాకు లభించనందువల్ల నా జీవితం అంతా బోనులో పెట్టిన నక్క జీవితం అయ్యింది. ఒక్క ప్రయోజనమూ లేకుండా అది అందులో ప్రక్క చూపులు చూస్తూ పరిభ్రమిస్తూ ఉంటుంది కదా! నా బ్రతుకూ అంతే అయ్యింది. నా శైశవం, బాల్యం అంతా దారిద్ర్యంలోనే గడిచింది. యౌవనంలో అడుగుబెట్టేసరికి పేదరికం వెక్కిరింత ఎక్కువయ్యింది. నాకు చాలా కోపం వచ్చి 'ఓసీ దరిద్ర దేవతా, వెక్కిరిస్తున్నావు కదూ! వెక్కిరించే ఆ నీ పళ్ళు ఊడగొట్టేంతవరకు ఈ దేవశర్మ ఇక విశ్రమించడు. ఇదిగో నా జుట్టు ముడి విప్పివేస్తున్నాను. నీ పళ్ళు రాలగొట్టాకే మళ్ళీ ముడి వేస్తాను' అని శపథం చేసి జీవన పోరాటంలోకి దిగాను. ఇక వేరే ఆలోచనే లేకుండా సంపాదన మీదనే దృష్టిని పెట్టాను. సంపాయించి ధనికుణ్ణయ్యాను. కానీ ఎప్పుడు? నా పళ్ళు ఊడే దశకు వచ్చాక! ఈ వయస్సులో సంపదతో నేనేమి చేసుకొంటాను? యజ్ఞయాగాదులు చేసి పుణ్యాం గడించమని కొందరు మిత్రులన్నారు. ఈ విషయం మీద మీ ఆదేశం తీసుకొని వెళ్ళడానికే నేను వచ్చింది. మీరెలా చెబితే అలా చేస్తాను" అన్నాడు దేవశర్మ.

"దీనుడుగా దరిద్రుడుగా సోమరిగా చేతగానివాడుగా జీవించరాదని నీవొక మార్గంలో చాలా కృషి చేశావు. తప్పు లేదు. మనిషి ఏదో ఒక రంగంలో వీర్యవంతుడుగా ఉత్సాహవంతుడుగా పని చేయడం నిందనీయం కాదు. కుసీదుడుగా (lazy fellow) జీవితం వెళ్ళబుచ్చడమే నిందనీయం. నీ సంపదను లోకహితానికి వెచ్చించు. లాభ, సత్కార పూజలను ఆపేక్షించకుండా ధర్మదానం

చేస్తూ లోక హితానికి పాటుబడుతున్న శ్రమణులను పోషించు" అని బుద్ధుడు క్రింది శ్లోకం చెప్పాడు.

**మాసే మాసే సహస్రేణ యో యజేత శతం సమాన్**
**ఏవం చ భావితాత్మానం ముహూర్తమసి పూజయేత్**
**సైవ పూజనా శ్రేయసీ యచ్చేద్ వర్షశతం హుతమ్** 8-7

ప్రతి మాసమూ వేయి కార్షాపణములు వ్యయం చేస్తూ నూరు సంవత్సరాలు యజ్ఞ యాగ హోమాలు చేసిన ఫలం కంటే భావితాత్మ్మణ్ణి (One who practiced insight development) ఒక ముహూర్తకాలం పూజించిన ఫలం ఎంతో గొప్పది.



# పటాచార

శ్రావస్తిలోని ఒక కులీనుని కుమార్తె పటాచార. గారాబంగా పెంచినందువల్ల కాస్త మొండిఘటంగా తయారయ్యింది. తన ఇష్టానిష్టాలకే పెద్ద పీట వేయడం చిన్నప్పటినుండే నేర్చుకొనింది. తగిన వయస్సు రాగానే ఆమెకు తలిదండ్రులు ఒక సంబంధం ఖాయం చేసుకొని లగ్నపత్రిక కూడా వ్రాయించారు. పటాచారకు ఆ పెండ్లి ఇష్టం లేదు. తను కోరుకున్న వరునితో అయితే ఇష్టమే. కానీ తలిదండ్రులు చచ్చినా ఆ పెండ్లి చేయరు. తన పెండ్లి తానే చేసుకోవాలి. తోటమాలి ఖదిరుణ్ణి ఆమె వరించింది.

* * *

పటాచార ఖదిరునితో అజ్ఞాతవాసంలోకి వెళ్ళిపోయింది. శ్రావస్తికి ఇరవై మైళ్ళ దూరంలో ఏటికవతల ఉన్న పశుపాలకుల పల్లెకు చేరి కాపురం పెట్టారు. కొన్ని నెలల తరువాత ఆమెకు పుట్టింటి మీద మనస్సు మళ్ళింది. తను గర్భవతి. పుట్టింటిలో బిడ్డను కనాలని ఆమె అపేక్ష. ఖదిరుడు ఒప్పుకోలేదు. బిడ్డ పుట్టాక ఆ బిడ్డకు తన తండ్రి పేరే పెట్టింది. ఈ ముద్దుల మనవణ్ణి చూస్తే వాళ్ళ కోపం అంతా మాయమైపోయి తనను పూర్వం లాగా ప్రేమగా అక్కున జేర్చుకొంటారని ఆమె నమ్మిక. పుట్టింటికి పోవాలని రెండో ప్రయత్నం చేసింది. ఖదిరుడు వారించాడు. ఆ తరువాత మూడు నెలల కాలంలో నాలుగు ప్రయత్నాలు చేసింది పుట్టింటికి పోవాలని. “నా మాట విను. నీకు లోకం తెలియదు. చంపి పూడ్చిపెడతారు” అని ఖదిరుడు ప్రతి ప్రయత్నాన్ని అడ్డుకొన్నాడు.

ఖదిరుడు ఇంటి వద్ద లేని సమయం చూసుకొని పటాచార దోగాడే

బిడ్డను తీసుకొని అమ్మవారింటికి బయలుదేరింది. ఏటి ఒడ్డుకు వచ్చి బల్లకట్టు కోసం ఎదురు చూస్తూ కూర్చొనింది. ఒడిలో బిడ్డ బంతిని రెండు చేతులతో పట్టుకొని త్రిప్పుతున్నాడు. ఖదిరుడు ఇంటికి వచ్చి చూస్తే పటాచార లేదు, బిడ్డ లేదు. అతను చాలా గాబరాగా ఏటి దిక్కుగా పరుగు తీశాడు. క్రింద భూమిని చూడడం లేదు. దారిని చూడడం లేదు. కేవలం పరుగెత్తుతున్నాడు. అరికాలి అంచులో సన్నముళ్ళు దిగబడినట్లుగా చురుక్కుమనిపించింది. అది ఏమిటో గమనించకుండానే పరుగెత్తుతున్నాడు. ఏటికట్ట ఎక్కాడు. నీటి ఒడ్డున పటాచార కూర్చొనియుండడం చూశాడు. ఆమె వద్దకు బాణంలాగా దూసుకు పోవాలనుకున్నాడు. కానీ కాళ్ళు సహకరించడం లేదు. "పటా" అని అరుస్తూ కూలబడిపోయాడు. పిలుపుకి తలెత్తిన పటాచార భర్త కూలబడి పోవడం చూసి చాలా ఆందోళనతో బిడ్డను దించి ఏటికట్టకు పరుగు దీసింది. చేతినుండి జారి నీటిలోకి దొర్లుకుంటూ వెళ్ళిన బంతిని అందుకోవడం కోసం వీరదత్తుడు వేగంగా దోగాడుతున్నాడు.

* * *

నాలుగవ దినం పటాచార శ్రావస్తికి చేరింది. బాగా పరిచితులు కూడా ఆమెను గుర్తించలేక "ఎవతో పిచ్చిది" అనుకొన్నారు. అలాగే కనిపిస్తున్నది. నాలుగు రోజులుగా ఆమె ఒక ముద్ద అన్నం తినింది లేదు. స్నానం లేదు. చీర మార్చలేదు. ఆ చీరన్నూ ముళ్ళకంపలూ, కంచెలూ అవీ ఇవి తగిలి చీలికలు పేలికలుగా మారియున్నది. ఎక్కడో సొమ్మసిల్లిపడి మళ్ళీ లేయడం తప్పించి ఆమె నిదురబోయినదీ లేదు. ముఖము ఒళ్ళు అంతా దుమ్ము పేరుకొనియున్నది. కానీ ఆమె అప్పటికి పిచ్చిది కాలేదు. తను పుట్టి పెరిగిన ఇంటిని చూశాక, జరిగిన విషయం తెలిశాక పిచ్చిదైపోయింది. పటాచార చేసిన పనికి ఇంటిలోని తల్లిదండ్రులు, అన్న, అవ్వ అవమానభారంతో కృంగిపోయి ఆ భారంతో జీవించడం దుర్భరం అనిపించి అందరూ ఒక్కమాటగా నిలబడి మూకుమ్మడి ఆత్మహత్య చేసుకొన్నారు. ఆనాటినుండి ఆ ఇల్లు పాడుబడిపోయి చూడడానికే మహా

భయంకరంగా మారిపోయింది. ఇది తెలిసిన క్షణంలోనే పటాచార పిచ్చిదైపోయింది. ఐదు జన్మలకు సరిపడి ఇంకా మిగిలిపోయేంతటి దుఃఖం ఒక్కసారిగా కమ్మివేయడంతో పటాచార పిచ్చిదైపోయింది.

ఒకనాటి సాయం సంధ్యావేళ తథాగతుడు జేతవన సమీపంలోని కాలిబాటలో నడుస్తున్నాడు. వెనుక ఆనందుడు నీడలాగా అనుసరిస్తున్నాడు. ఆ కాలిబాట మలుపులో అటువైపు నుండి ఠీవిగా వస్తున్న పటాచారకు తథాగతుడెదురవడం జరిగింది. దేవేంద్రుడెదురైనా లెక్కజేయని స్థితిలో ఆమె చాలా నాళ్ళుగా ఉన్నది. తథాగతుడు ఆమెను చూశాడు. ఆ చూపుల నుండి అసంఖ్యేయ కల్పాలుగా అభ్యసింపబడుతూ వచ్చిన మహా కరుణా ప్రవాహ తరంగాలు ఆమె మీదికి ప్రసరించాయి. నష్టస్మృతి ఒక్కసారిగా ఆమెలో సముత్థితమయింది. స్త్రీ సహజమైన సిగ్గుతో తటాలున చేతులతో దేహాన్ని కప్పుకొని గొంతు కూర్చున్నది. కంఠసీమ నుండి పాదాలదాక తను కప్పుకొన్నట్టి చీవరాన్ని (cloak) తీసి ఆమెకు ఇచ్చి తథాగతుడు ముందుకు కదిలాడు. తథాగతుని నుంచి వస్త్రాన్ని గ్రహించిన క్షణంలోనే ఆమె భిక్షుణి అయిపోయిందని ఆనందుడు గ్రహించి "భగినీ (సోదరీ), మా వెనుకనే రమ్మా" అని ముందుకు కదిలాడు.

జేతవనంలో పటాచారకు బుద్ధుడు ఆర్య సత్యాలను బోధించాడు. ఆమె దుఃఖం ఉపశమించింది. ఆనాడు మృగదావంలో (సారనాథ్) ఆజ్ఞాత కౌండిన్యుని హృదయంలో ప్రప్రథమంగా తిరిగిన ధర్మచక్రం ఆ తరువాత మరెందరి హృదయాల్లోనో తిరుగుతూ ఇప్పుడు పటాచార హృదయంలోనూ తిరిగింది. ఆ ధర్మచక్రంలో సమస్త ధర్మాలు ఇమిడిపోతాయి. 37 బోధిపక్షీయ ధర్మాలూ అందులో ఇముడుతాయి. దశకుశల ధర్మాలు అందులో చేరిపోతాయి. ఆది కల్యాణం (శీలం) మధ్య కల్యాణం (సమాధి), పర్యవసాన కల్యాణం (ప్రజ్ఞ) కూడా ఆ చక్రంలో ఇమిడిపోతాయి. సూర్యచంద్రులు వెలిగేదాక ఆ ధర్మచక్రం తిరుగుతూనే ఉంటుంది. ఎక్కడో ఒక చోట ఏ హృదయంలోనే తిరుగుతూనే ఉంటుంది.

ఆ ధర్మచక్రమే* ఆర్య అష్టాంగమార్గం . సమ్యక్ దృష్టి, సమ్యక్ సంకల్పం, సమ్యక్ వ్యాయామం, సమ్యక్ స్మృతి - ఇవి ఆ ధర్మచక్రం యొక్క ఆకులు (spokes - సంస్కృతంలో అరా). సమ్యక్ వాక్కు, సమ్యక్ కర్మ, సమ్యక్ ఆజీవం - ఇవి నాభి స్థానీయములు (axle ఇరుసు). ధర్మచక్రం యొక్క నేమి (rim = చట్రం) సమ్యక్ సమాధి.

పటాచారకు బుద్ధుడు చేసిన ఉపదేశంలో క్రింది శ్లోకము కూడా ఉన్నది.

**నాంతరిక్షే న సముద్రమధ్యే**
**న పర్వతానాం వివరం ప్రవిశ్య**
**న విద్యతే స జగతి ప్రదేశో**
**యత్ర స్థితం న ప్రసహేత మృత్యుః** **9-13**

అంతరిక్షంలోగానీ సముద్రంలోగానీ పర్వతగుహల్లోగానీ ఎక్కడ కూడా మృత్యువుకు కనబడకుండా దాక్కొనే చోటు లేదు.

---

* అష్టాంగమార్గం :-

1. సమ్యక్ దృష్టి *(right view)*. ఆర్యసత్యాలు, ప్రతీత్య సముత్పాదం మొ॥ బుద్ధుని బోధనల అవగాహనం.
2. సమ్యక్ సంకల్పం *(right thoughts or intentions)*. రాగ ద్వేష మోహాదులతో కలుషితం కానట్టి సంకల్పాలు. ఉదా : లోకహితం కోసం ఉద్యమిస్తాను. అర్హత్వాన్ని లక్ష్యంగా పెట్టుకొని ఆసవక్షయం కోసం ఉద్యమిస్తాను వగైరా.
3. సమ్యక్ వాక్ *(right speech)*. మృషావాదం *(lying)*, పైశున్యం *(tale - bearing)*, పారుష్యం *(harsh language)*, సంభిన్న ప్రలాపం *(foolish babble)* ఇలాంటి పెక్కు దోషాలు రానీయని మాటలు.
4. సమ్యక్ కర్మ *(right bodily action)*. హింస, స్తేయం, కామమిథ్యాచారం వగైరా లేకుండా జాగ్రత్తపడడం.
5. సమ్యక్ ఆజీవ *(right livelihood)*. ఇతర జీవులకు హానికరమైన జీవికను చేపట్టకుండా

➤

ఉండడం.

6. సమ్యక్ వ్యాయామం *(right effort)*. అకుశల ధర్మాలు ఈ వరకే ఉన్నవాటిని వదిలించుకొంటూ కొత్తవి చేరకుండా చూసుకోవడం. కుశల ధర్మాలు ఈ వరకే ఉన్న వాటిని వృద్ధి చేసుకోవడం, లేని వాటిని కలిగించుకోవడం అనే నిరంతర ప్రయత్నం *(endeavour, streneousness energetic etc.,)*.

7. సమ్యక్ స్మృతి *(right mindfulness)* కాయానుపశ్యన, వేదనానుపశ్యన, చిత్తానుపశ్యన, ధర్మానుపశ్యన అనే అభ్యాసం. నేడు చాలా మంది మేలు పొందుతున్న ఆనాపానసతి కూడా ఇక్కడే చేరుతుంది- కాయానుపశ్యనలో.

8. సమ్యక్ సమాధి *(right concentration)* కుశలచిత్త ఏకాగ్రత. *(concentration of mind associated with wholesome consciousness)*.

పై ఎనిమిదింటిలో 1, 2 ప్రజ్ఞ అనబడుతుంది. 3, 4, 5 శీలం అనబడుతుంది. 7, 8 సమాధి. ఆరవది అన్నిటికీ అవసరమైన అంశం. ఇది లేకపోతే శీలమూ లేదు, సమాధీ లేదు, ప్రజ్ఞా లేదు.



# తిత్తిరీయ బ్రహ్మచర్యం

హిమాలయ సమీపం అరణ్యంలో ఒక పెద్ద మఱ్ఱివృక్షాన్ని ఆవాసంగా చేసుకొని ఒక ఏనుగు, ఒక కోతి, ఒక తిత్తిరిపక్షి ఉంటున్నాయి. ఒక చోట ఇద్దరు ముగ్గురు కలసియుంటే కొన్ని విషయాల్లో నైనా చిన్నా పెద్ద పాటిస్తేనే బాగుంటుంది. ఎవరికివారు పెద్దలనుకుంటే వ్యవహారాలు దెబ్బతింటాయి. ఆ మూడు జీవుల మధ్య సమస్యలొచ్చాయి. దేనికది పెద్ద అనే భావంతో అవి ఉండడంతో సమస్యలొచ్చాయి. పెద్దరికం సమస్యను సామరస్యంగా పరిష్కరించుకోదలచి అవి ఒక నిర్ణయానికి వచ్చాయి. "వయస్సులో ఎవరు పెద్ద" అనే విషయం తేల్చుకొంటే సరిపోతుందని అవి భావించాయి. మొదట ఏనుగు తన వయస్సు విషయం చెబుతూ "నా జీవితంలో జ్ఞాపకాలను బాగా వెనక్కినెట్టి చూస్తే మొట్టమొదటి జ్ఞాపకంగా ఒక సంఘటన గుర్తుంది. నేను చాలా చిన్న ఏనుగు గున్నగా ఉన్నప్పుడు మా పెద్దవాళ్ళ గుంపుతో కలిసి ఇటువైపు వచ్చినప్పుడు ఈ మఱ్ఱివృక్షం చాలా చిన్న చెట్టు. నేను దీని మీద నడిచి వెళ్ళాను. దీని చివరి ఆకులు నా ఉదరానికి తాకీ తాకనట్లుగా గుర్తు" అన్నది ఏనుగు. కోతి తన జ్ఞాపకాన్ని చెబుతూ "నేను చిన్న పాపాయిగా ఉన్నప్పుడు మా అమ్మ కడుపును గట్టిగా పట్టుకొని యుండేవాడిని. మా అమ్మ ఒకసారి ఇటువైపుగా దూకుతూ వచ్చి ఒక చోట ఆగింది. "ఏమిటా" అని నేను కుతూహలంతో తల క్రిందికి తిప్పి చూశాను. ఈ మఱ్ఱివృక్షం మొలక నాలుగైదు లేత చిన్ని చిగురులతో కనిపించింది. 'పీకి తింటామా' అనుకొంటుండగానే మా అమ్మ మరో చోటికి దూకి వెళ్ళిపోయింది. ఇది నా జ్ఞాపకం" అనింది. "మీ ఇరువురి జ్ఞాపకాలకన్నా నా జ్ఞాపకం మరీ వెనక్కి వెళ్తున్నది. నాకు బుద్ధి తెలిసివచ్చిన వయస్సులో అసలు ఈ వృక్షం

మొలకా లేదు పిలకా లేదు. ఇక్కడికి రెండు వందల గజాల దూరంలో అదిగో అక్కడ ఒక పెద్ద మఱ్ఱివృక్షం ఉండేది. ఇప్పుడు దాని జాడే కనబడటం లేదు. మా వాళ్ళ గూళ్ళు ఈ వైపున వందగజాల దూరంలో ఒక చెట్టున ఉండేవి. ఒకసారి మా అమ్మకి రెక్కలనొప్పి వచ్చి కదలలేకపోతే నేను ఆ మఱ్ఱివృక్షం నుండి బాగా మాగిన పండ్ల తునకలను ముక్కున బెట్టుకొని తెచ్చి ఆహారంగా ఇస్తూ ఉండేవాడిని. అలా ఒక పర్యాయం మఱ్ఱిపండు తునకను ముక్కున బెట్టుకొని ఇటు వస్తుంటే క్రింద నుండి భయంకరంగా సింహగర్జన వినిపించింది. నేను అప్పుడు చాలా చిన్నవాణ్ణి. పెద్దగా లోకజ్ఞానం లేదు. ఆ భయంకర శబ్దం విని జడుసుకొని "అమ్మా" అని అరచాను. అప్పుడు నా నోటి నుండి జారిపడిన ఆ తునకలోని గింజ నుండే ఈ వృక్షం మొలిచి ఇప్పటికి ఇంత పెద్దదయింది" అన్నది తిత్తిరిపక్షి.

తిత్తిరియే తమకంటే జ్యేష్ఠుడు (పెద్దవాడు = senior) అని ఏనుగూ కోతీ అంగీకరించాయి. తాము తమ సమస్యని పరిష్కరించుకొన్న విషయాన్ని ఇతరులకు చాటి చెప్పడానికోసం వనసంచారం చేసి వచ్చాయి. ఏనుగు, ఏనుగు మీద కోతి, కోతి మీద తిత్తిరి కూర్చుని అడవి అంతా తిరిగి వచ్చాయి.

ఒకనాడు తిత్తిరి, ఏనుగును కోతిని వాత్సల్యంగా చూస్తూ "తమ్ములారా, ఎన్నాళ్ళు జీవించగలము అనేది ముఖ్యం కాదు. ఎలా జీవిస్తున్నాము? అనేది ముఖ్యం. మన జీవితం బ్రహ్మచర్యంగా (religious life గా) ఉండాలి. అప్పుడే జీవితానికి ఒక సార్థకత కలుగుతుంది. బ్రహ్మచర్య విషయంగా నేను ఒక సూత్రం చెబుతాను. శ్రద్ధగా వినండి. మనలో అతిథి (guest) ధర్మం, యజమాన (owner) ధర్మం రెండూ ఏకం కావాలి. అతిథి ధర్మంలో ఆసక్తి (attachment) ఉండదు కానీ పట్టించుకోనితనం (indifference) ఉంటుంది. యజమానధర్మంలో పట్టించుకోనితనం ఉండదు. కానీ ఆసక్తి ఉంటుంది. మనం ఈ రెండు ధర్మాలను ఏకం చేయాలి. ప్రతిదీ పట్టించుకొంటూ అదే సమయంలో ప్రతిదాని

యందు నిరాసక్తత కలిగియుండాలి. ఈ ఒక సూత్రం చాలు బ్రహ్మచర్యానికి."

ఒకనాటి భిక్షు సమావేశంలో బుద్ధుడు పై కథను చెప్పాడు. ఆ కథను శ్రోతలకు వినోదం కలిగించడం కోసం గిలిగింతలు పెట్టడం కోసం చెప్పలేదు. భిక్షు సంఘంలో జ్యేష్ఠత్వ (seniority) విషయంగా కొందరి భిక్షువుల మధ్య మనఃస్పర్ధలు పొడసూపడం ఆయన దృష్టికి వచ్చింది. కనుకనే వారికి ఆ కథ చెప్పి ఇలా అన్నాడు: "ఒక వ్యవస్థ నడవాలంటే పెద్దా చిన్నా (senior, junior) విభాగం అవసరమే. ఎవరికివారు పెద్దలం అనుకొని వ్యవహారాలు నడిపితే మొత్తం మొత్తం పరమ గందరగోళం అయిపోతుంది. ఇక్కడ భిక్షు సంఘంలో జ్యేష్ఠత్వం అనేది నిర్ణయించడానికి మనం కూడా ఆ తిర్యక్కులు అనుసరించిన పద్ధతినే అనుసరిస్తాము. భిక్షు సంఘంలో మొదట కాలు పెట్టినవాడు తరువాత కాలు పెట్టినవాడికి జ్యేష్ఠుడు. ఇది నియమంగా పెట్టుకుందాము. జ్యేష్ఠత్వ సమస్య చాలా చిన్న సమస్య. దీనిమీద ఒకరితో ఒకరు ఘర్షణ పడుతూ పరస్పరం పరుషంగా మాట్లాడుకుంటూ వైషమ్యాలు పెంచుకోవడం వ్యక్తికీ మంచిది కాదు, సంఘానికీ మంచిది కాదు. ఈ భిక్షు సంఘాన్ని రణవిహారంగా (place of strife, conflict) మార్చకుండా అరణవిహారంగా (place of peace, harmony) ఉంచండి" అని క్రింది శ్లోకాన్ని కూడా చెప్పాడు.

***మా వోచ: పరుషం కించిత్ ఉక్తా: ప్రతివదేయుస్త్వామ్***
***దుఃఖా హి సంరంభకథా: ప్రతిదండా: స్పృశేయుస్త్వామ్*** **10-5**

పరుషంగా ఒక్క మాట పలక్కు. ఎదుటివానికీ నాలుక ఉంది. నీ తొందరపాటు మాటల వల్ల ఎదుటివాళ్ళ నుండి కష్టాలు కొని తెచ్చుకోకు (స్వేచ్ఛానువాదం).

---

*సభ్యసమాజంలో జనుల మధ్య పొరపొచ్చాలు కలగడానికి కారణం 95 శాతం నాలుకే. ఎవరి జీవితాలను వాళ్ళు సింహావలోకనం చేసుకొని చూసుకొంటే తెలిసే సత్యమిది. కనుక మాటలను*

చాలా జాగ్రత్తగా ఆలోచనా పూర్వకంగా ఆచితూచి సుదూర పర్యవసానాలను కూడా దృష్టిలో పెట్టుకొని మాట్లాడాలి. ఉదాహరణ చెప్పాలంటే చదరంగం ఆటగాడు పావును కదిలించే మాదిరి. పావును తటాలున కదిలించడు. ఎన్నో కోణాలు ఆలోచించి కదిలిస్తాడు. మాటను కూడా జీవన చదరంగంలో పావులాగా కదిలించాలి

Note :- తిర్యక్కుల ఔన్నత్య కథలు చెప్పి మానవులను సిగ్గుతో తలదించుకొనేలా చేసే నేర్పు బౌద్ధరచయితలలో ఎక్కువ. ఆర్యశూరుని జాతకమాల చదివినవాళ్ళకు ఈ విషయం మళ్ళీ చెప్పనక్కరలేదు. (శశ, మహాకపి, శరభ, రురు, హంస, హస్తి, మహిష, శతపత్ర). ఇక్కడ తిత్తిరీయ బ్రహ్మచర్యం కథలోనూ తిర్యక్కుల నడవడిక భిక్షువులంతటివారికే ఆదర్శమయింది. అప్రస్తుతమే అయినా త్రిపిటకంలోని ఒక విషయం జ్ఞాపకానికి వచ్చింది. ఒకానొకడు తన వినోదం కోసం ఒక కుక్కను, పక్షిని, నక్కను, శింశుమారాన్ని (ఒకానొక జలచరం), సర్పాన్ని, మర్కటాన్ని బంధించిపెట్టి ఆ తరువాత వాటినన్నిటినీ ఒక్కసారిగా వదలిపెట్టాడు. వదలిపెట్టగానే గ్రామసింహం (కుక్క) గ్రామానికి పరుగుదీసింది, పక్షి ఆకాశానికి ఎగిరింది, నక్క శ్మశానానికి దౌడు తీసింది, శింశుమారం నీళ్ళను వెదుక్కొంటూ వెళ్ళింది, సర్పం పుట్టవైపు జరజరా ప్రాకుతూ పోయింది, చెట్టు కోసం అంగలార్చుతూ మర్కటం చెట్టు మీదికి దూకింది. కుక్క, పక్షి, నక్క, శింశుమారం, సర్పం, మర్కటం మనలోనూ ఉన్నాయి. ఆయా విషయాల మీదికి పరుగులు తీస్తున్న ఆరింద్రియాలు (మనస్సు ఆరవది).



# ఉదయి

గంధకుటీరానికి (fragrant chamber. Buddha's residence in Jetavana) వంద గజాల దూరంలో ఉన్న మామిడి వృక్షం చుట్టు తిన్నె మీద వీతమోహుడూ మరి కొందరు యువభిక్షువులు, శ్రామణేరులు (novices) కూర్చొని పిచ్చాపాటీ మాట్లాడుకొంటున్నారు. వాళ్ళకు గిలిగింతల విషయం ఏదైనా చెప్పాలనుకొని వీతమోహుడు ఉదయి కథ ఎత్తుకొన్నాడు.

మొన్న ఉదయి, కొసియా పల్లెకు వెళ్ళి ఎనిమిది మంది ముఖ్య శిష్యుల్లో ఒకణ్ణి వాళ్ళకు చెప్పుకొని సభ పెట్టించుకొన్నాడు. వేదిక మీద కూర్చొని ఉదయి ఒక క్షణం కళ్ళు మూసి తెరిచి 'భక్తజనులారా, మీకు ఏ విషయం మీద ఉపన్యాసం ఇస్తే బాగుంటుంది ఆలోచించడానికి కళ్ళు మూసుకొన్నానో లేదో నా పూర్వజన్మ విషయం జ్ఞాపకం వచ్చింది. ఆ విషయమే మీకు చెబుతాను. క్రిందటి జన్మలో నేను చిన్నవయస్సులోనే తపస్సు కోసం హిమాలయానికి వెళ్ళి అక్కడే తపస్సు చేస్తూ పండు ముదుసలి అయ్యాను. ఒక రోజు శిలాతలం మీద కూర్చొని అస్తమిస్తున్న సూర్యుణ్ణి చూస్తూ "సూర్యదేవా, ధన్యుడను. నీ అనుగ్రహంతో నా పూర్ణ జీవితం ఈ దివ్య పర్వతం మీదనే తపస్సులో గడిచిపోయింది. నేనూ త్వరలోనే అస్తమిస్తాను. క్రిందకు దిగిపోవలసిన అవసరం లేకుండానే నా జీవితం ఇక్కడే జరిగిపోయింది" అన్నానో లేదో ఒక సూర్యకిరణం నా ముందు వర్తులాకారంలో వేగంగా తిరిగింది. ఏమిటిది అని చూస్తుండగానే సూర్యదేవత ప్రత్యక్షమై "అసితా, నీవు ఇప్పుడు క్రిందికి ఒకసారి దిగవలసిన అవసరం ఉన్నది. ఒక మహాపురుషుడు లుంబినీవనంలో జన్మించాడు. వెళ్ళి దర్శనం చేసుకొని రా" అని

అదృశ్యుడయ్యాడు. నేను క్రిందికి దిగి వచ్చి శుద్ధోదన భవనానికి వెళ్ళాను. శుద్ధోదనుడు నన్ను సాదరంగా ఆహ్వానించి ఉయ్యాలలోని బిడ్డను చూపాడు. నేను ఆ పసివాని చిన్ని పాదాలు అరచేతుల్లో ఉన్న మహాపురుష లక్షణాలను చూసి పట్టరాని దుఃఖం వచ్చి బోరున ఏడ్చేశాను. శుద్ధోదనుడు బెదిరిపోయి చాలా ఆందోళనతో "బిడ్డకేమైనా కీడును శంకిస్తున్నారా?" అన్నాడు. నేను అతనికి ధైర్యం చెబుతూ "పది లక్షల మారసైన్యం దండెత్తి వచ్చినా నీ బిడ్డకు కీడు జరుగదు. ఈతడు కల్పానికి ఒకసారి ఉదయించే జ్ఞానసూర్యుడు. ఇతను పెరిగి పెద్దవాడయి చేయబోయే దివ్యబోధ వినడానికి నేను బ్రతికి ఉండను గదా అనుకొని ఏడ్చాను" అని ఆ పసివాని పాదాలకు నమస్కరించి నా తపోభూమికి చేరాను. ఆపైన కొన్నాళ్ళకు దేహం విడిచాను. బ్రహ్మలోకం చేరాను. కానీ తథాగతుని శిష్యుడు కావాలనే తపనతో మళ్ళీ భూలోకానికి రావాలనుకొన్నాను. బ్రహ్మదేవుడు శపిస్తేగాని అది జరుగదు. కనుక ఒకనాడు బ్రహ్మను "ఓరీ మందమతీ" అని తిట్టాను. "భూలోకంలో పడుము" అని శాపం పెట్టాడు. "ధన్యోస్మి" అనుకొని ఈ లోకంలో పుట్టి తథాగతుని శిష్యుణ్ణయ్యాను. ఇక నా విషయం అటుంచి ధర్మప్రసంగానికి వస్తాను.

*గహకారక దిట్ఠోసి పున గేహం న కాహసి*
*సబ్బా తే ఫాసుకా భగ్గా గహకూటం విసంఖితం*
*విసంఖారగతం చిత్తం తన్హానం ఖయమజ్ఝగా*

ఈ ఉదానాన్ని* శ్రోతలకు చెబుతూ వేదికకు ప్రక్కనే ఉన్న ఖాళీ జాగా వైపు చూపులు సారించి "ఆ ఆ రండి రండి నమస్కారం నమస్కారం కూర్చోండి కూర్చోండి నమస్తే నమస్తే కొంచెం ఆ ఆ సర్దుకొని కూర్చోండి" అంటూ దానికి తగినట్లుగా చేతుల అభినయం చూపించాడు. శ్రోతల వైపుకు తిరిగి "మీరేమీ కంగారు పడకండి. దేవతలు వచ్చి కూర్చున్నారు. పరీత్తాభులు, అప్రమాణాభులు,

బ్రహ్మకాయులు, అకనిష్ఠులు వచ్చి కూర్చున్నారు. మీకు వాళ్ళు కనిపించరు. దివ్య చక్షువుండాలి. మీకు మాంస చక్షువు మాత్రమే ఉన్నది. తథాగతునికి ఐదు చక్షువులున్నాయి. మాంస చక్షువు, దివ్య చక్షువు, ప్రజ్ఞా చక్షువు, ధర్మ చక్షువు, బుద్ధ చక్షువు. నాకు మొదటి నాలుగున్నాయి. నేను మీకు అర్థం కావడం కొంచెం కష్టమే. లోకానువర్తన (conforming to the common people's thinking level) కోసం నేనెంత ప్రయత్నం చేస్తానో మీకు తెలియదు. ఒక ఇతివృత్తం చెబితే మీకు విషయం అర్థం అవుతుంది. గోదానీయ ద్వీపంలోని ఔదుంబర దేశంలో ఒకసారి వాతావరణం కలుషితం అయిపోయి వర్షం నీటితో బాటు ఆ కాలుష్యం కూడా బావుల్లోకి చేరింది. రాజుగారి బావి మంత్రిగారి బావి మాత్రం మూత ఉన్నందువల్ల కలుషితం కాలేదు. ప్రజలు కలుషిత జలాలు త్రాగి మతులు పోగొట్టుకొన్నారు (eccentric అయ్యారు). సభకు రాజు మామూలుగా వెళ్తుంటే మంత్రి వారించాడు. "మనం ఇప్పుడు మామూలు బుద్ధి (common sense) ఉన్న వాళ్ళలాగా ప్రవర్తించామంటే మనల్ని వీళ్ళు పిచ్చివాళ్ళనుకొని తరమగొట్టారు. కనుక మనం వీళ్ళలాగే వింత వింతగా ప్రవర్తిస్తూ ఉండాలి" అన్నాడు. కథ మీకు అర్థమైందనుకొంటాను. ఉదాహరణకి నాకిప్పుడు కవడీకారాహారం (material food) అవసరం లేదు. ఆ దిగువ స్థాయిని నేనెప్పుడో అధిగమించాను. స్పర్శాహారంతో మనశ్చేతయితాహారంతో విజ్ఞానాహారంతో జీవించగలను. కానీ కవడీకారాహారం తీసుకోకుండా జీవిస్తూ ఉంటే మీరేమనుకొంటారు? నన్నొక రోగి అనుకొని నా ధర్మప్రసంగాలు వినడానికి కూడా రారు..."

ఉదయి మాటల తీరును ఇతర భంగిమలను అనుకరిస్తూ వీతమోహుడు చెబుతూ ఉంటే అక్కడ వింటున్నవాళ్ళ పకపకలు, వికవికలు, కవకవలు, హహహహలు గంధకుటీరం దాకా వినిపించాయి. ఉదయి కౌసియాకు వెళ్ళింది వాస్తవమే. ఎనిమిది మంది ముఖ్య శిష్యుల్లో ఒకణ్ణని చెప్పుకొనిందీ వాస్తవమే. దివ్య చక్షువు ఉందని చెప్పడమూ వాస్తవమే. ఉదానం చెబుతూ కొంచెం నటన చేసిందీ

వాస్తవమే. కానీ వీతమోహుడు ఆ కొంచెం వాస్తవానికి చిలువలు పలువలు జోడించి చెప్పి నవ్వించాడు.

బుద్ధుడు వాళ్ళనందర్నీ తన కుటీరానికి పిలిపించి ఒకే ఒక మాట చెప్పి ఊరుకున్నాడు.

***కోను హాసః క ఆనందో నిత్యం ప్రజ్వలితే సతి***
***అంధకారేణా ఉ వనద్ధాః ప్రదీపం న గవేషయథ*** **11-1**

ఈ హాస్యం ఏమిటి? ఆనందం ఏమిటి? ప్రపంచం మొత్తం దుఃఖంతో తపిస్తూ ఉండగా ఛలోక్తులకు సమయమా ఇది? చీకటిలో ఉన్నవాళ్ళు మొదట దీపం వెదుక్కోవాలి గానీ ఈ పరాచికాలేమిటి?

---

Note :- *వీతమోహుడు చిలువలు పలువలు జోడించి చెప్పడంలోనే మనస్సును లగ్నం చేసి ఉదయి పలికిన అతిపెద్ద డాంబికాన్ని చెప్పడం వదిలేశాడు. కౌశియా సభలో ఉదయి ఏమన్నాడంటే: "శారిపుత్రుడికి సంశయం ఏదైనా వస్తే బుద్ధుడి దగ్గరకు మాత్రమే వెళ్తాడు. బుద్ధుడు పర్యటనలో ఉండి అందుబాటులో లేకుంటే సంశయ నివృత్తికి నావద్దకు మాత్రమే వస్తాడు. ఒకనాడు శారిపుత్రుడు నా కుటీరానికి వచ్చి 'భదంతా (venerable sir), మన శాస్త్ర సత్కాయదృష్టిని తొలగించడానికి స్కంధాలు, ధాతువులు, ఆయతనాలు అని మూడు రకాల విశ్లేషణ (analysis) పద్ధతుల్లో బోధించారు కదా! అలా ఎందుకు చేశారు? ఏదైనా ఒక పద్ధతే చాలు కదా!' అని అడిగాడు. నేనేమన్నానంటే, "సోదరా, బుద్ధుని అభిప్రాయాన్ని నీవు సరిగ్గా పట్టుకొనియుంటే ఈ సంశయం వచ్చేది కాదు. నా సమాధానం విను" అని ఆ అంశం మీద చాలా సేపు ప్రసంగించాడు.*



# సిరిమ

*Like all youngmen, you greatly exaggerate the difference between one woman and another.*

*- Undershaft to Cousins in Major Barbara by Bernard Shaw*

లోకం తీరు ఏ కాలంలో ఐనా ఇంతే. పై వాక్యంలోని youngmen పదంలో young కొట్టివేసి men అని ఉంచితేనూ సరిపోవచ్చు. ఎందుకంటే, Goethe, who at 75 fell so desperately in love with Ulrique, a girl of 19, that when his suit was refused, he wrote :

"I am lost in unconquerable desire. There is nothing left but flowing tears. Let them flow, let them flow unceasingly, but they can never extinguish the fire that burns me" తీరని కోరిక నన్ను దహిస్తున్నది. ఈ బాధను భరించలేను. నేనిక చేయగలిగిందేమీ లేదు కన్నీళ్ళు కార్చడం మినహా. కన్నీళ్ళు కారనీ. ఏకధారగా కారనీ... అయినా నాలో భుగభుగ మండే శోకాగ్ని మాత్రం చల్లారబోదు.

సంజ్ఞలలో (ideas) పడి కొట్టుకపోకుండా కాస్త నిదానంగా 'అక్కడ వాస్తవం ఏమిటి' అని ప్రత్యవేక్షణ (reflect) చేస్తే తెలిసేది నానా బీభత్సంగా ఉన్నట్టి జుగుప్సనీయమైన బారెడు దేహం.

బుద్ధుని కాలంలో వైశాలిలోని ఆమ్రపాలి కథ తలచుకొంటేనే విషాదంగా ఉంటుంది. ఆమె లిచ్ఛవి గణతంత్రరాజ్యంలోని ఒక రాజ కుటుంబంలో పుట్టింది. చూసినవారి కన్నులు చెదరిపోయే దివ్య సౌందర్యం ఆమెది. అదే ఆమెకు తీరని శాపం అయ్యింది. ఆమెను స్వంతం (పెండ్లి) చేసుకోవాలని రాజ్యంలోని ప్రముఖ కుటుంబాల యువకులు పోటీ పడినారు. ఎవరికో ఒకరికి ఇచ్చి వివాహం జరిపించివేస్తే అది అంతఃకలహాలకు తలుపులు తెరచేలా ఉన్నది. కనుక లిచ్ఛవి

గణతంత్రంలోని పెద్దలు సమావేశమై ఆమ్రపాలి సర్వజన ప్రార్థనీయగా (గణికగా) ఉండాలని శాసించారు. ఆమె గణికగా జీవించింది. కాలాంతరంలో బుద్ధుని శిష్యురాలయి చివరి రోజులను భిక్షుణిగా ముగించింది. ఆనాడు ఆమ్రపాలి ఎంత ప్రసిద్ధురాలో అంతే ప్రసిద్ధితో రాజగృహంలో సిరిమ ఒక వెలుగు వెలిగింది. రాత్రివేళల్లో తలెత్తి ఆకాశం చూశామంటే ఎన్నో నక్షత్రాలున్నా అప్రయత్నంగా మన చూపులను చంద్రుడు ఆకర్షిస్తాడు. అలాగే పదివేల మంది యువతుల మధ్య ఎక్కడో ఒక మూల సిరిమ ఉన్నదంటే చూసేవారి చూపులు అప్రయత్నంగా ఆమె మీదనే నిలిచిపోతాయి. అంత అందం ఆమెది! జీవకుని (ప్రసిద్ధ వైద్యుడు) స్వంత చెల్లెలు. ఏ రాజకుమారుణ్ణైనా ఆమె పెండ్లాడియుండవచ్చు. కానీ కులవృత్తి మీద గౌరవం, శ్రద్ధ ఉన్నందువల్ల గణికగానే జీవించింది. ఆమెకు దైవభక్తి ఎక్కువ. శ్రమణులు, బ్రాహ్మణుల పట్ల అమిత గౌరవం. బౌద్ధ భిక్షువులను తరచు భిక్షకు ఆహ్వానించి స్వయంగా వడ్డించేది. రాగ చరితులు (temparament) అయిన కొందరు భిక్షువులు ఆమె ముగ్ధమోహన రూపాన్ని చూసి తన్మయులు కావడం కోసమే భిక్షకు పోయేవారు. ఆ రాగ చరితుల విషయం బుద్ధునికి తెలిసింది. మౌనం వహించాడు.

దినాలు, వారాలు, నెలలు గడిచాయి. కొన్నాళ్ళుగా సిరిమ ఒక విధమైన అవసాదానికి (depression) లోనయ్యింది. కావలసినవన్నీ ఉన్నాయి అయినా ఏదో వెలితి, హృదయకుహరంలో పూడ్చను వీలుగాని ఒక అనంత అగాధం ఆమెను పీడించడం మొదలుపెట్టింది. మద్యపాన సేవనం మోతాదు క్రమంగా పెంచుకుంటూ ఒకనాడు మరీ అతిగా సేవించి ఉజ్జ్వలమైన జీవితానికి తటాలున తెర దించేసింది. ఆమె సామాన్యురాలు కాదు. మగధ దేశంలోని ప్రముఖ వ్యక్తులలో ఒకతె. కనుక ఆమె హఠాన్మరణవార్త బింబిసారునికి వెంటనే తెలియ జేయడం జరిగింది. బింబిసారుడు ఆ సమయంలో జేతవనంలో బుద్ధుని పాదాల చెంత కూర్చుని ధర్మశ్రవణం చేస్తున్నాడు. విషాదభరితమైన ఆ వార్తను బింబిసారుడు బుద్ధునికి తెలియజేశాడు. అక్కడ ఆ వార్త విన్న అందరూ కొన్ని క్షణాలు మౌనం వహించారు. మౌనాన్ని ఛేదిస్తూ బుద్ధుడు బింబిసారుణ్ణి ఒకటి కోరాడు. ఇన్నేండ్ల ధర్మచక్ర ప్రవర్తనంలో రాజులను బుద్ధుడు ఎన్నడూ ఏదీ కోరింది లేదు.

ప్రప్రథమంగా బింబిసారుణ్ణి ఒకటి కోరాడు. శ్మశానానికి చేరిన సిరిమ శవం* మూడు రోజుల పాటు కాక గృధ్ర జంబుకముల వశం కాకుండా చూడమని.

మూడవ రోజు సాయంకాలం బుద్ధుడు ఆ రాగచరితులను వెంట బెట్టుకొని శ్మశానానికి వెళ్ళి సిరిమ శవాన్ని వారికి చూపుతూ క్రింది శ్లోకాలు చెప్పాడు.

**పశ్య చిత్రీకృతం బింబం అరుకాయం సముచ్ఛ్రితమ్**
**ఆతురం బహుసంకల్పం యస్య నాస్తి ధ్రువం స్థితిః 11-2**

---

* *శవాన్ని తప్పనిసరి తగులబెట్టే ఆచారం ఆనాడు లేనట్లుంది. శవాన్ని dispose* చేసే విషయంలో ఐచ్ఛికత ఉన్నట్లు క్రింది యశోమిత్ర వ్యాఖ్యలోని వాక్యం వల్ల తెలుస్తున్నది. "*మృతస్య ఖలు కాలం గతస్య జ్ఞాతయ ఇమం పూతికాయం అగ్నినా వా దహంతి, ఉదకే వా ప్లావయంతి, భూమౌ వా నిఖనంతి, వాతాతపాభ్యాం వా పరిశోషం పరిక్షయం పర్యాదానం గచ్ఛతి*" *కాల్చడం, లేదా నీటిలో పారవేయడం, లేదా భూమిలో పాతిపెట్టడం, లేదా ఒక tower మీద వేసేసి గాలికి ఎండకి పని అప్పగించడం (పార్శీల పద్ధతి). జనాభా విపరీతంగా పెరిగిన నేటి మన దేశ పరిస్థితిలో అగ్నికి పని అప్పగించడమే ఆరోగ్యకరమైన విధానంగా కనిపిస్తున్నది. బుద్ధుని కాలంలో జనం పలచగా ఉండి ఉంటారు. పదిమైళ్ళకొక ఊరుగా ఉండి ఉంటుంది. ఊరి ఊరికి మధ్య విస్తారంగా నిర్జనప్రదేశం ఉండి ఉంటుంది. కనుక చాలా మంది శవాలను తీసుకుపోయి ఊరికి దూరంగా పారవేసేవాళ్ళమో! బౌద్ధ సాహిత్యంలో అశుభ భావనలు పది ఉన్నాయి. రాగచరితులకు మాత్రమే ప్రతిపక్షంగా చెప్పబడినాయి. అందరికీ కాదు. మానవుల్లో రాగచరితులు, ద్వేషచరితులు, మోహచరితులు, శ్రద్ధాచరితులు, బుద్ధిచరితులు, వితర్కచరితులని ఆరు రకాలు. అంటే ఆయా లక్షణం వాళ్ళలో ప్రబలంగా ఉందని అర్థం. తక్కినవి వాళ్ళలో లేవని కాదు. ఈ ఆరు రకాల temparament వాళ్లకి వారి వారికి సరిపోయే ధ్యాన పద్ధతులు బౌద్ధంలో చెప్పబడినాయి. ఎవరికి ఏది అవసరమో దాన్ని మాత్రమే తీసుకొనే సౌలభ్యం, పుష్కలత్వం బౌద్ధంలో ఉన్నది. ఈ కథ రాగచరితులకు సంబంధించినది. రాగచరితులుగా ఉన్నవాళ్ళు ఆ రోజుల్లో శ్మశానానికి వెళ్ళి వివిధ స్థాయిలలో (various stages of decomposition) ఉన్న శవాలను బాగా పరిశీలించి ఆపైన స్వస్థలాలకు వచ్చి శ్మశానపరిశీలనలను భావన చేయడం ఉండేది. ఈ భావన జీవిత పర్యంతం చేసే భావన కాదు. రాగం తగ్గుముఖం పట్టేంతవరకే. వర్ణ సంస్థానముల (colour and shape) మీద మోజును వదలగొట్టడానికే ఈ భావన. శవాన్ని మనం శవం అంటాము. అది ఉబ్బిపోయి ఉంటే ఉబ్బిపోయిందంటాము. అంతకు మించి పదాలు మనవద్ద లేవు. బౌద్ధంలో పది పదాలకు పైననే లభిస్తుంది. (వినీలకం, విపూయకం, వ్యాధ్మాతకం, విపటుమకం, విలోహితకం, విఖాదితకం, విక్షిప్తకం, అస్థి, అస్థిసంకలికా). ఈ అశుభ భావన (cemetery contemplations) కాకుండా అశుభ సంజ్ఞ అవే మరొక contemplation ఉన్నది. ఇది జీవత్ శరీరం విషయంగానే. శరీరంలోని 32 భాగాల భావన. ఈ భావన కూడా రాగాన్ని వదలగొట్టుంది. ఇది కాయగతానుస్మృతిలో చేరుతుంది.*

ఒకప్పటి సుందర ఆకారం ఇప్పుడెలా ఉన్నదో ఒకసారి చూడండి. ఎలా కుళ్ళిపోయి ఉబ్బిపోయి ఉన్నదో చూడండి. ఒకప్పుడు జనుల హృదయాల్లో బహు సంకల్పాలను (thoughts and ideas. what a beaty, how nice, very good looking figure, marvellous, charming, superb etc) చెలరేగించిన దేహం ఇప్పుడెలా ఉన్నదో చూడండి. ధ్రువమైన స్థితి (enduringness) దేహానికి ఉన్నదా ఆలోచించండి.

*పరిజీర్ణమిదం రూపం రోగనీడం ప్రభంగురమ్*
*భిద్యతే పూతిసందేహో మరణాంతం హి జీవితమ్* **11-3**

ఈ దేహం ఎలా శిథిలమయ్యిందో చూడండి. రోగాలకు నిలయం, నీటి బుడగవలె నశ్వరం, దుర్గంధాకరమే అన్ని దేహాల కథ. ప్రతి జీవితం ముగిసేది ఇలానే. ఇంతకన్నా భిన్నమేమీ కాదు.

---

Note:- *అధిరాగవితర్కులకే ఈ శ్మశాన సంబంధిత ధ్యానాలు. ఈ ధ్యానం వల్ల క్లేశ నిర్మూలనం జరుగదు. కేవలం విష్కంభణానికి (disturb అవుతాయి లేదా shake అవుతాయి) వీలు కలిగిస్తాయి. రాగం నాలుగు రకాలు. 1. వర్ణ రాగం (craving for bodily colour), 2. సంస్థానరాగం (craving for bodily shapes), 3. స్పర్శరాగం (craving for touch), 4. ఉపచారరాగం (craving for services). నాలుగు ముఖాలుగా ఉబికే ఈ రాగం నెత్తిమీద శ్మశాన సంబంధిత ధ్యానాలు నాలుగు మొట్టికాయలు వేస్తాయి. ఏది దేనికి మొట్టికాయ అనే వివరాలు ఎందుకు?*

Note : *అశుభ భావనలో పారంగతుడు (master degree సంపాయించినవాడు) మహాతిష్యుడు. అస్థిసంకలికా నిమిత్తాన్ని (sign) సాధించినవాడు. అంటే ధ్యేయ విషయం ఎదుట లేకున్నా ప్రపంచాన్నంతా కూడా కావలిస్తే అస్థి సంకలికగా చూడగలడు. ఆయన ఒక రోజు చైత్యపర్వతం నుండి భిక్షకై అనూరాధాపురం వెళ్తున్నాడు. దారిలో ఒక యువకుడు ఎదురై "స్వామీ, నా భార్య ఇటు వెళ్ళిందంటున్నారు. దారిలో మీకు ఆమె కనబడిందా?" అని అడిగాడు. మహాతిష్యుడు నడుస్తున్నప్పుడూ ధ్యానంలోనే ఉంటాడు. ఏదైనా శబ్దం చెవుల బడితేనే అతని ధ్యానానికి భంగం ఏర్పడి తలెత్తి చూస్తాడు. ఆ యువకుని భార్య మహాతిష్యునికి ఎదురయ్యింది. అతని దృష్టిని, అలంకరించుకొనియున్న తనమీదికి ప్రసరింపజేయాలని ఆమె తిష్యుణ్ణి చూసి అకారణంగానే కలకల నవ్వింది. మహాతిష్యుడు తలెత్తి చూశాడు. నవ్వుతున్న ఆమె పంటివరుసను చూశాడు. ఇంకేముంది? అస్థిపంజరమే అతనికి కనిపించింది. ఆ యువకునికి ఆ విషయమే చెప్పాడు. "ఒకటి కనిపించింది. అది మగా ఆడా నేను గమనించలేదు. ఒక విషయం మాత్రం రూఢిగా చెప్పగలను. అస్థిపంజరం ఒకటి నవ్వుతూ ఒయ్యారంగా పోవడం చూశాను."*

# పరిత్రాణములు

ఒకప్పుడు లిచ్ఛవి గణతంత్ర రాజ్యంలో కరువు సంభవించింది. ఆకలి చావులు ఎక్కువైనాయి. దిక్కులేని శవాలు కుళ్ళిపోవడంతో అంటు వ్యాధులు ప్రబలినాయి. లిచ్ఛవి పరిపాలకులకు దిక్కు తోచలేదు. బుద్ధుడు దేశంలో అడుగుపెడ్తే అంతా చక్కబడుతుందని భావించారు. అప్పుడు బుద్ధుడు మగధరాజధాని రాజగృహ సమీపంలోని వేణువనంలో ఉన్నాడు. లిచ్ఛవిరాజ్య ప్రతినిధిగా ఒక రాజకుమారుడు తన పురోహితుణ్ణి వెంటబెట్టుకొని కొన్ని దినాల ప్రయాణం తరువాత వేణువనం చేరుకొని బుద్ధుణ్ణి ప్రార్థించాడు. బుద్ధుడు ప్రయాణానికి సమ్మతి తెలిపాడు. తథాగతుని ప్రయాణ వార్త బింబిసారునికి తెలిసింది. బుద్ధుని ప్రయాణం సుఖంగా జరుగాలని భావించి బింబిసారుడు రాజగృహం నుండి గంగానది ఒడ్డున ఉన్న పాటలి గ్రామం వరకు వెళ్ళే రహదారిని బాగు చేయించి యోజనానికి ఒక విశ్రామశాల నిర్మించాడు.

---

* *మగధనుండి లిచ్ఛవి రాజ్యంలోకి పోవాలంటే గంగను దాటవలసియుంటుంది. గంగానది ఒడ్డున ఉన్న పాటలి గ్రామం రేవు ద్వారానే రెండు రాజ్యాల మధ్య గంగానది మీద రాకపోకలు జరిగేవి. ఆ గ్రామం యొక్క అదృష్టమేమని చెప్పాలో! బింబిసారుని కుమారుడు అజాతశత్రువు లిచ్ఛవి రాజ్యాన్ని వశం చేసుకొనే ఉద్దేశంతో మంత్రి వర్షకారుణ్ణి పాటలికి పంపి అక్కడ కోటను నిర్మించమన్నాడు. ఆ కోట నిర్మాణం జరుగుతున్న సమయంలోనే బుద్ధుడు చివరిసారిగా పాటలి మీదుగా గంగానదిని దాటింది. ఆయన గంగానదిలో కాలుపెట్టిన చోటు వర్షకారుడు గుర్తు పెట్టుకొని ఒక తోరణం నిర్మించి గౌతమద్వారం అని పేరు పెట్టాడు. పాటలిలో విడిది చేసినపుడు బుద్ధుడు ఆ పరిసరాలను చూసి "అచిరకాలంలోనే ఇక్కడొక నగరం ఏర్పడుతుంది. కొన్ని వందల ఏండ్లు దేశ నగరాల్లో మేటి నగరంగా వర్ధిల్లి అంతరించి పోతుంది. నగర నాశనం జలం వల్ల, ఆ తరువాత అగ్ని వల్ల" అన్నాడు. వర్షకారుడికి గౌతముని పట్ల విశేష గౌరవం, భక్తి ఉన్నా ఆ భవిష్యవాణిని పెద్దగా పట్టించుకోలేదు.*

-->

గంగానది ఆవలివైపు నుండి వైశాలి వరకు లిచ్ఛవిరాజులు రహదారిని సుందరంగా తీర్చి అక్కడక్కడా విశ్రామ శాలలు ఏర్పాటు చేసి బుద్ధుని రాకకై వేయికళ్ళతో ఎదురు చూస్తున్నారు.

లిచ్ఛవిరాజుల నమ్మకం వమ్ము కాలేదు. బుద్ధుడు రాజ్యంలో అడుగు పెట్టగానే వర్షాలు పడడం మొదలయ్యింది. వాగులు, వంకలు, చెఱువులు, బావులు అన్నీ నిండాయి. వైశాలి చేరాక బుద్ధుడు ఆనందునికి రత్నసూత్రం చెప్పి ఆ సూత్రాన్ని నగరం అంతటా తిరుగుతూ ఏడుసార్లు పారాయణ చేసి రమ్మన్నాడు. ఆనందుడు నగరంలోని వీధులన్నీ సంచరిస్తూ రత్న సూత్రాన్ని పారాయణ చేశాడు. అంటువ్యాధులు మాయమయ్యాయి. ప్రజలను బాధల నుండి కాపాడింది కనుక రత్నసూత్రానికి పరిత్రాణం (protection) అనే పేరు ఏర్పడింది. తరువాతి కాలంలో రత్నసూత్రం లాంటి మరికొన్ని సూత్రాలను కూడా పరిత్రాణములుగా భావించి పారాయణ చేయడం అమలులోకి వచ్చింది. ఉదాత్త అనుదాత్త స్వర నియమాలను పాటించి ఒక లయబద్ధంగా పరిత్రాణ సూత్రాలను పారాయణ చేస్తే ఒక విధమైన ప్రకంపనములు ఉత్పన్నమై ఆశించిన ఫలితాలు కొద్దో గొప్పో కనబడడం జరుగుతుంది.



వైశాలిలో ఆమ్రవన ఆరామంలో బుద్ధుడుండగా ఒకనాడు బోధిరాజ కుమారుడు అక్కడికి వచ్చి తాను నూతన గృహప్రవేశం చేస్తున్నానని బుద్ధుడూ భిక్షు సంఘమూ వేంచేసి అనుగ్రహించవలసినదిగా కోరాడు. బుద్ధుడు సమ్మతించాడు.

---

*"ఈ పల్లెటూరు పెద్ద నగరం కావడం ఏమిటి? ఇక్కడ చిన్న కోట నేనే కట్టున్నా. ఈ కోట వల్ల ఇది ఒక నగరం అయిపోతుందా? దేశంలో మూల మూలలా దిక్కుమాలిన కోటలున్నాయి. అవి నగరాలయ్యాయా?" అనుకొన్నాడు. స్థల మహత్యం మాంస చక్షువులకు కనబడేది కాదు. బెస్తలుండే ఆ కుగ్రామమే ఆ తరువాత పాటలీపుత్రంగా రూపాంతరం చెంది మగధ రాజధానిగా మారి ఆ తరువాత కొన్ని వందల ఏండ్లు దేశరాజధానిగా వర్ధిల్లి నగరాలకు కూడా జన్మ వ్యాధి జరా మరణాలున్నాయని నిరూపిస్తూ దిబ్బలో కలిసిపోయింది.*

ఈ వరకే ఉన్న భవనానికి ఏం లోపం వచ్చిందని బోధిరాజకుమారుడు మయసభలాంటి ఆ కొత్త భవనం కట్టుకొన్నాడో మనకు తెలియదు. అతనూ అతని భార్య కాంతిమతి తక్క ఇంకెవరూ లేరు ఉండడానికి. అంత పెద్ద భవనం ఎందుకో? బుద్ధుని రాకకోసం మహాద్వారం వద్దే నిలబడి ఎదురు చూస్తున్నాడు. అతని హృదయంలో ఏదో ఒక ఆశ. మహాద్వారం ప్రవేశ మార్గంలో చాలా విలువైన ఒక తెల్లని వస్త్రాన్ని పరచాడు. బుద్ధుడు ఆ వస్త్రం మీద కాలు పెడితే తనకు సంతానయోగం ఉంది అనుకొన్నాడు. ఏ హేతువు ఆధారంగా అతను అలా అనుకొన్నాడని ప్రశ్నించడానికి లేదు. అది కేవలం అతని పిచ్చి నమ్మకం. బుద్ధుడు వస్త్రం మీద కాలు పెట్టలేదు. ఆనందునిచేత దాన్ని తొలగింపజేసి లోనికి కాలు పెట్టాడు. బోధిరాజ కుమారుడు విచార వదనంతో బుద్ధుణ్ణి అనుసరిస్తూ వెనకనే నడిచాడు. భవనంలోకి వెళ్ళాక బుద్ధుడు అతణ్ణి సముదాయిస్తూ "బోధిరాజా, విచారించకు. నీకు సంతాన ప్రాప్తి లేకపోవడానికి కారణం పూర్వజన్మ కర్మ విపాకమే.

***న ప్రణశ్యంతి కర్మాణి కల్పకోటిశతైరపి***
***సామగ్రీం ప్రాప్య కాలం చ ఫలంతి దేహినామ్***

"వందకోట్ల కల్పాలైనా సరే చేసుకొన్న కర్మ, ఫలం ఇవ్వకుండా నశించదు. అనుకూల పరిస్థితులు ఏర్పడగానే ఫలాన్ని ఇచ్చివేసి అది నశిస్తుంది.

"నీవు పూర్వం ఒకానొక జన్మలో భార్యా సమేతంగా ఒక నావలో పయనించావు. ఒక చిన్న దీవి సమీపంలో ఆ నావకు విపత్తు సంభవించింది. నీవు, నీ భార్య ఎలాగో ప్రాణాలతో ఆ దీవి చేరారు. మీ ఆకలి బాధ పోగొట్టే ఆహారం ఆ దీవిలో లేదు. చెట్లల్లోని పక్షిగూళ్ళ నుండి అండాలను సేకరించుకొని తింటూ బ్రతికారు. ప్రాణం నిలుపుకోవడం జీవధర్మమే అయినా మీరు ఒక్కసారి కూడా కౌకృత్యం (regret) చెందలేదు. ఆ పాపమే మిమ్మల్ని ఈ జన్మలో

సంతాన విహీనులుగా చేసి దెబ్బ తీసింది. బ్రహ్మసహంపతి వచ్చినా ఈ కర్మ నియతి నుండి మిమ్మల్ని తప్పించలేడు. కనుక పరిహరించడానికి వీలుకాని విషయంలో విచారించవలసిన పని లేదు. మీ సంపదను పేదపిల్లల అనాథపిల్లల సంక్షేమానికి వినియోగించండి. ఆ పిల్లల ముఖ వికాసం చూస్తూ మీరూ ఆనందించండి" అని క్రింది శ్లోకం చెప్పాడు.

**ఆత్మనైన కృతం పాపం ఆత్మజమాత్మసంభవమ్**
**అభిమథ్నాతి దుర్మేధసం వజ్రమివాశ్మమయం మణిమ్** 12-5

తన పాపానికి (misery) తానే కర్త. అది తన వల్లే పుట్టుంది. తన వల్లే కలుగుతుంది. ఏ మణిశిల నుండి వజ్రం ఏర్పడిందో ఆ మణిశిలనే అది నూరివేయగలుగుతుంది కదా! అలాగే దుర్మేధనుని (unwise) స్వయంకృతములున్నూ.

---

Note :- *పరిత్రాణవనంలోకి (బుద్ధుని ఉపదేశాల్లోకి) ప్రవేశించాను. రకరకాల ఔషధవృక్షాలు, గుల్మాలు, లతలున్నాయి. ఏది దేనికి పనికి వస్తుందో నాకు తెలియదు. అక్కడొక ఆకు ఇక్కడొక ఆకు గిల్లి ఓ పిడికెడు ఆకులు పాఠకులకు ఇస్తున్నాను. ఉపకారం జరుగుతుందో జరుగదో తెలియదు గానీ అపకారం మాత్రం జరుగదు.*



# మాగంధియుడు

కురుదేశంలో తగరశిఖి గ్రామంలో మాగంధియుడనే బ్రాహ్మణుడుంటున్నాడు. అతనికి విషయదృష్టి (objectivity) తక్కువ. స్వయందృష్టి (subjectivity) ఎక్కువ. పెండ్లికెదిగిన కూతురు ఇంటిలో ఉన్నది. ఆమె పుట్టినపుడు నక్షత్రం వగైరా చూసి పేరు పెట్టకుండా తన పేరే పెట్టేసుకొన్నాడు 'మాగంధియ'* అని. తన కూతురు రూపలావణ్యవతియే. సందేహం లేదు కానీ లోకంలో అటువంటి వాళ్ళు, వెతికి చూస్తే లక్షలమంది కనిపిస్తారు. రూపం, అందం, లావణ్యం, విలాసం (graceful movements) ఒకరి గుత్తసొత్తు కాదు. అచింత్యమైన ఈ సృష్టిలో ఒకరున్నట్లు మరొకరుండరు. హస్తరేఖల నుండి కంఠస్వరం వరకు అంతా స్వలక్షణంగానే (unique, nowhere to be found) ఉంటుంది. వ్యవహారం కోసం మనస్సు, సామాన్య లక్షణాలను (shared properties or universals) చూస్తుంది. మాగంధియను మాగంధియగా (స్వలక్షణంగా) చూడకుండా వికల్పదృష్టితో (constructive activity or interpreting activity of mind) చూస్తే అందకత్తె అనే చెప్పాలి. ఈ వికల్పదృష్టికి అభిమానదృష్టి కూడా జత అయ్యిందంటే ఇక ఆమె జగదేకసుందరి క్రింద లెక్కవుతుంది. కూతురి మీది అభిమానంతో మాగంధియుడు వేసుకున్న అంచనా కూడా అదే. మంచిదే, కానీ ఆ అంచనా వల్ల సమస్యలూ వచ్చాయి. సాధారణ వ్యక్తులు ఎవరూ అతని దృష్టిలో మాగంధియకు తగిన వరుడుగా ఆనడం లేదు.

ఒకనాడు మాగంధియుడు తన ఇంటి వాకిలి ముందు భిక్షకై నిలబడియున్న

---

* *మాగంధియ ప్రస్తావన బాలనక్షత్రం శీర్షిక క్రింద కూడా వస్తుంది.*

వ్యక్తిని చూశాడు. తన కుమార్తెకు తగిన వరుడితడే అనే నిశ్చయానికి వెంటనే వచ్చేసి భార్యకు చెప్పడానికి "భద్రా" అని పిలుస్తూ లోనికి పరుగెత్తాడు. ఆ వ్యక్తి గౌతమ బుద్ధుడు. బోధివృక్షం క్రింద జ్ఞానోదయం పొంది వారణాసికి, అక్కడ్నుంచి కురుదేశం వచ్చి సంచరిస్తున్న ప్రసన్న గంభీర తేజోరాశి. మాగంధియుడు లోనికి వెళ్ళే సమయానికి ఆమె తులసి పూజలో ఉన్నది. మాగంధియుడు అసహనంగా ఆ పూజ అయ్యేవరకు అక్కడే నిలబడి పూజ నుండి ఆమె లేచిన వెంటనే విషయం చెప్పాడు. ఇద్దరూ వేగిరంగా వాకిలి వద్దకు వచ్చి చూస్తే ఆ వ్యక్తి లేడు. వాకిలి ముందు ఆ వ్యక్తి పాదాల గుర్తులు (foot prints) మాత్రమే ఉన్నాయి. మాగంధియుని భార్య భద్రశీల ఆ పాదాల గుర్తులు చూసి పరమాశ్చర్యం చెందింది. ఆమెకు లక్షణ జ్ఞానం ఉన్నది. (capable of reading bodily signs). "మన ఇంటి ముందు నిలిచిన వ్యక్తి చక్రవర్తి లేదా మహాజ్ఞాని" అనింది. "అరెరె" అనుకొని మాగధియుడు ఆ అడుగు జాడలు చూసుకొంటూ తను ఎప్పుడూ అడుగుపెట్టని వీధిలోనూ తిరిగి చివరకు ఊరి వెలుపల కొలను గట్టులో బుద్ధుణ్ణి చూడగలిగాడు.

మాగంధియుని ప్రతిపాదనను బుద్ధుడు చాలా సౌమ్యంగా విన్నాడు. ఆ తండ్రి మనస్సుకు కించిత్ గాయం కూడా కలుగకుండా చాలా మృదువుగా "మారుని ముగ్గురు అందమైన అమ్మాయిలను (తృష్ణ, అరతి, రాగం) కాదని గయ నుండి వచ్చినవాణ్ణి" అని క్రింది శ్లోకాలను చెప్పాడు.

***యస్య జితం నావజీయతే జితమస్య న యాతి కశ్చిల్లోకే***
***తం బుద్ధమనంతగోచరం అపదం కేవ పదేన నేష్యథ*** **14-1**

ఆసవాలను* జయించినవాడను. అవి మళ్ళీ నాలో ఇక తలెత్తవు. అనంతాన్ని

---

* *ఆసవాలు నాలుగు : 1. కామాసవం, 2. భవాసవం, 3. దృష్టి ఆసవం, 4. అవిద్యాసవం. ఆసవానికి ఇంగ్లీషులో సర్వసమ్మతమైన ఒక సమాన పదం ఇంకా ఏర్పడలేదు. ఆసవాలు = influxes, cankers, taints, corruptions, intoxicants, biases. వెతికితే ఇంకా కొన్ని పదాలు కూడా లభించవచ్చు.*

(infinite) తెలుసుకొన్నవాణ్ణి. రాగ ద్వేష మోహ బాటల్లో నడవనివాణ్ణి. అట్టి నన్ను ఏ బాటలో నడవాలని కోరుతున్నావు?

**యస్య జాలినీ విషాత్మికా తృష్ణా నాస్తి కుత్రచిన్నేతుమ్**
**తం బుద్ధమనంతగోచరం అపదం కేన పదేన నేష్యథ**

తృష్ణ అనే పరమ ఘోరమైన వలనుండి బైటపడినవాణ్ణి... ఏ బాటలో నడవాలని కోరుతున్నావు?

ఆ తరువాత మాగంధియుడు తన కుమార్తెను వత్సరాజుకు ఇచ్చాడు. వద్దని చెప్పడానికి వత్సరాజు జ్ఞాని కాదు, పిచ్చివాడూ కాదు. అంతఃపురంలో ఒక వ్యక్తి అధికమైనందువల్ల అతనికేమి నష్టం? ఎందర్ని చేర్చుకొన్నా శ్యామావతి (పట్టమహిషి) అడ్డు చెప్పదు.

Note:- *బుద్ధుణ్ణి (Perfect embodiment of spirituality) గురించి ఎన్ని కోణాల్లో ఎన్ని విధాలుగా వ్రాసినా కొఱత కొఱతగానే ఉండిపోతుంది. బోధివృక్షం క్రింద కూర్చొన్న సిద్ధార్థుని మనస్సును ఈ లోకం మీదికి లాగలేక మారుడు (embodiment of sensate values) అసహనంతో రెచ్చిపోయి "ఈ ప్రపంచం మొత్తాన్ని తృణీకరించి పద్మాసనం వేసుక్కూర్చుంటావా? నన్నూ నా బలగాన్ని గడ్డిపోచలాగా చూస్తున్న నీకు ఈ బోధిమండనం (seat of elightenment) జాగా మీద కూర్చునే హక్కు కూడా లేదు. లే ఇక్కడ్నుంచి" అన్నాడు. అంతవరకు మౌనంగా ఉన్న సిద్ధార్థుడు ప్రసన్నంగా ఇలా అన్నాడు: "ఈ హక్కు నీవిచ్చేది కాదు, మరొకరిచ్చేది కాదు. నేను సంపాయించుకొన్నదే. మూడు అసంఖ్యేయ కల్పాలుగా జగత్క్షేమం కోసం నిర్విరామంగా కృషి చేస్తూ వచ్చినవాణ్ణి. అట్టి నాకు ఈ జానెడు స్థలం మీద హక్కు లేదా?! నా మాటలకు సాక్షి ఈ భూమాతయే" అని చూపుడు వేలును క్రిందకు చూపాడు. వెంటనే భూదేవి సాక్షాత్కరించి "నా బిడ్డ సిద్ధార్థుడు చెప్పిన మాట అక్షరాల సత్యం" అనింది.*



# ఉగ్రసేనుడు

*"Why marry in haste and repent at leisure"*

సంకాశ్యనగరంలో ఒకనాడు దొమ్మరవిద్యా ప్రదర్శనం జరిగింది. ఆ ఊరివాడైన యువకుడు ఉగ్రసేనునికి ఆ ప్రదర్శనం కన్నా ఆ ప్రదర్శనలో కొన్ని విన్యాసాలు (feats) చేసిన ఒక యువతి అమితంగా ఆకర్షించింది. ఆమె దొమ్మరవిద్యా నాయకుని కూతురు. ఉగ్రసేనుడు ప్రదర్శన అయ్యాక కూడా ఆ చోటును వదలిపెట్టిపోలేదు. అక్కడే తచ్చాడతూ ఆ యువతి వద్దకు వెళ్ళి ఆమె చేసి చూపిన విన్యాసాలను పొగిడాడు. "నీ పేరేమి? మీది ఏ ఊరు? తరువాతి ప్రదర్శన ఎక్కడ? మీ విద్యలు చూస్తుంటే నాకూ నేర్చుకోవాలనే ఉత్సాహం ఉరకలు వేస్తున్నది, మీ గుడారానికి వస్తే నేర్పిస్తారా?" ఇలా అతను ప్రశ్న మీద ప్రశ్న వేస్తూ సంభాషణను సాగదీస్తూ ఆమె మాటలు వింటూ తన్మయంలో పడిపోయాడు. దొమ్మరవిద్యాబృందంవాళ్ళు వస్తువులన్నీ సర్ది తీసుకొని గుడారాలకు వెళ్తుంటే వాళ్ళకు సహాయంగా ఉగ్రసేనుడు ఒక పెట్టె మోసుకొని ఆమె ప్రక్కనే తాకీతాకనట్లుగా నడుస్తూ ఆమెతో మాటలు సాగదీస్తూ వాళ్ళవెంట వెళ్ళాడు.

ఆమెకు కూడా ఉగ్రసేనుడంటే ఇష్టం ఉన్నట్లే తోచింది. ఉగ్రసేనుడు నటరంగవచనములు (fiction) బాగా అధ్యయనం చేసినవాడు గనుక ఆ నటరంగవచన కథానాయకులను అనుకరిస్తూ ఆమెనొక స్వప్నవాసవదత్తగా ఊహించుకొంటూ ఇంటినుండి గుడారానికి చాలా సార్లు ప్రేమయాత్ర చేశాడు. దారిలో చీలమండ వరకు నీళ్ళుండే కాలువ దాటేటప్పుడు గోదావరిని దాటుతున్నట్లుగానూ ఊహించుకొన్నాడు. వాళ్ళు గుడారాలను మరో ఊరికి తరలించే సమయం వచ్చేసింది. ఉగ్రసేనుడు విలవిలలాడిపోతూ ఆమె వద్దకు

వెళ్ళి "దమయంతీ, నీవు దూరమైతే నా ప్రాణం నిలువదు" అని ఒక నటరంగవచనం పలికాడు. ఆమె ఒక షరతు మీద వివాహానికి అంగీకరించింది. అతను కూడా తన విద్యను త్వరలోనే నేర్చుకొని ప్రదర్శనలు ఇవ్వాలని. "బంగారుగా" అని అతను వాగ్దానం చేశాడు. ఆ గుడారాలు మరో ఊరికి కదలకముందే దమయంతీ ఉగ్రసేనుల వివాహం జరిగిపోయింది.

దినాలు, వారాలు, నెలలు గడిచాయి. ఉగ్రసేనుడు మాట నిలుపుకోలేదు. కానీ వాళ్ళవెంటే ఊర్లు తిరుగుతూ వస్తువులు మోసే పని మాత్రం చేస్తున్నాడు. "మాట నిలుపుకోని మగడా" అని ఆమె అప్పుడప్పుడూ ఎగతాళి చేసినా అది ఉగ్రసేనుడికి వీనులవిందుగానే వినిపించింది.

రెండేండ్ల తరువాత వాళ్ళు మళ్ళీ కోసల దేశానికి వచ్చారు. శ్రావస్తీనగరంలో అనేక ప్రదర్శనలిచ్చే నిమిత్తం ఊరి పొలిమేరలో జేతవన సమీపంలో గుడారాలు వేసుకొన్నారు. దమయంతి కొంతకాలంగా ప్రదర్శనల్లో పాల్గొనడం లేదు. మూడు నెలల క్రితం ఆమె తల్లి అయ్యింది. ఒకనాడు బిడ్డను గుడ్డ ఉయ్యాలలో పడుకోబెట్టి ఊపుతూ భర్తకు వినబడే విధంగా జోలపాట పాడింది. జోలపాటలు ఎన్నో ఉన్నాయి. కానీ స్వంత జోలపాట కావాలి ఆమెకు. పోనీ స్వంతమే "నా బంగారు కొండా రతనాల మూటా జోజో" అని పాడుకోవచ్చు గదా! కానీ ఆమె ఈ మధ్య అవకాశం చిక్కినప్పుడల్లా భర్తను మాటల సూదులతో పొడవడం ఎక్కువ చేసింది. అతనికి బాగా వినిపించేలా హెచ్చు స్వరంతో

**చేతగానివాడురా బుల్లీ నీ నాన్న జోజో**
**కట్టెలు పెట్టెలు పట్టలు మోస్తాడు జోజో**
**నీకూ నాకూ తలవంపులు తెస్తాడు జోజో**

అని జోల పాడింది. ఆ పాట వినగానే ఉగ్రసేనుడికి బాధ, బాధ వెంబడి కోపం వచ్చేసింది. "దొమ్మర విద్య నేర్చుకోలేదనేగా నీ అక్కసు? ఆ వెదురుగెడ ఎక్కి

అక్కణ్ణుంచి క్రిందపడి కాళ్ళు చేతులు విరగ్గొట్టుకొంటే అప్పుడేమి జోలపాట పాడతావు? 'అవిటివాడురా నీ నాన్న జోజో పనికిరాని కొయ్యరా నీ నాన్న జోజో" అని పాడతావా?" అని విసురుగా బైటకు వెళ్ళిపోయాడు.

ఉగ్రసేనుడు జేతవనం దిక్కుగా నడుస్తూ స్వగతంలో ఇలా అనుకొన్నాడు : "కేశకంబళుని మహావాక్యానికి నా జీవితం నిర్వచనంగా మారిపోయిందేమిటి? ఎంత బాగా చెప్పాడు ఆ కేశకంబళుడు! 'చేసుకో పెళ్ళి తొందరగా, ఆపైన విచారించు తీరుబడిగా!' దమయంతి ఇప్పుడు నన్ను నడపీనుగుగా చూస్తున్నది. సంపాదన ఉంటేనే స్త్రీ, భర్తను గౌరవిస్తుంది. సంపాయించలేని నేను తొందరపడి పెండ్లి చేసుకొనడం చాలా పొరబాటయిపోయింది. ఆ దినం ఆకర్షణలో పడి కొట్టుకపోయాను. కాస్త నిలదొక్కుకొని సుదూర పరిణామాలు ఆలోచించి ఉండవలసింది. నన్ను అప్పుడంత ఇదిగా ఆకర్షించిన ఆ రూపానికి కేశకంబళుడు చెప్పిన విధంగా ఊహలో 25 ఏండ్లు కలిపి చూసి ఉంటే ఎంత బాగుండేది! ఇక విచారించి ఏమి లాభం? గతజల సేతుబంధనమే".

* * *

ఆ జోలపాట దెబ్బ తగిలాక ఉగ్రసేనుడు తరచు జేతవనం వెళ్తూ అక్కడి పద్ధతులు గమనిస్తూ వచ్చాడు. ఒకనాడు బుద్ధుణ్ణి సమీపించి "భగవాన్, లోకంలోని రకరకాల వైరాగ్యాల్లో నాదొకరకమైన వైరాగ్యం. నాకు భార్యా వైరాగ్యం పుష్కలంగా ఉన్నది. ప్రవ్రజ్యదీక్ష తీసుకొని మీ వద్దనే ఉండిపోతాను" అన్నాడు.

"బాబూ, ఈ భిక్షు సంఘం ఏ విషయంలోనూ లోకంతో ఘర్షణ పడదు. లోకశాసనాలు, నియమాలు, పద్ధతులతో ఘర్షణ పడదు. ప్రభుత్వ అనుమతి లేకుండా సైనికులను చేర్చుకోవలదని బింబిసారుడు కోరాడు, సరే అన్నాము. పెద్దల అనుమతి లేకుండా చిన్న పిల్లలను చేర్చుకోవద్దని శుద్ధోదనుడు కోరాడు. సరే అన్నాము. ఋణగ్రస్తులను చేర్చుకోవద్దని న్యాయస్థానాలు కోరాయి, సరే

అన్నాము. రోగులను చేర్చుకోవద్దని ప్రజలు కోరారు, సరే-అన్నాము. భార్యల అనుమతి లేకుండా భర్తలను, భర్తల అనుమతి లేకుండా భార్యలను చేర్చుకోవద్దనీ కోరారు, సరే అన్నాము. లోక విషయాల్లో లోకం ఏది మంచిదంటుందో దాన్ని మేమూ మంచిదంటాము. వ్యతిరేకించము, ఘర్షణపడము. కనుక నీవు నీ భార్య అనుమతి పొంది రాగలిగితే స్వాగతమే" అన్నాడు బుద్ధుడు. "అనుమతి తీసుకొనే వస్తాను" అని ఉగ్రసేనుడు వెనుదిరిగాడు. ఉగ్రసేనుడు వెళ్ళాక బుద్ధుడు భిక్షువులకు క్రింది శ్లోకం చెప్పాడు.

**నాస్తి రాగసమో ఽగ్నిః నాస్తి ద్వేషసమః కలిః**
**నాస్తి స్కంధసమా దుఃఖాః నాస్తి శాంతిపరం సుఖమ్** 15-6

రాగానికి సమమైన అగ్ని లేదు. ద్వేషానికి సమమైన నేరం (కలి=crime) లేదు. పంచస్కంధాలకు సమమైన దుఃఖం లేదు. శాంతికి మించిన సుఖం లేదు.

* * *

గుడారానికి వెళ్తూ ఉగ్రసేనుడు స్వగతంలో "అనుమతి చాలా సులభం. నాలుగు దినాలు కట్టెలు పెట్టెలు పట్టలు మోయకుండా ఊరక కూర్చొని తింటే అనుమతి దానంతటే వస్తుంది" అనుకొన్నాడు.

"అనుమతి లేదు గినుమతి లేదు" అన్నారు వాళ్ళు. "అయితే కట్టెలు పెట్టెలు పట్టలు మోసేది లేదు" అన్నాడు ఉగ్రసేనుడు. "కట్టెలు పెట్టెలు పట్టలు మోయకపోతే కూడు పెట్టేది లేదు, గుడ్డ ఇచ్చేది లేదు" అన్నారు వాళ్ళు.

ఉగ్రసేనుడు ప్రవ్రజ్య తీసుకోలేకపోయాడు. కానీ సమయం లభించినపుడు జేతవనం వెళ్ళి వస్తున్నాడు. దానివల్ల క్రమంగా అతని జీవితంలో శుభపరిణామం జరుగుతూ వచ్చింది. కట్టెలు పెట్టెలు పట్టలు మోయడం అవమానంగా భావించడం లేదు. వృత్తి గౌరవం (dignity of labour) గుర్తించాడు. 'చేయి చేయి కలిపితేనే చప్పుడు' అనే విషయం కూడా గ్రహించి తన చేయి కలపడం మానేశాడు.

(verbal retorts వగైరా మానేశాడు). తొంభైఐదు శాతం గొడవలు చప్పున అణగిపోయాయి. జీవితం హాయిగా ఉంది. శరీరాన్ని సంసారంలోనే ఉంచి చిత్తాన్ని వైరాగ్యంలో ఓలలాడించడం నేర్చుకొన్నాడు. భావావేశం వస్తే తంబుర ఒకటి చేతికి తీసుకొని టింగ్‌టింగ్‌మని మీటుతూ వైరాగ్య గీతాలు -పాడేవాడు. దొమ్మరవాళ్ళతో మ్లేచ్ఛదేశమూ తిరిగాడు గనుక ఆ దేశ భాషా పదాలు కొన్ని అతని కవనంలోకి కూడా ప్రవేశించాయి. అతని వైరాగ్య గీతాల్లో ఒక గీతం* :

ప్రపంచ సుఖములు జూట    కర్మఫలముల మూట
పరమాత్ముని గొలుచుటే మాట    నిను కదులనివ్వదు బాట
పారమార్థికపు బాట    స్వర్గనరకములు జూట
మన ప్రజలందరికీ మూట    లేనేలేవు ఏ చోట

తొమ్మిది బాటల తోట    ప్రపంచ సుఖముల వాటా
దీనంతు తెలియుటే మాట    పంచుకోకు ఏ చోటా
నరజీవనమను మాట    పరమాత్ముని గను మాట
నమ్మి బ్రతుకుటే జూట    వెతుకుమురా ప్రతి చోటా
దేవుడు లేడను మాట    లోటు లేదురా బేటా
పలుకబోకు నీ నోట    మరిచితివా మరి ఘాట

అంతు దెలియని చోట    కూటి కొరకు ఈ దేహం
మరుగైయున్నది బాట    పెంచబోకు మరి మోహం
నరజన్మపు ఈ ఆట    కాటిలో ఈ నరకాయం
మరి ఐదుగురితో తగులాట    కాలును మరి మరి ఘోరం
సంసారపు ఊగులాట    కలిమాయలో మునుగుట కర్మం
భగవంతుని ఈ ఆట    మర్మము తెలియుటే ధర్మం

---

* *ఈ గీతాన్ని వ్రాసింది ఎమ్. నర్సింలు (హైదరాబాదు).*

# నకులమాత

నకులమాత త్రిరత్న శరణు పొందిన ఉపాసకురాలు. ఆమె భర్త కొన్ని నెలలుగా వ్యాధిపీడితుడుగా ఉంటూ క్రమంగా క్షీణించిపోతున్నాడు. ఎక్కువ దినాలు బ్రతకడని తెలుస్తున్నది. ఒకనాడు నకులమాత భర్త దగ్గర కూర్చొని ధైర్యం చెప్పింది: "మీరేమీ దిగులు చెందకండి. నా విషయంలోనూ పిల్లల విషయంలోనూ ఏమీ ఆందోళన పడకండి. మీరూ చూస్తున్నారు గదా ఈ ఐదారు నెలలుగా నేనెలా కుటుంబాన్ని నెట్టుకవస్తున్నానో. నాకున్నూ నూలు వడకడం వచ్చు. మగ్గం మీద పని చేయడం వచ్చు. ఈ పనితనం వల్ల నన్నూ పిల్లల్నీ సులభంగా పోషించుకోగలను. మీరిక నిశ్చింతగా భగవంతుణ్ణి స్మరిస్తూ ఉండండి. భగవంతుణ్ణి శరణు పొందండి. 'దేవుడా ఇక నీదే భారం. నాదేమీ లేదు. పాల ముంచినా నీట ముంచినా నీ ఇష్టం. పిల్లిపిల్ల చందాన ఇక నిశ్చింతగా ఉంటాను. నీవు ఎక్కడికి తీసుకపోయి ఉంచుతావో ఉంచు. ఇన్నాళ్ళు కోతిపిల్లలాగా దూకి దూకి అలసిపోయాను. ఇక నావల్ల కాదు. అంతా నీ చేతుల్లో పెట్టేస్తున్నాను' అని శరణు కోరండి. 'లోకనాథా, జగద్రక్షకా, పరమేశ్వరా, పరంధామా, శంభోశంకర శివ శివా' అంట భగవంతుణ్ణి స్మరిస్తూ ఉండండి. మరణ భయం వద్దు. దేహానికి బాధ అంతా ఈ ప్రక్కనే. గీటు దాటాక మీకేమీ బాధ ఉండదు. ఆ దాటడం కూడా మీకు తెలియకుండానే జాగ్రత్తనుంచి స్వప్నానికి దాటినట్లుగా జరిగి పోతుంది. మళ్ళీ ఇదే దేహం, ఇదే మనస్సు, ఇదే పరిసరాలు, ఇదే లోకం రానేరాదు. సృష్టిలో పునరుక్తి (repetition of the same thing) లేదు. కనుక గీటుకు ఇవతలి ఏ విషయంలోనూ ఆసక్తి వద్దనేవద్దు. మళ్ళీ మీరు ఇక్కడికి వచ్చి 'లోకం ఎలా ఉంది? నన్ను గురించి జనాలు ఏమనుకొంటున్నారు?' అని తొంగి

చూడబోయేది లేదు. మనం అందరం దారిమధ్యలో ఒకరికొకరం తారసపడి కొంత దూరం కలిసి నడిచాము. సమయం వస్తే ఎవరి దారిన వారు వెళ్ళిపోవలసినవారమే. ఈ కాస్తదానికి లేనిపోని అహంకారాలు మమకారాలు ఎందుకు? భగవంతుని శక్తే మనలో పని చేసేది. అదే లేకపోతే గడ్డిపోచను కూడా వంచలేము. సర్వం తానే అయిన ఆ పరమేశ్వరుణ్ణి ప్రార్థించండి.

**తమసో మా జ్యోతిర్గమయ** అని ప్రార్థించండి
**అసతో మా సద్గమయ** అని ప్రార్థించండి
**మృత్యోర్మా అమృతం గమయ** అని ప్రార్థించండి

మీకు భగవంతుడు కనబడక పోయినా వినబడక పోయినా ప్రార్థన చేయండి. మీకు తోచిన మాటల్లో భక్తితో ప్రార్థించండి. ఆయనకు వినబడుతుంది.

**త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనమ్**
**ఉర్వారుకమివ బంధనాన్మృత్యోర్ముక్షీయ మాఽమృతాత్**
**ఋతగ్ం సత్యం పరంబ్రహ్మ పురుషం కృష్ణపింగళం**
**ఊర్ధ్వరేతం విరూపాక్షం విశ్వరూపాయ వై నమః**

అని భగవంతుణ్ణి స్మరించే శ్లోకాలు చెప్పి భర్త మనస్సును దేవుని మీదికి మళ్ళించింది. ఆ తరువాత మూడు రోజులకు భర్త చనిపోయాడు. నకులమాత 'లబోదిబో' అని ఏడవలేదు. అక్కనపక్కన ఉన్నవాళ్ళే కొందరు స్త్రీలు శవాన్ని చూసి వాళ్ళ జీవితంలోని వియోగ సంఘటనల జ్ఞాపకాలు హృదయాన్ని కెలకగా కంటతడి పెట్టారు - నకులమాత భర్త పోయాడని కాదు. నకులమాత, భర్త శవాన్ని ఎక్కువసేపు ఇంటివద్ద ఉంచలేదు. శ్మశానానికి వేగిరంగానే చేర్చివేసి దైనందిన పనుల్లో నిమగ్నమయింది. ఒక ముసలావిడకు నకులమాత మనస్సు, గతి తప్పిందేమో (abnormal) అనిపించి "ఏమ్మా, భర్తపోతే నీకు చీమ కుట్టినట్లైనా లేదే" అనింది. "నా జీవిత క్రీడారంగంలో భర్తతో ఆడవలసిన క్రీడ (game) ఆ

క్షణంతో ముగిసింది. ఆ ఆట అయ్యాక కూడా "అది ఇంకా కొనసాగి ఉంటే బాగుండును కదా" అని వాస్తవాలకు విరుద్ధంగా ఆలోచిస్తూ ఏడుస్తూ ఉండమంటావా? ఆపైన ఆడవలసిన ఆటల సంగతి ఏమిటి? ఏడుస్తూ కూచుంటే బాగా ఆడగలనా? బుద్ధభగవానుడు చెప్పిన నియమాలు పాటిస్తూ ఇంకా ఆడవలసిన ఆటలు ఆడుతూ పోవడమే. నాకూ ఏడుపు వస్తుంటుందిలే. కడుపునొప్పి వస్తేనో పెద్ద గాయం తగిల్తేనో" అనింది నకులమాత.

నకులమాతకు ఇద్దరు పిల్లలు. వాళ్ళను చక్కగా పెంచి పెద్ద జేసింది. "ఇతరులతో మిమ్మల్ని పోల్చుకొంటూ జీవించకండి. మీకు మీరుగా జీవించండి. ఎవరినీ అనుకరించకండి. (imitate చేయకండి). కమలం ఒక విధంగా మల్లె ఒక విధంగా గులాబీ ఒక విధంగా ఉంటాయి. ఒకదాన్ని ఒకటి అనుకరించవు. అలాగే మీరూ మీ మీ స్వభావానుసారంగానే జీవితంలో వికసించండి" అని ఉద్బోధిస్తూ ఉండేది. అమ్మాయి పెద్దయ్యాక ఆమె కోరుకొన్న వరునికిచ్చి పెండ్లి చేసి పంపివేసింది. అబ్బాయి జేతవనం వెళ్తానన్నాడు. "మంచిది, వెళ్ళు నాయనా" అనింది. అబ్బాయి పేరు నకులుడు.

నకులుడు 18వ ఏట జేతవనంలో చేరాడు. 26వ ఏట భిక్షువయ్యాడు. మరో రెండేండ్లు కొనసాగాడు. ఆ తరువాత అతని జీవితంలో ఒక విధమైన అకర్మణ్యాత (stagnation) ఏర్పడిపోయింది. యాంత్రికంగా నీరసంగా అభివృద్ధి శూన్యంగా జీవిస్తున్నాడు. పారాజికలలో* (defeats) మొదటి పారాజిక మీద ఎక్కువ ఆలోచన చేస్తున్నాడు.

---

* *భిక్షుసంఘం నుండి వెలివేతకు (expulsion) దారి తీసే నాలుగు అత్యయములకు (transgressions) పారాజికలని పేర్లు 1. మైథున సమాచారం, 2. హత్య చేయడం, 3.స్తేయం, 4. డాంబికాలు పలకడం (unjustified claims to super normal powers). పారాజికదోషానికి పాల్పడి వెలివేతకు గురియైనవానికి మళ్ళీ పునఃప్రవేశం (బ్రహ్మ సహంపతి వచ్చి నచ్చజెప్పినా (recommend చేసినా) లభించదు. పారాజికదోషం లేకుండా ఐచ్ఛికంగా బైటకు వెళ్ళిపోయి మళ్ళీ మనసు*

→

వాస్తవంగా (in actuality) ఎదురయ్యే సమస్యకన్నా ఆలోచనలో ఎదురయ్యే సమస్యే పెద్ద భూతం లాగా ఉంటుంది. "జీవితాంతం ఇలానే ఉండిపోవాలిగదా" అనే ఊహ అతని పాలిట భూతం అయ్యింది. ఒకనాడు నకులుడు రంగు వేయని రెండు గుడ్డలను చంకలో బెట్టుకొని జేతవనం వదలి ఇంటికి వెళ్ళిపోయాడు.

నకులుడు రెండు వారాలకు పైగా ఇంటివద్దే ఉన్నాడు. వేళవేళకు ఇంటికి వచ్చి తల్లి చేతి భోజనం తృప్తిగా తిని ఎక్కడికో వెళ్ళిపోయేవాడు. "ఎక్కడికి పోతున్నావు? ఎక్కడ్నుంచి వస్తున్నావు? రాత్రి ఎక్కడున్నావు?" ఇలాంటి ప్రశ్నలు ఏమీ నకులమాత అడగలేదు. ఒకనాడు నకులుడు తల్లి పాదాలకు నమస్కరించి "అమ్మా నేను జేతవనం వెళ్ళి ఒకటో తరగతిలో మళ్ళీ చేరుతాను. ఆశీర్వదించు" అన్నాడు. "అనివర్తుడవై వర్ధిల్లు నాయనా" అని దీవించింది. నకులుడు అప్పటికి పదేండ్లు జేతవనంలో ఉండినవాడైనప్పటికీ అతణ్ణి కొత్తవానిగానే తీసుకొని ప్రవ్రజ్య ఇచ్చి ఒకటో తరగతికి పంపారు. "ఒకటో తరగతిలో చేరవలసివచ్చిందే" అని అతను కౌకృత్యం (regret) అణుమాత్రం కూడా చెందలేదు. హోదాలు, పదవులు, అధికారాలు, గుర్తింపులు, యోగ్యతాపత్రాలు కాదు తనకు కావలసింది. అదంతానూ అతని దృష్టిలో పరమ చెత్త. అధ్యాత్మ వికాసమే (inward flowering) అతనికి పరమ ముఖ్యం. ఎనిమిదేండ్ల తరువాత అతనికి మళ్ళీ ఉపసంపద దీక్ష ఇచ్చారు. నకులుడు శేషజీవితాన్ని అనివర్తుడుగానే (వెనక్కి తిరిగిరానివాడు = non-back slider) జీవించాడు.

ఒకనాడు నకులమాత ప్రస్తావన వచ్చినపుడు బుద్ధుడు క్రింది శ్లోకాలు చెప్పాడు

---

*మార్చుకొని వచ్చినవాళ్ళకు పున: ప్రవేశం ఉంటుంది. ఒకసారే కాదు, ఏడు సార్లు కూడా పున:ప్రవేశం లభిస్తుంది. కానీ వాళ్ళు ఎంత సీనియర్ అయినా మళ్ళీ వాళ్ళు ఒకటో తరగతిలోనే చేరవలసి ఉంటుంది. డాంబికాలు పలికే ఉదయి తప్పక వెలివేతకు గురి అవుతాడు. కానీ నా అవసరం కోసం అతణ్ణి భిక్షు సంఘంలోనే ఉంచుతున్నాను. (చూడుడు ధర్మపదం కథలు ఈ పుస్తకంలోనూ ఉదయి కథ ఉన్నది.)*

సంప్రబుద్ధం ప్రబుధ్యంతే సదా గౌతమశ్రావకాః
యేషాం దివా చ రాత్రౌ చ నిత్యం బుద్ధగతా స్మృతిః 21-7

సంప్రబుద్ధం ప్రబుధ్యంతే సదా గౌతమశ్రావకాః
యేషాం దివా చ రాత్రౌ చ నిత్యం ధర్మగతా స్మృతిః 21-8

సంప్రబుద్ధం ప్రబుధ్యంతే సదా గౌతమశ్రావకాః
యేషాం దివా చ రాత్రౌ చ నిత్యం సంఘగతా స్మృతిః 21-9

సంప్రబుద్ధం ప్రబుధ్యంతే సదా గౌతమశ్రావకాః
యేషాం దివా చ రాత్రౌ చ నిత్యం కాయగతా స్మృతిః 21-10

సంప్రబుద్ధం ప్రబుధ్యంతే సదా గౌతమశ్రావకాః
యేషాం దివా చ రాత్రౌ చ అహింసాయాం రతం మనః 21-11

---

*Note:-* కొందరు *puritans* కి నకులమాత నచ్చకపోవచ్చు. ఆమెను ఉపాసకురాలుగా చెప్పడం, మళ్ళీ *old culture* లోనే ఆమెను ఉంచడం నచ్చకపోవచ్చు. నాకున్న కొద్దిపాటి చారిత్రక అవగాహన ఆధారంతో నకులమాతను చిత్రించాను. బౌద్ధాన్ని మతం అనడం మహాపచారం. వాడుకలో ఉన్న పదమని వాడడమే. ఉపాసకులకు పంచశీల మరికొన్ని నియమాలు మాత్రం చెప్పి వాళ్ళను *first class citizens* చేయడం వరకే బౌద్ధం చేసింది. స్వంత సంస్కృతిని పాతిపెట్టి వేరే సంస్కృతిని దిగుమతి చేసుకోమని బౌద్ధం కోరదు. వేషం, భాష వగైరా కూడా మార్చుకోవాలని కోరదు. ఆచార వ్యవహారాలను మార్చుకోమని కోరదు. ఒక్క మాటలో చెప్పాలంటే చుట్టూ వున్న లౌకిక వ్యవస్థతో *(secular field)* ఘర్షణ పడలేదు. *worldly interests* ప్రధానంగా కలిగి ఉంటేనే ఘర్షణ. బౌద్ధం *unworldly* కనుక ఏ లౌకిక వ్యవస్థతోనూ ఘర్షణ పడలేదు. కులవ్యవస్థ మీద ధ్వజం ఎత్తినట్లుగానూ మనకు కనిపించదు. కేవలం భిక్షుసంఘం వరకు అది లేకుండా చేసుకోవడం మాత్రం జరిగింది. భర్తృహరి (సుభాషిత గ్రంథకర్త) ఏడుసార్లు శైవాన్నుండి బౌద్ధానికి బౌద్ధాన్నుండి శైవానికి మారినట్లు కథ ఉన్నది. నకులుడు ఒకసారి మాత్రం బైటకు వెళ్తే భర్తృహరి ఏడుసార్లు వెళ్ళి వచ్చాడు. శృంగార శతకం వ్రాయకముందా వ్రాశాకనా చెప్పడం కష్టం. వాక్యపదీయం వ్రాసిన భర్తృహరి కూడా ఇతనే అని చెబితే మరీ మంచిదే. వాక్యపదీయం రచించిన చోటు నాలంద విశ్వవిద్యాలయం. అమరకోశం వ్రాసిన అమరసింహుడు బౌద్ధుడే. ఏ విశ్వవిద్యాలయం వాడో తెలియదు. కాశికావృత్తికారుడూ బౌద్ధుడేనట !

***సంప్రబుద్ధం ప్రబుధ్యంతే సదా గౌతమశ్రావకాః***
***యేషాం దివా చ రాత్రౌ చ భావనాయాం రతం మనః*** **21-12**

బుద్ధానుస్మృతి (mindfulness), ధర్మానుస్మృతి, సంఘానుస్మృతి, కాయగతస్మృతి (mindfulness of body), అహింసారతి (delight in being compassionate) భావనారతి (delight in meditation) ఎల్లవేళల కలిగియున్నట్టి గౌతముని శిష్యులు సంప్రబుద్ధులనియే (well awakened) చెప్పవలెను. వాళ్ళు ఎల్లప్పుడూ జాగరూకులై (ever arise) ఉంటారు.



# సుభద్ర

సుదత్తుడు (అనాథపిండదుడు), హరిభద్రుడు చిన్ననాటి స్నేహితులు. అనేక విషయాల్లో విభేదిస్తారు. కానీ స్నేహితులే. ఒకనికి పురూరవ వంశీయుల కథలు ఇష్టం, మరొకనికి ఇక్ష్వాకు వంశీయుల కథలు ఇష్టం. ఒకనికి నియంతృత్వ పాలన ఇష్టం, మరొకనికి గణతంత్ర పాలన ఇష్టం. ఒకనికి ఆమ్రపాలి ఇష్టం, మరొకనికి సిరిమ ఇష్టం. ఒకనికి జానపదం ఇష్టం, మరొకనికి శాస్త్రీయం ఇష్టం. ఒకనికి బౌద్ధం ఇష్టం, మరొకనికి జైనం ఇష్టం. ఇన్ని అభిప్రాయభేదాలున్నా మంచి స్నేహితులు. ఆ స్నేహాన్ని మరింత పటిష్టం చేసుకొనేందుకు వియ్యంకులుగానూ అయ్యారు. సుదత్తుని కుమార్తె సుభద్రను హరిభద్రుడు కోడలిగా ఇంటికి తెచ్చుకొన్నాడు.

రమణక నగరంలో సుభద్రకు అన్నీ బాగానే ఉన్నాయి కానీ ఒక వెలితి బాధిస్తున్నది. బౌద్ధ కేంద్రమైన శ్రావస్తిలో పుట్టి పెరిగి ఇప్పుడు బుద్ధకాంతారదేశంలో (బుద్ధుని గురించి, బుద్ధుని ఉపదేశాల గురించి తెలియని దురదృష్ట దేశం) జీవించడం ఆమెకు కషాయం త్రాగినట్లనిపిస్తున్నది. కరవీకపక్షి* సుమధుర స్వరాన్ని వీనుల విందుగా విన్నవారికి గార్దబ స్వరం రుచిస్తుందా?

---

** కరవీకపక్షి హిమాలయం అడవుల్లో ఉంటుంది. చెట్టుకొమ్మలో బాగా మాగిన తియ్యని మామిడి పండును ముక్కుతో పొడిచి బొట్టు బొట్టుగా జారుతున్న రసాన్ని గ్రోలుతూ రెక్కలు విచ్చి ఆనందంతో గొంతు విప్పి సుమధురంగా గానం చేస్తుంది. ఆ గానమాధుర్యానికి (కరవీకపక్షి హర్షంతో చేసే కంఠధ్వనికి) పరిసరాలన్నీ ఒక్కసారిగా స్తంభించిపోతాయి. పచ్చిక మేస్తున్న పశువుల నోటి నుండి పచ్చిక జారిపోతుంది. బాణంలా లక్ష్యం మీదికి దూసుకుపోతున్న వేట జంతువులు (beasts of prey) తక్కున ఆగిపోతాయి. వేటాడబడేవీ ఆగిపోతాయి. ఆకాశంలో ఎగురుతున్న పక్షుల రెక్కలు, నీటిలో ఈదుతున్న చేపల రెక్కలు చలనం ఆగిపోతుంది. కోతులున్నూ చపలత్వాన్ని వీడి యోగుల్లా ఉండిపోతాయి. బుద్ధుని కంఠస్వరానికి పోలిక కరవీకపక్షి కంఠస్వరమే అని సంప్రదాయ వాక్యం.*

ఒకనాడు ఆమె ప్రాసాదతలం మీదికి పోయి శ్రావస్తి దిక్కుగా చూస్తూ, "భగవాన్, అర్హతా, సమ్యక్ సంబుద్ధా, విద్యాచరణసంపన్నా, సుగతా, లోకవేత్తా, పురుషదమ్యసారథీ, దేవమనుష్యాణాం శాస్తా, సంసారాటవీపథికజన సార్థవాహా, నా భాగ్యమేమిట్లున్నది? క్షణసంపత్తి (favourable conditions for religious life) నుండి అక్షణ సంపత్తికి (unfavourable conditions) వచ్చి పడ్డాను. శత్రు (క్లేశ) సంహార విద్యను ఇక్కడెవరు నేర్పుతారు? వీర్యంతో (energy, enthusiasm, effort, endeavour) లేచి, శీలం అనే పాదాల మీద నిలబడి శ్రద్ధ అనే చేతితో ప్రజ్ఞ అనే గొడ్డలి తీసుకొని అజ్ఞానం అనే వృక్షాన్ని నఱకమని ఇక్కడ ఎవరు ఉద్బోధిస్తారు? శాశ్వతవాద ఉచ్ఛేదవాద అగాధాల్లో పడవద్దని హెచ్చరించే వాళ్ళెవరున్నారిక్కడ? దేహాన్ని లాలించనూ వద్దు కష్టపెట్టనూ వద్దు అని మంచి మాటలు చెప్పే దిక్కెవ్వరిక్కడ? బారెడు దేహాన్ని మాత్రమే కథా వస్తువుగా (subject of the discourse) తీసుకొని ఒక అంగుళం దాటి అవతల పోకుండా మొత్తం అధ్యాత్మ విద్యను చెప్పగలిగే దేశికులెవ్వరున్నారిక్కడ? ("అస్మిన్నేవ రోహితాశ్వ, వ్యామమాత్రే కళేవరే లోకం ప్రజ్ఞపయామి, లోకసముదయం చ...") ఈ బుద్ధకాంతారదేశవాసుల్ని చూసి నాకు జాలి వేస్తున్నది. ఈ జనులు కూడా మీ అమృతవాక్కులు విని బాగుపడాలి. ఈ ప్రాంతాన్ని ఎందుకు ఉపేక్షిస్తున్నారు? ఆదరణ చూపేవాళ్ళు లేరనియా? నేనున్నాను. మీకూ మీ భిక్షు సంఘానికి ఏ లోటు రానీయకుండా చూసుకొంటాను. మీరు అభిజ్ఞా సంపన్నులు. నా ప్రార్థన వినే ఉంటారు. మళ్ళీ మళ్ళీ ప్రార్థిస్తున్నాను. ఇక్కడికి సత్వరం రావాలి. మిమ్మల్ని చూసి మీ వాక్కులు విని మీకు ఆతిథ్యం ఇచ్చిగానీ నేను భుజించను-ప్రాణం పోయినా సరే. ఇక మీ ఇష్టం" అని ప్రార్థన చేసింది.

ఆమె ప్రార్థనాబలమో మరి కాకతాళీయమో తెలియదు. మరునాటి సాయంకాలానికి బుద్ధుడు ఆ నగరంలోకి భిక్షు సంఘంతో ప్రవేశించాడు. నేరుగా ఆమె ఇంటికే భిక్షకు వచ్చాడు. సుభద్రకు బోధ చేస్తూ "నీవు మీ నాన్న వద్ద

అల్లారుముద్దుగా పెరిగినదానవు. బైట ప్రపంచం మీ ఇల్లులాగానో లేదా మీ ఊరులాగానో ఉండదు. నీకు నచ్చని అంశాలు లక్షలుంటాయి. సర్దుకుపోవడం నేర్చుకోవాలి. భూమి ఒక చోట సమతలంగా ఉంటుంది, మరో చోట ఎత్తు పల్లాలుగా ఉంటుంది; ఒక చోట పూలపాన్పులాగా మెత్తగా ఉంటుంది, మరో చోట కంటకమయంగా ఉంటుంది. మొత్తం భూమిని నీకు అనుకూలమైన సమతలంగా మార్చుకోవడానికి సాధ్యమా? మొత్తాన్ని దళసరి తోలుతో కప్పగలవా? అంత తోలు లభ్యమౌతుందా? ఒకవేళ లభ్యమైనా కప్పడం సాధ్యమా? కనుక ఉపాయం అవలంబించాలి. భూమి ఏవిధంగా ఉన్నా సుఖంగా నడిచిపోవడానికి ఉపాయం జత చెప్పులు. అలాగే జీవితంలో ఏ క్లిష్టపరిస్థితినైనా అధిగమించడానికి ఉపాయం కుశలచిత్తం (skillful mind, wholesome mind, healthy mind). కనుక నీవు నీ చిత్తాన్ని చక్కగా ఉంచుకొంటే నీకు శ్రావస్తియైనా ఒకటే, రమణక నగరం అయినా ఒకటే. శ్రావస్తిలో నీవు తరచు ఈ రూపకాయాన్ని చూశావు. ఇక్కడికి వచ్చాక చూడలేకున్నావు. నన్ను రూపకాయంలో దర్శించడం వద్దు. ధర్మకాయంగా చూడు. ధర్మకాయం ఎప్పుడూ ఉండేది. ఈ రూపకాయం కొన్నాళ్ళకు శిథిలమై అంతరించిపోయేదే. సాధుజనులు ఒకరికొకరు దూరం అనిపించరు. అసజ్జనులే దగ్గరున్నా దూరం అనిపిస్తారు" అని క్రింది శ్లోకం చెప్పాడు.

***దూరే సంతః ప్రకాశంతే హిమవంత ఇవ పర్వతాః***
***అసంతోఽ త్ర న దృశ్యంతే రాత్రిక్షిప్తా యథా శరాః*** **21-15**

హిమవంతం దూరంగా ఉన్నా కనిపిస్తున్నది కదా! అలాగే సజ్జనులున్నూ. చీకట్లో వేసిన బాణం దగ్గర్లోనే ఎక్కడో పడి ఉన్నా కనిపిస్తుందా? అలాగే అసజ్జనులున్నూ.

# బాలనక్షత్రం

ఒకసారి బుద్ధుడు కౌశాంబికి వచ్చాడు. ఆయన అడుగుబెట్టిన దినమే బాలనక్షత్ర (simpletons' holiday) వేడుకలు ఆ ఊరిలో ప్రారంభమయ్యాయి. "ఈ బాలనక్షత్రంనాడు మనం ఇక్కడెందుకు? మరో ఊరికి వెళ్దాం" అని ఆనందుడు సూచన చేసినా బుద్ధుడు సమ్మతించలేదు. ప్రజలు ఆ దినం అన్ని సంకోచాలను (inhibitions), కృత్రిమతలను, దంభాలను, భయాలను వదలివేసి స్వేచ్ఛగా ఆడుతూ పాడుతూ రంగులు చల్లుకొంటూ తిరుగుతారు. బైటివాళ్ళు ఆ వేడుకలను విచ్చలవిడితనం అని నిందిస్తారు.

బుద్ధుడు కౌశాంబిలో అడుగిడిన విషయం మాగంధియకు* తెలిసింది. వత్సరాజు ఉదయనుని చిన్న భార్య మాగంధియ. పెద్ద భార్య, పట్టమహిషి శ్యామావతి. బుద్ధుణ్ణి అవమానించి పంపాలని మాగంధియ తలచింది. ఆమెకు బుద్ధుని మీద ద్వేషమేమీ లేదు, గౌరవమూ లేదు. ఒక రకమైన ఉదాసీనత, అంతే. ఆమె ద్వేషమంతా ముక్కుపుటాల వరకు సవతి (co-wife) మీదనే. శ్యామావతి బుద్ధుణ్ణి అమితంగా గౌరవిస్తుంది. కనుక బుద్ధుణ్ణి అవమానించడం ద్వారా పరోక్షంగా శ్యామావతినీ అవమానించినట్లే అని భావించింది.

వీధిలో రంగుల డబ్బాలతో తిరుగుతున్న ఒక మూకను తన వద్దకు రప్పించుకొని వాళ్ళకందరికీ నాణాలు ఇచ్చి "ఇక మీరు వేరే అల్లర్లు అన్నీ మానేసి ఈ దినం నేను చెప్పినట్లు చేయాలి. బుద్ధుణ్ణి బాగా తిట్టాలి కానీ ఆ తిట్టడం గ్రామ్య భాషలో వద్దు. శిష్టవ్యావహారికంలోనే తిట్టాలి. ఎలా తిట్టాలో నేను

---

* చూడుడు మాగంధియుడు కథ అలాగే చూడుడు శ్యామావతి కథ.

నేర్పుతాను. ఆ ప్రకారమే తిట్టండి" అని వాళ్ళచేత తిట్టు పదాలను బాగా పురశ్చరణ (rehearsal) చేయించి పంపింది. ఆ పదాల్లో ఒక పదం తిట్టుపదం కాదని ఆమెకు తెలియదు. (చూడుడు సుభద్ర శీర్షికలోని పాదపీఠిక).

ఆ అల్లరిమూక జట్టు జట్టుగా విడిపోయి బుద్ధుడు వస్తున్న దారిలో ఆయన రాకకై ఎదురు చూస్తూ దూర దూరంగా నిలుచున్నారు. రాగానే తిట్లవర్షం మొదలయ్యింది. "శ్మశానసంచారీ, నీకు నమస్కారం"; "పైండపాతిక భిక్షుకా, నీకు నమోవాకం"; "దైవదూషకాగ్రణీ, నీకు నమస్సు"; వేదనిందకతిలకా, నీకు వందనం"; "బృహస్పతి పుత్రా నీకు ప్రణామం"; "నాస్తికశిరోమణీ, నీకు ప్రణతి"; "వంచనా పుంగవా, నీకు అంజలి"; "మాయావీశేఖరా, నీకు జోహారు"; "కుపథగామీ, నీకు జోత"; "వైతండికావతంసమా, నీకు జేజే"; "మోహపురుషవరా, నీకు దోసిలి"; "మిథ్యాజీవప్రతిపాదకా, నీకు కైజోడింపు"; "అంధవచనభూషణా, నీకు డింగిడీలు"; "పండితంమన్యశ్రేష్ఠా, నీకు డింగిళ్ళు"; "వర్ణవ్యవస్థాభంజకా, నీకు వెన్నెల"; "కరవీకపక్షీ, నీకు ఏటికోళ్ళు".

ఊరు బయటకు వచ్చాక ఆనందుడు "నేను మొదటే చెప్పాను గదా! నా మాట విన్నారా? తెలిసి తెలిసి ఎందుకు ఊర్లోకి పోవాలి ఆ తిట్లు తిని రావాలి" అన్నాడు కాస్త బాధగానూ నిష్ఠూరంగానూ. "నీవు ఆ పదాలను విని వాటికి తిట్టు పదాలు అని పేరు పెట్టుకొని బాధ పడుతున్నావు. నేను ఆ పదాలను కేవలం విన్నాను. వాటికి తిట్టు పదాలనీ పేరు పెట్టలేదు (naming చేయలేదు), స్తుతిపదాలనీ పేరు పెట్టలేదు. అయోనిశ మనస్కారం (improper attention) వల్ల, వినికిడి నుండి నీవు వేగంగా తీర్మానాల్లోకి (judgement or interpretation) వెళ్ళిపోయావు. నేను యోనిశ మనస్కారం (proper attention) ద్వారా వినికిడిని వినికిడిగానే నిలిపి ఉంచాను, తీర్మానాల్లోకి దూకలేదు" అని క్రింది శ్లోకాన్ని చెప్పాడు.

***అహం నాగ ఇవ సంగ్రామే చాపతః పతితం శరమ్***
***అతివాక్యం తితిక్షిష్యే దుశ్శీలో హి బహుజనః*** 23-1

యుద్ధభూమిలో ధనుస్సు నుండి వెలువడిన బాణాల దెబ్బలను సహించే ఏనుగులాంటివాడను నేను. జీవితం ఒక సంగ్రామం. దూషణలనేవి ఎదుటివాని నోరు అనే వింటి నుండి వెలువడే బాణాలు. వాటిని తట్టుకొని నిలబడడమే వీరుని లక్షణం. చాలా మంది జనులు దుశ్శీలురు. ఏమి చేస్తాం?

---

Note : *తిట్లకు బాధపడడం, పొగడ్తలకు ప్రీతి చెందడం మన అందరికీ అనుభవమే. బుద్ధుడు Super Man. దేహం మనలాంటిదే అయినా ఆయన consciousness తీరే వేరు. ఆ Super Consciousnessకే ధర్మకాయం అని పేరు. ఆ ధర్మకాయం నుంచే world saving message వచ్చింది. "బుద్ధం శరణం గచ్ఛామి" అనేటప్పుడు ధర్మకాయాన్నే శరణు కోరేది, రూపకాయాన్ని కాదు. ఆ ధర్మకాయానివే దశ బలములు (ten powers), 18 ఆవేణిక ధర్మాలు (special, unique, uncommon qualities), నాలుగు వైశారద్యములు (confidences), షడభిజ్ఞలు (six super knowledges). ఆక్రోశక భారద్వాజుడు తిట్టినా వికారం చెందలేదు (చూడుడు ధర్మపదం కథలు). మాగంధియ మనుషులు తిట్టినా వికారం చెందలేదు. నదీ ప్రవాహంలో ఏమేమో కొట్టుకొని వస్తాయి. మహాశిల కొట్టుకొని రావడం కనబడుతుందా? తిట్ల జల ప్రవాహం ఎంత వేగంగా ఉధృతంగా మీదికి వచ్చినా చలించని మహాశిలలాంటివాడు బుద్ధుడు. త్రిభువన సకల జీవులను ప్రియైక పుత్రుని చూసినట్లుగా చూసే ఆ ధర్మకాయునికి ప్రజల తిట్ల వలన బాధ కలుగుతుందా? అసంభవం. తల్లినో అక్కనో అనుకరిస్తూ పసిపాప ఒక చేతితో అద్దం త్రిప్పి పట్టుకొని మరో చేత్తో దువ్వెనను తలక్రిందులుగా తలమీద ఉంచుకొని పైకి క్రిందకు జరుపుకొంటూ ఉండే అనుకరణశీలియైన ఆ చిన్ని పాప మనల్ని చూసి సీపోగడా (ఛీ పో గాడిదా) అంటే మనకు కోపం వస్తుందా? రాదు, పైగా ముచ్చటగా ఉంటుంది. అలాగే జనుల అనుచిత ప్రవర్తన మహాత్ములకు బాధ, కోపం కలిగించదు.*

# ధనపాలుడు

ధూమవాహనుడు శ్రావస్తిలో ప్రసిద్ధుడైన ఒక గోఘాతకుడు (butcher). ధర కొంచెం ఎక్కువ ముట్టజెప్పడమేగాక పైకం అక్కడికక్కడే చెల్లించివేసేవాడు గనుక ఎప్పుడూ అతని ఇంటి ముందు నిర్భాగ్య పశువులు ఐదో పదో తమ వంతు కోసం ఎదురు చూస్తున్నట్లుగా కనబడేవి. ఒనాడు పని మీద అతను ఆ వీధిలో నడుస్తూ తన ఎఱ్ఱని తలపాగాను ఊడదీసి విదిలించి మళ్ళీ గట్టిగా తలకు చుట్టుకుంటుండగా ఒక ఆబోతు అతణ్ణి చూసి కాలు దువ్వి రంకె వేస్తూ ఒక్క పరుగులో అతని మీదికి వచ్చి బలమైన పొట్టి కొమ్ములతో అతణ్ణి పైకి కుమ్మింది. ఆ విసురుకు అతని శరీరం ఈతచెట్టు అంత ఎత్తుకు అడ్డంగా ఎగిరి అక్కణ్ణుంచి ఒక బండ మీదకు పడింది. పడిన క్షణంలోనే శరీరం శవంగా మారింది.

తన కుటుంబానికి, కులవృత్తికి ఇదొక అపశకునంగా భావించి అతని భార్య, పిల్లవాణ్ణి వాయువేగుణ్ణి తీసుకొని తన అమ్మగారి ఊరైన తక్షశిల చేరింది. వాయువేగుణ్ణి ఒక కంసాలి వద్ద అంతేవాసిగా (apperentice) చేర్పించింది. అతను ఆ వృత్తిని బాగా నేర్చుకొని అందులోనే స్థిరపడి వయస్సు వచ్చాక వివాహం చేసుకొని కొన్ని సంవత్సరాలకు ఇద్దరు పిల్లల తండ్రి అయ్యాడు. వృత్తి-సంపాదన-ఇల్లు-కుటుంబ పోషణ ఇది తప్పించి అతను మనస్సును ఇంక దేనిమీదా మళ్ళించింది లేదు. సుప్రియుడు, సుభటుడు ఎదిగి పెద్దవాళ్ళయ్యాక అతడు కుటుంబాన్ని శ్రావస్తికి మార్చాడు. ఆనాడు శ్రావస్తి, దేశంలోని ముఖ్య పట్టణాల్లో ఒకటిగానూ బౌద్ధానికి ప్రధాన కేంద్రంగానూ ఉండినది. నగరానికి ఒక వైపు విశాఖ కట్టించిన పూర్వారామం, మరో వైపు అనాథపిండదుడు కట్టించిన జేతవనం

ఉండడం ఆ నగర ప్రత్యేకత. బుద్ధుడు ఎక్కువ వర్షావాసాలు (rainy season retreats) శ్రావస్తిలోనే గడిపాడు.

సుప్రియుడు, సుభటుడు శ్రావస్తిలో త్వరలోనే ఉద్యోగాలు సంపాయించు కొన్నారు. వాళ్ళిద్దరి మధ్య వయస్సులో పెద్ద తేడా లేదు గనుక స్నేహితులువలె మెలగుతూ ఒరే ఒరే అని ఒకర్నొకరు పిలుచుకొంటారు. ఒకనాడు సుభటుడు అన్నతో "రే సుప్రియా, మన బ్రతుకు నాన్నగారి బ్రతుకులాగా భౌతికపరిధిలోనే (materialistic గా) గడిచి పోరాదు. బుద్ధునికి ఉపాసకులవుదాము" అన్నాడు. తరువాత ఒకనాడు వాళ్ళిరువురూ జేతవనం వెళ్ళి త్రిరత్నశరణు పొంది ఉపాసకులయ్యారు. తమ ఆహ్వానాన్ని మన్నించి ఒకనాడు ఇంటికి ఏతెంచిన బుద్ధుణ్ణి వారిరువురూ పరమ భక్తితో సేవించి ఇలా మనవి చేశారు : "మా నాన్న ఎంత దౌర్భాగ్యుడో చూడండి. మీరు వచ్చిన సమయంలోనూ ఇంటి వద్ద లేకుండా ఎక్కడో పెత్తనాలు చేస్తున్నాడు. మాకైతే, అతని జీవితానికి గానుగెద్దు జీవితానికి వ్యత్యాసం కనబడటం లేదు. కుటుంబ లంపటం మోతాదుకు మించి పెంచుకొని ప్రొద్దస్తమానం శ్రమిస్తూనే ఉంటాడు. 'సంపాయించింది చాల్లే. ఇకనైనా కృష్ణా రామా అనుకో' అంటే వినడు. భోజనానికి వస్తాడు. ఆదరాబాదరా నాలుగు ముద్దలు మింగి కడిగిన చేయి ఆరకముందే పరుగు! 'నాకూ నా పిల్లలకి ఏమిటి సంబంధం? నేనూ వాళ్ళూ ఏకమూ కాదు వేరూ కాదు' అనే అవగాహన అతనికి లేదు. తాదాత్మ్యభావం ఎక్కువ పెంచుకొని స్వీయజీవితానికి నష్టం కలిగించుకొంటున్నాడు. అతను ఇంటికి వచ్చే వేళయ్యింది. మీ ముందు కూర్చోబెట్టుతాము. అతను కళ్ళు తెరిచేలా బోధనను అనుగ్రహించండి" అని ప్రార్థించారు.

"అతను వస్తే ఏదైనా చెబుతాను కానీ దానివల్ల అతనిలో పూర్ణ విప్లవం కలిగిపోతుందని ఆశలు మాత్రం పెట్టుకోకండి. అతను ఎలా జీవించినా అంతా మీ కోసమే జీవించాడు. స్వార్థం అనే క్రింది మెట్టునుండి త్యాగం అనే పై

మెట్టుకు అతను వచ్చినట్లేకదా! అతని ధోరణిలో అతణ్ణి జీవించనివ్వండి. శక్తి ఉడిగాక మీరు చెప్పనవసరం లేకుండానే ఇంట్లోనే పడివుంటాడు. అప్పుడు అతని మనస్సుకు గాయం కలుగకుండా మీరు చూసుకోవాలి. 'నిరాదరింపబడుతున్నాను, ఉపేక్షింపబడుతున్నాను, నిర్లక్షింపబడుతున్నాను' అనే మానసిక బాధ అతనికి రాకుండా చూసుకోండి. 'ఓ ఊతకఱ్ఱా, నాకిద్దరు కొడుకులున్నారనే భ్రమలో ఇన్నాళ్ళున్నాను. భ్రమ వదలిపోయింది. నాకున్నది ఒక్క కొడుకే. అది ఎవరో కాదు, నీవే' అనే ఊతకఱ్ఱ సంబోధన అతని నోటినుండి రానివ్వకుండా చూసుకోండి. మీ తలిదండ్రుల పట్ల మీరు ధనపాల కుంజరంలాగా నడుచుకోవాలి. పూర్వం కోసలదేశరాజు హిరణ్యావర్మ వేటకై అడవికి వెళ్ళి అక్కడొక అందమైన గున్న ఏనుగును చూసి ముచ్చటపడి దాన్ని తన మనుషుల ద్వారా బంధించి ప్రసాదానికి తెచ్చుకొన్నాడు. ఆ గున్న ఏనుగు పేరు ధనపాలుడు. హిరణ్యావర్మకు ఆ ఏనుగుగున్న అంటే చాలా ఇష్టం కనుక సకల సదుపాయాలు కావించి శ్రేష్ఠమైన రుచికరమైన ఆహారం పెట్టించాడు. ధనపాలుడు ఆహారం ముట్టుకోలేదు. నీళ్ళు తాగలేదు. అడవివైపు తదేకంగా చూపులు నిలిపి అప్పుడప్పుడు దీనంగా ఘీంకరించడం చేస్తున్నాడు. హిరణ్యావర్మ నిపుణమతులైన మావటివాళ్ళను రప్పించే ప్రయత్నాలు చేస్తున్నాడేగానీ ధనపాలుని హృదయాన్ని చూడలేకపోయాడు. హిరణ్యావర్మ పట్టమహిషి హేమచూడ భర్తను అంతఃపురంలోకి పిల్చి మెల్లగా చీవాట్లు పెట్టింది. 'తిర్యక్కులకు కూడా హృదయం, ప్రేమ, అనుబంధాలు, భాష, భావాలు అన్నీ మనకులాగే ఉంటాయని తెలియని మూర్ఖుడిలా ప్రవర్తిస్తున్నావు. నీ రాజోపచారాలు ఆ ఏనుగు గున్నకు దూసితో సమానం. అతనికి కావలసింది తనవాళ్ళతో కలిసి జీవించడం. ఆ అడవిలో అతనికి ఎన్ని హృదయాను బంధాలున్నాయో! ముందు అతణ్ణి అడవిలో వదలిపెట్టిరా.' హేమచూడ సరిగ్గానే ఊహించింది. ధనపాలుడికి తల్లి మీద చాలా ప్రేమ. ఆ తల్లి వార్ధక్యంతో గ్రుడ్డిదై కదలలేక ఒక చోటనే పడి ఉంటుంది. ధనపాలుడు తల్లికి సకలపరిచర్యలు చేస్తూ స్నానానికి ఏటికి తీసుకుపోతూ

ఆహారం, వేళ వేళకు అందిస్తూ తల్లి సేవే పరమావధిగా జీవిస్తున్నాడు. అట్టివాణ్ణి రాజప్రసాదంలో బంధించి రాజోచిత మర్యాదలు చేస్తే అది అతనికిష్టమా? తల్లిని తలచుకొంటూ ఏడుస్తూ ఉండినాడు. ధనపాలుణ్ణి మీరు ఆదర్శంగా తీసుకొని మీ తల్లిదండ్రులను బాగా చూసుకోండి" అని క్రింది శ్లోకాన్ని చెప్పాడు:

***ధనపాలకో నామ కుంజరః కటుకప్రభేదినో దుర్నివార్యః***
***బద్ధః కబళం న భుంక్తే స్మరతి నాగవనస్య కుంజరః*** **23-5**

ధనపాలకుడనే ఏనుగు ఎన్ని బుజ్జగింపులకూ లొంగలేదు. బంధీగా ఉండి ఆహారం ముట్టలేదు. నాగవనాన్నే (తల్లి నివాసవనం) స్మరిస్తూ ఉండినాడు.

"*A married man with a family will do anything for money*" - *Tallyrand.*

Note : ఇంటికి వచ్చి వాయువేగునికి బుద్ధుడు చెప్పిన ఉపదేశ శ్లోకాలు :

*పై వాక్యం నుండి మంచి అర్థాన్నే లాగుతాను. పిల్లల పోషణ కోసం తండ్రి తన జీవితాన్నే త్యాగం చేస్తాడు. బౌద్ధికమైన (intellectual), ఆధ్యాత్మికమైన (spiritual) వ్యాపకాలనన్నిటినీ వాయిదా వేసుకొంటూ పూర్తి కాలాన్ని పిల్లల కోసమే వెచ్చిస్తాడు. అట్టి త్యాగమూర్తియైన తండ్రిని, అంతకన్నా ఇంకా ఎక్కువ త్యాగమూర్తియైన తల్లిని పిల్లలు పెద్దవాళ్ళయ్యాక ధనపాలునిలా చూసుకోవాలి. (అన్ని ఉపదేశాల్లో ఇతరులకు ఇవ్వడానికి అత్యంత తేలికయైన ఉపదేశం నా మటుకు నాకు ఇదే. ఎందుకనేది పాఠకులు సులభంగానే ఊహించగలరు!)*

*relationship అనే అంశం మీద చాలా ఆలోచించవలసియున్నది. బుద్ధుడు మరేదో ఒక అంశాన్ని వివరించడానికి ఉదాహరణగా ఒక stringed instrument విషయం తీసుకొంటాడు. దాన్నుండి చక్కని music రావాలంటే తీగ మరీ బిగువుగానూ ఉండరాదు. మరీ వదులుగానూ ఉండరాదు. మనుషుల మధ్య అనన్యభావన (identity) గాఢం అయిపోతే తీగ మరీ బిగువైపోయిందన్నమాట. music రాదు. అన్యభావన (difference) గాఢం అయిపోతే తీగ వదులైందన్న మాట. music రాదు. కనుక relationship నుండి good music రావాలంటే మధ్యేమార్గమే శరణ్యం, వేరే మార్గం లేదు. ఈ విషయంలో షోపెన్‌హావర్ మానవుల దుస్థితిని తెలుపడానికి ధృవప్రాంతంలోని ముళ్ళపందులతో మానవులను పోల్చి చెబుతాడు. ఆ ముళ్ళపందులు ఒకదానికొకటి మరీ దగ్గర కాలేవు, దూరమూ కాలేవు. మరీ దగ్గరగా జరిగితే ఒకదాని ముళ్ళు మరో దాన్ని సూదుల్లా పొడిచి బాధిస్తాయి. దూరంగా జరిగితే చలిబాధను తట్టుకోలేవు. కనుక అవి ఒకదాన్నొకటి అంటీముట్టనట్లుగా సర్దుకొని కూర్చుంటాయట!*

పాండు పలాశమివేదానీమసి యమపురుషా అపి చ త్వాముపస్థితాః
ఉద్యోగము ఖే చ తిష్ఠసి పాథేయమపి చ తే న విద్యతే 18-1

స కురు ద్వీపమాత్మనః క్షిప్రం వ్యాయచ్ఛస్వ పండితో భవ
నిర్ధూతమలో ఽ నంగణో దివ్యాం ఆర్యభూమిమేష్యసీ 18-2

ఉపనీతవయా ఇదానీమసి సంప్రయాతో సి యమస్యాంతికే
వాసో ఽ పి చ తే నాస్త్యంతరా పాథేయమపి తే న విద్యతే 18-3

స కురు ద్వీపమాత్మనః క్షిప్రం వ్యాయచ్ఛస్వ పండితో భవ
నిర్ధూతమలో ఽ నంగణో న పునర్జాతిజరే ఉపైష్యసి 18-4

పండుటాకు దశకు చేరావు. యమదూతలు కాచుకొనియున్నారు. మృత్యుద్వారం దగ్గర నిలిచియున్నావు. ఆపై ప్రయాణానికి నీవద్ద పాథేయం (provision) ఏమీ లేదు. నిన్ను నీవే సురక్షిత ద్వీపంగా (Island) మార్చుకొనుము. ప్రయత్నంలో వేగం చూపుము. బుద్ధిమంతుడవు కమ్ము. దోషరహితుడవు (purged of stains) అనంగణుడవు (passionless) అయినచో ఆర్యభూమిని (శుద్ధావాసదేవలోకాన్ని) చేరగలవు. నీ ఆయుష్షు చివరికి వచ్చేసింది. మృత్యువుకు చాలా సమీపంలో వచ్చేశావు. ఆపై ప్రయాణంలో నీకు విశ్రాంతి స్థానం ఏదీ లేదు. పాథేయం (provision) అసలే లేదు. నీకు నీవే ద్వీపాన్ని (Island) కలిగించుకొనుము. (make a firm support for yourself). ప్రయత్నంలో వేగం చూపుము. నిర్ధూతమలుడవు, అనంగణుడవు అయినచో మళ్ళీ నీకు జాతి జరా మరణములుండవు.

# పాలిలేయకం

కౌశాంబిలోని ఘోషితారామంలో భిక్షువుల మధ్య కలహాలు ముదురు పాకానికి వచ్చాయి. వినయధరులు, సూత్రధరులు అనే రెండు బలమైన వర్గాలుగా విడిపోయారు. అర్థరహితమైన ఈ విభేదాలతో అసలు విషయాన్ని మరచిపోకండని బుద్ధుడు హితవు చెప్పినా వాళ్ళ ధోరణిలోనే వాళ్ళుండిపోయారు. వర్షఋతువును అక్కడ గడపడానికి వచ్చిన బుద్ధుడు మౌనంగా అక్కడ్నుంచి ఆనందునికి కూడా చెప్పకుండా ఒంటరిగా పాలిలేయకవనం వెళ్ళిపోయాడు. బుద్ధుడెక్కడికి వెళ్ళింది కనుక్కోవడానికి ఆనందునికి రెండు నెలల సమయం పట్టింది. బుద్ధుడు పాలివేయకవనంలోకి వెళ్ళినట్టు తెలిసింది. ఆ వనం జనసంచారం లేని కీకారణ్యం. కనుక ఆ వనంలో బుద్ధుడున్న ప్రదేశాన్ని వెదకి తెలుసుకోవడానికి మరో నెల పట్టింది. తమ విభేదాల పట్ల బుద్ధుడు ప్రదర్శించిన ఈ విధమైన మౌననిరసనకు చలించిపోయిన ఘోషితారామ భిక్షువులు ఒకటయి క్షమాభిక్ష కోరడానికి ఆనందుని వెనుక నడిచారు.

పర్ణశాల కనిపించింది. పర్ణశాల ముందు బుద్ధుడు* కూర్చొని యుండడమూ కనిపించింది. ప్రక్కనే ఒక అడవి ఏనుగు కూర్చొని యుండడమూ కనిపించింది.

---

* మాట్లాడించేవాళ్ళెవ్వరూ లేనప్పుడు, ఏకాంతంగా ఉన్నప్పుడు బుద్ధుడు ఏమి చేస్తుంటాడు? అనే ప్రశ్న ఉదయిస్తుంది. గత అనుభవాల స్మృతులను నెమరవేసుకొంటూ ఉంటాడా? భవిష్యత్ కార్యక్రమం మీద ప్రణాళికా రచన (*planning*) చేసుకొంటుంటాడా? ఉపదేశాలు ఇంకాస్త భిన్నంగా పసందుగా కొత్త ఉపమానాలతో చెబుదామని ఆలోచిస్తుంటాడా? లేక ఏ చెట్టునో పువ్వునో ఆకునో మేఘశకలాన్నో దూరపుకొండల నునుపునో చూస్తూ 'ఆహా' అనుకొంటూ ఉంటాడా? సంప్రదాయ వాక్యం ఏం చెబుతున్నదంటే ఏకాంతంగా ఉన్నప్పుడు బుద్ధుడు శ్వాస నిశ్వాసలను గమనిస్తూ ఊరక కూర్చొనియుంటాడు అంటే ఆనాపానసతి (*mindfulness of breathing*) చేస్తుంటాడని చెబుతుంది.

ఈ అపూర్వదృశ్యం కనబడగానే ఆనందుడు పరవశించిపోయాడు. "ఎన్ని జన్మల తపఃఫలం ఈ అపూర్వదృశ్య వీక్షణభాగ్యం!" అనుకొంటూ క్రింద భూమిని చూసి నడవకుండా ఆ అపూర్వ దృశ్యాన్నే కళ్ళప్పగించి చూస్తూ ముందుకు నడిచాడు.

అభివాదనం చేశాక ఆనందుడు బుద్ధుణ్ణి కుశల ప్రశ్నలు వేస్తూ "ఈ కీకారణ్యంలో ఇన్నాళ్ళు మీరు ఎన్ని కష్టాలు పడినారో ఊహించలేకున్నాను" అన్నాడు గద్గదస్వరంతో.

బ్రహ్మవిహార (మైత్రి, కరుణ, ముదిత, ఉపేక్ష) సాకారమూర్తియైన బుద్ధుడు ప్రక్కనే ఉన్న ఏనుగు మీద చేయి ఉంచి "నాకిక్కడ చాలా సుఖంగా గడిచింది. అరణ్యంలోకి కాలు పెట్టి నాలుగడుగులు నడిచానో లేదో ఈ స్నేహితుడు (పాలిలేయక వనగజం) ఎదురయ్యాడు. ఇక్కడికి తీసుకొచ్చింది ఇతనే. పర్ణశాల వేసుకొనే ప్రయత్నం చేయగానే కావలసిన ఆకులు కొమ్మలు తీగలు అన్నీ తెచ్చి ఇచ్చాడు. వేళ వేళకు వనఫలాలు శాకమూ తెచ్చి భిక్షగా ఇస్తున్నాడు. స్నానం కోసం ఆ జలాశయానికి నడిచి వెళ్ళాలంటేనూ ఒప్పుకోడు. 'నామీద కూర్చో, తీసుకెళ్తాను' అన్నట్లుగా దారికడ్డంగా కూర్చొని నన్ను నడవనీయడు. ఇంత మంచి స్నేహితుడు లభించాక సుఖానికి ఏమి లోపం ఉంటుంది?" అని క్రింది శ్లోకాలు చెప్పాడు.

***స చేత్ లభేత నిపక్వం సహాయం***
***సార్థం చరం సాధువిహారి ధీరమ్***
***అభిభూయ సర్వాన్ పరిశ్రయాన్***
***చరేత్ తేనా ఽ త్తమనాః స్మృతిమాన్*** **23-9**

మంచినడత, తెలివి (ధీరత్వం) ఉన్న నిపక్వసహాయుడు (prudent / sagacious companion) లభిస్తే అన్ని అపాయాలను అధిగమించవచ్చు. అట్టివానితో చెలిమి మనస్సుకు ఆనందాన్నిస్తుంది, స్మృతిని (mindfulness) పెంచుతుంది.

*న చేత్ లభేత నిపక్వం సహాయం*
*సార్థం చరం సాధువిహారి ధీరమ్*
*రాజేవ రాష్ట్రం విజితం ప్రమాయ*
*ఏకశ్చరేత్ మాతంగో౽ రణ్య ఇవ నాగః* 23-10

...అట్టి స్నేహితుడు లభించకపోతే ఒంటరిగా జీవించడమే మంచిది. రాజ్యం పోగొట్టుకొన్న రాజు ఆ రాజ్యాన్ని వదలి ఎక్కడో ఒంటరిగా జీవిస్తాడు. అరణ్యంలో మాతంగం (ఒకజాతి ఏనుగు) ఒంటరిగానే జీవిస్తుంది.

*ఏకస్య చరితం శ్రేయో*
*నాస్తి బాలే సహాయతా*
*ఏకశ్చరేన్న చ పాపాని కుర్యాద్*
*అల్పోత్సుకో మాతంగో౽ రణ్య ఇవ నాగః* 23-11

మూర్ఖునితో సహవాసం కన్నా ఒంటరిగా ఉండడం మేలు. ఒంటరిగా ఉంటే పొరబాట్లు (errors = పాపములు) జరుగవు. మాతంగంలాగా ఏ ఆందోళనా లేకుండా గంభీరంగా జీవించాలి.



# కపిలుడు

చవట విద్యావిధానం లక్షలమంది విద్యార్థులను "వట్టిపదంగాళ్ళుగా" మార్చివేయగలదు కదా! ఆ లక్షలలో ఒకడు కపిలుడు. "శిరీషపుష్పం అంటే దిరిసెన పువ్వు" రకం చదువుగానే అతని చదువు ముగిసింది. శిరీషపుష్పం అంటే ఏమిటో తెలియకుండానే దిరిసెనపువ్వు అనే మరో పదం దానికి అర్థం అనుకొని అంటే పదానికి పదం అర్థం అనుకొనే రకమైన చదువే అతనికి విద్యాలయం నుండి సంక్రమించిన విద్య. కపిలుడు పాతికేండ్ల వరకు విద్యాలయంలో "దిరిసెనపువ్వు విద్యను" గడించి బైటకు వచ్చాడు. దిరిసెనపువ్వు విద్య బ్రతకడం నేర్పిన విద్య కాదు. పైగా క్లేశాలను (రాగ ద్వేష మోహాలను) పెంచి పోషించి బైటకు పంపిన విద్య. కనుక కపిలుడు నానా అవస్థల పాలై చివరకు జేతవనం చేరాడు. బాగానే ఉంది గానీ గట్టి పునాదుల దిరిసెన విద్యా ప్రభావం అతణ్ణి వదలలేదు. ఆ అలవాటు అట్లే కొనసాగింది, అంటే పదానికి పదం లేదా పదసముదాయం తెలిస్తే అర్థం తెలిసినట్లు అనే అలవాటు. రాగద్వేషాలతో వచ్చినవాడు కనుక ఆ ప్రభావం కూడా పని చేసి ఇతరుల పట్ల స్పర్ధ (పోటీ మనస్తత్వం) పెంచుకొన్నాడు. అప్పటికి జేతవనంలో మహాకొష్ఠిలుడు, పూర్ణుడు, శారిపుత్రుడు, వసుమిత్రుడు, దేవశర్మ, కాత్యాయనీపుత్రుడు, మౌద్గల్యాయనుడు హేమాహేమీలుగా ఉన్నారు. ఆ పేర్ల సరసన తన పేరూ ఉండాలని కపిలుడు పళ్ళు బిగబట్టి శ్రమించాడు. అనవసరమైన శ్రమ! అర్థం తెలిసిన పదాలను మాత్రమే లోనికి రానిచ్చే వడపోత విధానం (filtering system) మెదడులో లేనందువల్ల కపిలుడి తలలో అర్థం తెలియని పదాలు లక్షాతొంభైవేలు చేరిపోయాయి. ఈ చేర్చివేత కోసం అతడు చాలా ఏండ్లు శ్రమ పడినాడు. మూర్ఖుడు! కానీ

బైట పృథక్జన ప్రపంచానికి అతను ఒక మహా మేధావి. అతని ప్రసంగం ఉందని తెలిస్తే ఆవురావురుమని పై వర్గాలవాళ్ళు వాహనాల్లో వచ్చి దిగుతారు. కొంచం ఆలస్యమైతే అక్కడేదో పెన్నిధి చేతికి అందకుండా పోతుందన్నంతగా హడావిడి పడుతూ సభకు పోతారు. అక్కడేముందనీ? కపిలుడు పదాల మూట విప్పి వీళ్ళ చెవుల్లో పోస్తాడు. చెవుల్లో పోయించుకొని వీళ్ళు అంతమాత్రానికే తమల్ని ఒక విశిష్టమైన వర్గంగా (elite group) భావించుకొని మురిసిపోతారు. మహా మూఢులు! వీళ్ళకన్నా ఏమీ చదువురాని శ్రామికజనంలో ఎంతో ఎక్కువ అధ్యాత్మ సంపత్తి (భక్తి, శ్రద్ధ, పరోపకారత, త్యాగం, తపస్సు వగైరా) కనబడుతుంది.

ఒకనాడు అతుల ఉపాసకుడు* కొందరు మిత్రులతో జేతవనానికి వచ్చి కపిలభిక్షువు కుటీరానికి వెళ్ళాడు. "ఏమడగదలచి వచ్చారు? అడగండి చెబుతాను" అన్నాడు గర్వం తొణికిసలాడుతున్న కంఠస్వరంతో కపిలుడు.

అతులుడు : ధర్మాల గురించి చెప్పండి.

కపిలుడు : ఏ ధర్మాల గురించి? అతీతధర్మాలా? అనాగత ధర్మాలా? ప్రత్యుత్పన్న ధర్మాలా?

అతులుడు : అతీతముల గురించే చెప్పండి.

కపిలుడు : రూపం, వేదన, సంజ్ఞ, సంస్కారం, విజ్ఞానం అని అతీత ధర్మాలు డెబ్బైరెండున్నాయి. దేన్ని చెప్పమంటావు?

అతులుడు : రూపం గురించే చెప్పండి.

కపిలుడు : రూపం మూడు రకాలయ్యా! కుశలం, అకుశలం, అవ్యాకృతం అని. దేన్ని చెప్పమంటావు?

అతులుడు : కుశలమే చెప్పండి.

కపిలుడు : ప్రాణాతిపాతవిరతి మొదలుకొని కుశలాలు ఏడు రకాలుగా ఉన్నాయి.

దేన్ని చెప్పమంటావు?

అతులుడు : ప్రాణాతిపాతవిరతిని గురించే చెప్పండి.

కపిలుడు : ప్రాణాతిపాతవిరతి మూడు రకాలయ్యా! అలోభజం, అద్వేషజం అమోహజం అని. దేన్ని చెప్పమంటావు?

అతులుడు : అలోభజం గురించే చెప్పండి.

కపిలుడు : అలోభజం రెండు రకాలయ్యా! విజ్ఞప్తి అలోభజం, అవిజ్ఞప్తి అలోభజం అని. దేన్ని చెప్పమంటావు?

మెట్టుమెట్టుకీ కొంచెం కొంచెం కోపం పెంచుకొంటూ వచ్చిన అతులుడు సహనం కోల్పోయి చిరాకు ధ్వనిస్తున్న కంఠస్వరంతో “నా తలకాయ చెప్పమంటాను” అని చివాలున లేచి వెళ్ళిపోయాడు.

పోవడం పోవడం నేరుగా బుద్ధుని దగ్గరకు వెళ్ళి జరిగిన విషయం చెప్పి కపిలుని తీరు పట్ల తన నిరసనను వ్యక్తం చేశాడు. బుద్ధుడు అతణ్ణి సముదాయిస్తూ “కపిలుడు గొప్ప పండితుడు. ఆ పాండిత్యం కోసం ఎంతో శ్రమ పడినవాడు. అతనిలోని ఆ శ్రమను గుర్తించి మనం గౌరవం ఇవ్వాలి. ఎవరో ప్రత్యర్థి (opponent) తన లోతు కొలవడానికి వచ్చినవాడు అని నిన్ను చూసి అతను పారబడి నీ చేతికి చిక్కకూడదనుకొని నీ ప్రశ్నను* ప్రతిసారి పరిపృచ్ఛ్య వ్యాకరణీయ ప్రశ్నగా మార్చుతూ వచ్చాడు. మళ్ళీ ఎప్పుడైనా నీవు కపిలుణ్ణి కలిస్తే ఉపాసకుణ్ణని ముందే పరిచయం చేసుకొని మాట్లాడు'' అన్నాడు బుద్ధుడు.

---

* *ప్రశ్నలు నాలుగు రకలు : 1. ఏకాంశ వ్యాకరణీయం, 2. విభజ్య వ్యాకరణీయం, 3. పరిపృచ్ఛ్య వ్యాకరణీయం, 4. స్థాపనీయం. తడుముకోకుండా ఠకీమని జవాబు ఇవ్వడానికి వీలైన ప్రశ్న ఏకాంశ వ్యాకరణీయం. ఉదా. మనుషులందరూ చచ్చేవాళ్ళేనా? అని అడిగితే అందరూ చచ్చేవాళ్ళే. ఎవ్వడూ ఇక్కడ గూటం కొట్టుకొని ఉండబోయేవాడు లేడు అని జవాబు. విభాగం చేసుకొని జవాబు ఇవ్వవలసిన ప్రశ్న విభజ్య వ్యాకరణీయ ప్రశ్న. ఉదా: చచ్చేవాళ్ళందరూ మళ్ళీ పుడతారా? అని అడిగితే :*

→

ఆనాడు భిక్షుసమావేశంలో బుద్ధుడు "నేను వాడే తృష్ణ అనే పదానికి అతి స్థూలమైన అర్థం మాత్రమే ఇచ్చుకోకండి. స్త్రీకి దూరంగా ఉండడంతోనే తృష్ణను జయించేశాము అనే భావనలో పడిపోకండి. తృష్ణకు బహుముఖాలున్నాయి. మీరు దాని ఒక ముఖాన్ని మాత్రమే చూసి 'తృష్ణ అంటే అదే. దాన్ని ఒక కంట కనిపెట్టి దూరంగా ఉంటాను' అనుకొంటే ప్రమత్తుల క్రిందే లెక్కవుతారు. అది మిమ్మల్ని వేరే రూపంలో వచ్చి పట్టుకొంటుంది. కనుక భిక్షువులారా, తృష్ణ యొక్క బహుముఖాలను కూడా గమనిస్తూ జాగ్రత్తపడండి" అని క్రింది శ్లోకం చెప్పాడు.

**మనుజస్య ప్రమత్తచారిణః తృష్ణా వర్ధతే మాలువేవ**
**స ప్లవతే హురహుః ఫలమిచ్ఛన్ ఇవ వనే వానరః** 24-1

జాగ్రత్తలేని మనిషిలో తృష్ణ మాలువాలతలాగా అల్లుకుపోతుంది. ఫలాల కోసం చెట్టునుండి చెట్టుకు దుమికే కోతిలాగా అతడు తృష్ణ వల్ల జన్మనుండి జన్మకు దుముకుతూ ఉంటాడు.

(మాలువాలత సాలవృక్షాన్ని ఆశ్రయించుకొని అల్లుకొంటుంది. బాగా అల్లుకొని ఆ సాలవృక్షాన్ని ఊపిరాడనీయకుండా చేసి చంపుతుంది అంటే నాశనం చేస్తుంది).

---

క్లేశాల మూట ఉన్నవాళ్ళు మళ్ళీ పుడతారు. ఆ మూట లేనివాళ్ళు పుట్టరు అని జవాబు. ప్రశ్నకు ప్రతిప్రశ్న వేసి జవాబు ఇవ్వవలసినవి పరిపృచ్ఛ్య వ్యాకరణీయములు. ఉదా : ఇందుమతి తెలివైనదా? మూర్ఖురాలా? అని అడిగితే ఎవరితో పోల్చి అడుగుతున్నావు? రంగవల్లితో పోల్చి అడుగుతున్నావా? సత్యవతితో పోల్చి అడుగుతున్నావా? అని ప్రతిప్రశ్న వేయాలి. రంగవల్లితో అని చెబితే తెలివైనదే అని బదులు, సత్యవతితో అని చెబితే మూర్ఖురాలు అని బదులు. బదులు ఏమీ చెప్పకుండా మౌనంగా ఉండవలసిన ప్రశ్న స్థాపనీయం లేదా అవ్యాకరణీయం. ఉదా: గాడిద కొమ్ములు ఊదారంగులో ఉంటాయా తెలుపు రంగులో ఉంటాయా అని అడిగితే మౌనమే జవాబు. "కొమ్ములే లేనప్పుడు రంగులెక్కడొస్తాయి కనుక రంగులు లేవు" అని అతిగా వాగి జవాబివ్వకూడదు. ఈ అతివాగుడు జవాబులో దోషం ఉంది (*logial error*). దాని విషయం ఇప్పుడొద్దు. లేదు (అభావం = *negation*) అనే పదాన్ని చాలా పకడ్బందీగా వాడాల్సి ఉంది. ఇష్టం వచ్చినట్లుగా వాడకూడదు. ఇదంతా తర్క విషయం. బుద్ధుడు బదులు చెప్పకుండా మౌనం వహించిన 14 ప్రశ్నలకు అవ్యాకృతములు (*unanswered questions*) అని పేరు.

Note : (ప్రింటింగ్ లేని రోజుల్లో (లేదా లిపి వాడుకకు రాని రోజుల్లో) కపిలుడు లాంటి వాళ్ళ అవసరం సమాజానికి ఎంతో ఉండినది. గ్రంథధారణ చేయగల కపిలుల వల్లనే మనకు ప్రాచీన గ్రంథరాశి లభ్యమయినది. ఆ సేవ వాళ్ళు చేసి ఉండకపోతే పరిస్థితి ఏమిటో? ప్రింటింగ్ వచ్చాక ప్రపంచవ్యాప్తంగా ప్రజల్లో ధారణాశక్తి తగ్గిపోయిందని ఒక పరిశోధకుడు తెలిపాడు. అవసరం లేని కౌశలాలు (*skills*) తగ్గుముఖం పట్టడంలో వింత లేదు. ఇప్పుడు గ్రంథాలనుగానీ గ్రంథభాగాలను గానీ ధారణ చేసుకొని మెదడులో నిలుపుకోవలసిన అగత్యం లేదు. ధారణ కోసం మెదడును వత్తిడికి గురి చేస్తే చివరకు మిగిలేది *dullness and stupidity.* యాంత్రికంగా వల్లె వేయడం లేదా జపం చేయడం వల్ల అనర్థమే ఎక్కువని నా వ్యక్తిగత అభిప్రాయం. కొన్నేండ్లకు ముందు ఒక గౌరవనీయ సన్యాసి "కొన్ని వందల పలానా శ్లోకాలను నీవు కంఠతా పెట్టి రోజూ కొన్ని అధ్యాయాలు జీవితాంతం పురశ్చరణ చేసుకొంటూ ఉన్నావంటే ముకితి (ముక్తిని ఆయన అలానే అంటారు) గ్యారంటీ" అన్నారు. నేను మొత్తాన్ని కంఠతా పెట్టి అర్థాన్ని కూడ స్మరిస్తూ* రెండు మూడేండ్లు రోజూ రెండు మూడు సిట్టింగులలో మొత్తాన్ని పురశ్చరణ గావిస్తూ వచ్చాను. సాధించింది *dullness!* వేదమంత్రాలు, బౌద్ధ పరిత్రాణాల విషయం ఇక్కడికి రాదు. అవి శబ్దశక్తి కలిగినట్టివి. స్వరాన్ని పాటిస్తూ పారాయణం చేస్తే ఉత్పన్నమయ్యే శబ్ద ప్రకంపనములకు విలక్షణమైన ప్రభావం ఉన్నది. ఆ పారాయణ విద్య ఇప్పటికీ ఎప్పటికీ నిలబెట్టుకోవలసిందే. కానీ వాటికి కూడా టేపులు వచ్చేశాయి. టేపుల ప్రకంపనాలకు కూడా శక్తి ఉన్నదా లేదా అనేది పరిశీలకులు తేల్చాల్సిన విషయం.

మనకు కావలసింది ఇప్పుడు కపిలులు కాదు. సృజనాత్మకత (*creativity*) ఉన్నవాళ్ళు. సృజనాత్మకత కేవలం సాహిత్య వైజ్ఞానిక రంగాల్లోనే అవసరం అనుకోరాదు. అధ్యాత్మరంగానికీ అవసరమే. బౌద్ధ యుగం మొత్తం సృజనాత్మకతతో పొంగిపొర్లింది. ఈ సృజనాత్మకత ఉన్నవాళ్ళే ధర్మాన్ని రక్షించగలరు. దేశ సంస్కృతి ఎదుర్కొన్న ఒక క్లిష్టమైన దీర్ఘకాల పరిస్థితిలో సంస్కృతిని కాపాడింది కబీరు, నానక్, తులసీదాసు, రైదాసు, మీరాబాయి, చైతన్య, రామదాసు లాంటివారే. ఆ సృజనాత్మకులు అవతరించినందువల్లే నేడు భారతదేశం అనేది ఒకటి కనబడుతూ ఉన్నది.

---

* దిరిసెన విద్యా పద్ధతిలో - అంటే పదానికి పదం స్మరిస్తూ.

*Note* :- ఈ కథలో ఒకచోట కపిలుణ్ణి మూర్ఖుడన్నాను. అజాగ్రత్తగా వాడిన పదం. మూర్ఖత్వం అనేది ఒక రకమైన రోగం. రోగాలు కంటికి కనిపించవు. ఆయా లక్షణాలను బట్టి ఫలానా ఫలానా రోగం అని నిర్ధారణ చేయడం జరుగుతుంది. మూర్ఖత్వరోగ లక్షణాలు ఐదింటిని ధర్మకీర్తి చెప్పాడు. ఆ లక్షణాలు కపిలునిలో ఏ ఒక్కటీ లేదు. 1. మా గ్రంథం దేవుని నోట్లోనుంచి వచ్చినట్టిది. అందులో 'అగ్ని చల్లగా ఉండును' అనే వాక్యం ఉంది. దాన్ని తప్పని చెప్పడానికి నీవెవడవయ్యా" అనే గ్రంథ ప్రామాణ్యా ధోరణి మొదటి *symptom* (లక్షణం). 2. "ఈ విశ్వం ఫలానా టైములో ఫలానా విధంగా ఫలానా వ్యక్తి నిర్మించి వదలిపెట్టాడు" అని సృష్టి ప్రారంభాన్ని ప్రక్కన కూర్చొని చూసి వచ్చిన మాదిరి మాట్లాడడం రెండవ *symptom* 3. జాతి, కుల, మత, భాష వగైరా దురభిమానాలు మూడవ *symptom*. 4. తనవల్ల ఏదైనా తప్పు జరిగిపోతే దానికి పరిహారంగా దేహాన్ని బాధించుకోవడం (శంకరాభరణం శంకరశాస్త్రిలాగా). 5. స్నానం ఎందుకంటే దేహానికి పట్టిన మురికిని వదిలించుకొనేందుకు లేదా నిద్రమత్తు వదిలించుకొని *refresh* కావడం కోసం. స్నానాల వల్ల ఇంకేవో దైవిక లాభాలు ఒరిగిపోతాయనుకోవడం ఐదవ *symptom*. మొదటి మూడు *symptoms* ప్రపంచవ్యాప్తంగా ఉన్నట్టివి. చివరి రెండు ఈ దేశంలో మాత్రమే కనిపించేవి.



# శూరంగముడు

శూరంగముడు మగధ సైన్యంలో ధానుష్కుడుగా (archer) పని చేస్తూ రాజు అనుమతితో వేణువనంలో చేరి ప్రవ్రజ్య తీసుకొని ఎనిమిదేండ్ల తరువాత భిక్షువయ్యాడు.

ఒకనాడతడు రాజగృహనగరం పెండ్లిమండపం వీథిలో నడుస్తూ దప్పిక వేసి ఒక ఇంటిలోకి వెళ్ళాడు. చేటలోని బియ్యం నుండి రాళ్ళు ఏరివేస్తూ కూచున్న ఒక ప్రౌఢను చూశాడు. ఆమె కూడా తలెత్తి ఇతణ్ణి చూసింది. నీళ్ళిమ్మని ఇతను బొటన వేలిని క్రింది పెదవి మీద ఉంచి సంజ్ఞ చేశాడు. ఆమె చేటను క్రింది ఉంచి లేచి వచ్చి ఒక మూలనున్న మంచాన్ని వాల్చి "కూచోండి" అన్న సంజ్ఞను చేత్తో చేసి లోనికి వెళ్ళింది. ఇతను కూర్చున్నాడు. ఆమె చెంబు నిండా నీళ్ళు తెచ్చి ఇతనికిచ్చింది. చెంబును అడుగులో పట్టుకొని తీసుకుంటే అది నాగరికంగా ఉండదనుకొని అంచులోనే పట్టుకొని తీసుకొన్నాడు. ఆమె చేతి స్పర్శ మృదువుగా తగిలింది. నీళ్ళను త్రాగడం కూడా నాగరికంగానే కొంచెం కొంచెంగా త్రాగుతున్నాడు. ఒక్కసారిగా ఒంచుకొని గుటగుట త్రాగడం లేదు.

ఆమె మాటకారి. అందరితో ఒకే విధంగా మాట్లాడదు. ఆయా స్థాయిల్లో భిన్న భిన్నంగా మాట్లాడగల మేధాసంపత్తి ఆమె దగ్గరున్నది. ఎదుట ఉన్నది భిక్షువు గనుక భిక్షుస్థాయిలోనే మాటలు మొదలెట్టింది. "దేహం అంటూ ఒకటి ఉన్నాక ఇక ఆకలి దప్పికలు తప్పవు కదా! ఆకలి దప్పికలు మనకు తెలిసేది స్పర్శేంద్రియం ద్వారానే అంటారు, నిజమేనా? ఈ స్పర్శేంద్రియం మీద నాకొక సంశయం. మీరు నివృత్తి చేయాలి. మృదుత్వం, కర్కశత్వం, గురుత్వం (బరువు), లఘుత్వం (తేలిక), శీతము, ఉష్ణము ఇవన్నీ స్పర్శేంద్రియం ద్వారానే

తెలుసుకొంటున్నాము. ఇక్కడ నాకొక చిన్న సంశయం. నాలుకలో రెండు ఇంద్రియాలూ పని చేస్తాయి. రుచిని తెలుసుకొనే జిహ్వేంద్రియం ఉంది, స్పర్శేంద్రియమూ ఉంది. ఒక భక్ష్యాన్ని నాలుక మీద వేయగానే ముందుగా కలిగే జ్ఞానం ఏది? భక్ష్యం యొక్క స్పర్శజ్ఞానమూ లేక రుచి జ్ఞానమా? మరో సంశయం. జ్ఞానం కలిగించేవాటిని ఇంద్రియాలనడం బాగానే ఉంది. కొన్ని పనులు చేసేవాటిని కూడా తీర్థికులు ఇంద్రియాలని పేరు పెట్టేసి 'కర్మేంద్రియములు ఐదు' అని రోకటి పాట పాడుతూ ఉంటారు. గొర్రెదాటు మనుషులు! ఆలోచనే చేయరు. పనులు చేసేవాటిని ఇంద్రియాలంటే ఎలా? కంఠం మింగే పని చేస్తుంది, మింగేంద్రియం అనవచ్చా? పళ్ళు నమిలే పని చేస్తున్నాయి, నమిలేంద్రియం అనవచ్చా? కంటి రెప్పలు చేసేంత పని ఇంకే అవయవం చేస్తుంది? దానికేం పేరు పెడదాం? ఉన్మేషనిమేషేంద్రియం అందామా? స్వేదాన్ని విసర్జిస్తూ వేలాది స్వేదగ్రంథులు దేహమంతా ఉన్నాయి. వాటికి సామూహిక నామధేయంగా స్వేదవిసర్జనేంద్రియం అనవచ్చా? తీర్థికులు చెప్పే విషయాలు తీసుకొంటే సంశయాలు పది జన్మలకైనా తీరదు. మాటల్లో మరచాను. ఇంకొంచెం నీళ్ళిమ్మంటారా?" అన్నది అతణ్ణి అదొక విధంగా చూస్తూ.

"మీరు చాలా తెలిసిన విదూషీమణిలాగా (Scholarly Woman) కనిపిస్తున్నారు. మీ వద్ద తెలుసుకోవలసింది చాలా ఉంది. మళ్ళీ ఎప్పుడైనా వస్తాను" అని అతడు లేచాడు.

"నేను ఎప్పటికీ విద్యార్థినిగానే ఉంటానండి. జీవితమంతా నేర్చుకొంటూనే ఉంటాను. మీకు నేర్పేంత పెద్దదాన్నా? మీరు నాకు గురువు. నేను మీ శిష్యురాలిని. దప్పిక వేసినప్పుడల్లా మీరు ఈ శిష్యురాలిని జ్ఞాపకం పెట్టుకొంటే చాలు" అంటూ వాకిలి వరకు వచ్చి అతణ్ణి సాగనంపింది.

* * *

"ఎంత బాగా మాట్లాడింది! ఆ మాటల్లో ఎంత విషయం, ఎంత తియ్యదనం! నేనొక మొద్దు మనిషిని. ఆమె కర్మేంద్రియాల గురించి తమాషాగా మాట్లాడుతుంటే 'హిహిహి' అనడం తప్పించి ఒక్కమాట కూడా పలకలేదు. ఎన్ని ప్రశ్నలేసి ఉండవచ్చు. 'దప్పిక అంటే ఏమి, అర్థం చెబుతావా?' అనైనా అడిగి ఉండవచ్చు కదా! అబ్బ, ప్రపంచంలో ఆమెలా ఒక ఆడమనిషి ఉంటుందా అని! చూసేదానికి సిరిమలా ఉన్నా మాటలు శారిపుత్రుడిలా మాట్లాడింది గదరా! ఆ మాటల తీరు చూస్తే ఎక్కడో భిక్షుణిగా కొన్నాళ్ళుండి వెనక్కి వచ్చిన మనిషిలాగున్నది. ఆమె గురించి ఏమీ అడక్కుండా వచ్చావు గదరా మొద్దు మొహమా! కనీసం పేరైనా అడిగి ఉండవచ్చుగా. సైన్యంలో ఐదేండ్లు పని చేసినందువల్లేమో మనస్సు మందగించిపోయింది. వాగీశుడు* చూడు, ఆడవాళ్ళు కనిపిస్తే ఎంత కలుపుగోలుతనంగా మాట్లాడుతాడు! నేనప్పుడు గమనించనేలేదు, ఒంటిమీద ఒక అలంకారంగానీ ఒక ఆభరణంగానీ ఏమీ లేదు. ఆ చీర కూడా సాదాసీదా చీరే. నిజం, అసలు ఆమె అందం ఆకర్షణ అంతా ఆ చీరను పొందికగా కట్టుకొన్న తీరులోనే..." ఇలా అనేక విధాలుగా శూరంగముడు ఆమె గురించి శుభసంజ్ఞలు (ideas: how nice, how good వగైరా) రేకెత్తించుకొంటూ ఆ దినమంతా గడిపాడు. రాత్రి పడక వేసుకొని కళ్ళు మూసుకొంటే ఆమె విగ్రహమే కళ్ళకు కట్టినట్లుగా కనిపించింది. అదొక విలాసంగా ఆమె గోడకానుకొని హస్తాభినయ సంయుక్తంగా మాట్లాడిన ఆ దృశ్యమే అతనికి గోచరమవుతూ ఉన్నది. అర్ధరాత్రి వరకు నిదర పట్టనేలేదు. ఇక నిదురపోవాలి అనుకొన్నాడు. వితర్కాలు (thoughts) తగ్గకపోతే నిదుర పట్టదు కనుక అతడు పడుకొనే, ఆనాపానసతి కాసేపు చేశాడు. నిదుర పట్టింది.

* * *

శూరంగముడు ఒక అడవిలో ప్రయాణం చేస్తున్నాడు. నెత్తిమీద బరువైన గంపను మోస్తున్నాడు. దాన్ని ఎడమచేత్తో పట్టుకొని ఉండడం కష్టమనిపించి కుడిచేతిలోని కరవాలాన్ని (పొడవుగా ఉండి ఒంపు దిరిగిన కత్తి) ఆమె చేతికిచ్చి నడుస్తున్నాడు. ఒక చెట్టు వెనుక నుండి తటాలున ఒకడు మీదికి వస్తున్నాడు. శూరంగముడు కత్తినిమ్మని ఆమె వైపు చేయి చాపాడు. ఆమె కత్తిని చాలా ప్రేమగా ఆ నల్లటివాడికి ఇచ్చింది. వాడు భయంకరంగా ఒక నవ్వు నవ్వి కత్తిని ఝళిపించి శూరంగముని మీదికి గ్రుడ్లురుముతూ దూకాడు. శూరంగముడు గావుకేక పెట్టూ మేల్కొన్నాడు. "ఏమైంది? ఏమైంది?" అంటూ ప్రక్క కుటీరం భిక్షువులు ఇద్దరు పరుగెత్తుకొని వచ్చారు. "ఏమీ లేదు. ఆర్య సత్యాల్లో మొదటిది (దుఃఖసత్యం) కలలో అనుభవానికి వచ్చింది" అన్నాడు శూరంగముడు. "ఆర్యసత్యాలు తెలిసేది ధ్యానంలో గదా! కలలో తెలియడమేమిటి?" అని గొణుక్కుంటూ వాళ్లు వెళ్ళిపోయారు.

తెల్లవారేదాక ఆ స్వప్నాన్నే ఆలోచిస్తూ ఉండిపోయాడు. ఆ కల ఒక గురువులాగా ఎంతో బోధను కలిగించింది. కలలు బోధనూ కలిగిస్తాయి. "బాబూ, నీ ముఖం నిజరూపం ఒకసారి చూసుకో" అని అద్దాన్నీ చూపిస్తాయి. శూరంగముడికి బుద్ధుని వద్దకు వెళ్ళవలసిన అవసరం లేకుండానే స్వప్నగురుబోధ జరిగింది. అయినప్పటికి శూరంగముడు బుద్ధుని వద్దకు వెళ్ళాడు. తన కల గురించి, దాని పూర్వ భూమికను గురించి ఏమీ దాచిపెట్టకుండా ఆవిష్కరించాడు (revealed).

శూరంగముడు మంచి ఉత్తేజాన్ని పొందేలా బుద్ధుడు క్రింది శ్లోకాన్ని చెప్పాడు.

**సించ భిక్షో ఇమాం నావం సిక్తా తే లఘుత్వమేష్యతి**
**ఛిత్వా రాగం చ ద్వేషం చ తతో నిర్వాణమేష్యసి** 25-10

భిక్షూ, నావలోకి చేరిన నీళ్ళను తోడివేయుము. తోడివేశావంటే నావ తేలిక అయి శీఘ్రంగా తీరం చేరుతుంది.

ఇక్కడ మనస్సునే నావగా చెప్పడం జరిగింది. మనస్సులో చేరిపోయిన చెత్తా చెదారాన్ని తొలగించుకొని తేలిక చేసుకోవడమే సాధన అంటే (emptying of the mind). ఇది చెప్పినంత తేలిక కాదు. ముందు ఏది చెత్త అనేది తెలియాలి. లేకుంటే ఆ చెత్తనే బంగారం అనుకొని చచ్చేంతవరకు గట్టిగా అదిమిపట్టుకోవడం జరుగుతుంది. నానా రకాల చెత్తను రెండు గుంపులుగా చేయవచ్చు. ఒకటి రాగం దిబ్బ, మరొకటి ద్వేషం దిబ్బ. ఈ రెండు దిబ్బలూ తొలగిస్తేనే మనస్సు తేలిక అయి నిర్వాణ తీరానికి వేగంగా చేరుతుంది. ఇది చాలా గంభీరమైన శ్లోకం.



# కర్మపాలుడు

కర్మపాలుడిలో వ్యాయామం (వీర్యం = effort, endeavour, energy, streneousness) తక్కువ. కుసీదుడని (lazy fellow) చెప్పడానికి లేదు. నిరుపయోగ సాహిత్యం అదేపనిగా పఠిస్తాడు, తనూ కొంత సృష్టిస్తాడు. భావాలు తలలో కదలాలంటే పరిశీలన అవసరం కనుక జనాలు ఎక్కువ కనబడే సంతలు, జాతరలు, ఊరేగింపులు, రంగస్థల ప్రదర్శనలు, ప్రధాన విపణివీధులు ఏదో ఒకటి చూచి రావడం అతని దినచర్య. తలిదండ్రులు గతించాక ఆస్తిపంపకాలు జరిగి ఇతనికి రెండు లక్షల వరహాల పైకం లభించింది.

ఒకనాడు అతని వద్దకు చిరకాల మిత్రుడు మహానాగుడు వచ్చాడు. కథా సాహిత్యం మీద కొంతసేపు చర్చించుకొన్నారు. కర్మపాలుడు వ్రాసిన "వైరంభ వాయు మండలం" కథను ప్రస్తావిస్తూ మహానాగుడు "నీవు వ్రాసిన అన్ని కథల్లో ఆ కథ నాకెంతో నచ్చింది. రత్నశ్రేష్ఠి పాత్రను ఎంత చక్కగా తీర్చిదిద్దావో ఆశ్చర్యంగా ఉంది. ఆ కథ వ్రాస్తున్నప్పుడు నీవు సమాధిలో ఉండి వ్రాశావనుకొంటాను. మామూలుగా వ్రాస్తే వచ్చేది కాదది. రత్నశ్రేష్ఠి ద్వారా నీవు పలికించిన ఒక మాట ఆణిముత్యం. 'వ్యాపారంలోకి దిగాలనుకొంటున్నావా? అయితే నా మాటొకటి విను. చేస్తే ఏనుగుల వ్యాపారమే చేయాలి. ఎందుకంటే ఏదో కారణం చేత వ్యాపారాన్ని ఆపివేసినపుడు వస్తువులు కొన్ని మిగిలియుంటాయి కదా! ఆ వ్యాపారం కుండల వ్యాపారం అయ్యుంటే గిడ్డంగిలో మిగిలేవి ఓ వంద కుండలు! అవి ఏం పనికి వస్తాయి జీవితానికి? ఏనుగుల వ్యాపారమే అయితే రెండు ఏనుగులే అనుకొందాము మిగిలినా చాలు కదా శేషజీవితం గడవడానికి'. కనుక మిత్రమా, నీ అద్భుతసృష్టి ఆ రత్నశ్రేష్ఠి అడుగుజాడల్లో నేనూ నడవదలచాను.

